హిందుమత గ్రంథమాల



హిందుమతప్రచారక

ప్రభాకరచక్రవర్తిగారి యుపన్యాసములు

# హిందురాజ్యం

## 1వ భాగము



మొదటికూర్పు 2000 ప్రతులు



ఆంధ్రగ్రంథాలయ ముద్రాక్షరశాల

బెజవాడ

వెల రు 0—2—0.



—: నమస్తే :—

ఈ గ్రంథములపై సర్వాధికారములు

పండిట్

ప్రభాకర చక్రవర్తి గారివి



మొదటి సంవత్సరము ఈ గ్రంథముతో పూర్తియైనది.

**చందాదారులు రెండవ సంవత్సరపు చందా రు 1-8-0 పంపిననేగాని రాబోవు పుస్తకములు పంపబడవు.**



శ్రీ మహాగణాధిపతయే నమః

ఓం నమ ఋషిభ్యః

# హిందురాజ్యం



అనార్యుడు—

ఆర్యమహాశయా! మానవు డొక నిమిషమైనను వ్యర్థమొనర్పక నేదోయొక పనిచేయుచుండును. ఆ పని జయమొందిననేగాని యతనికి తృప్తికలుగదు. ఏపని యైనను తొలుదొల్త నింటిలో ప్రారంభమై పిమ్మట రచ్చకెక్కుచుండును. ఆరంభమగుటకు ఇల్లనునది యొకటి యుండినగదా—మనుజుడు సుశిక్షితుడై లోకమున వ్యవహరించి కీర్తిగాంచును. ఇల్లు కావలయునన్న వివాహమత్యావసరము. అయితే వివాహమనునది సామాన్యమా? కాదు. బ్రతికియున్నంతవరకు ఎడతెగని బాంధవ్యము. అట్టి సంబంధము ఎన్ని విధములనో దృఢపడియున్నది. అందు ముఖ్యమైనది—ఏ యీడుగల పురుషు డెంతవయస్సుగల స్త్రీని పెండ్లాడవలెనో తెలియుటత్యావసరము. కావుననే మి మ్మనేక విధముల ప్రశ్నించి విసిగించితిని. తగిన యుక్తులను, అనుభవములను విదేశీయ భావములు జూపి తుదకు వేదప్రమాణముల గనుపరచితిరి. దానిచే స్త్రీ పురుషుల వివాహవయస్సు తెలిసి నను. సంతస మయ్యెను.

ఇంకను పురాణేతిహాస వైద్యశాస్త్రముల ననుసరించియు ధర్మశాస్త్రములలోను వివాహవయస్సు ఎటుల నిర్ణయింపబడెనో వినవలెననియున్నది. మరియు విధవా వివాహ విషయము - ద్రౌపదికి అయిదుగురు భర్తలుండుకారణము - పతివ్రతా ధర్మములు — రజస్వలా నియమములు — గర్భిణీ విధులు - సత్సంతానపద్ధతులు మొదలగు విషయము లనేకములు కలవు. అవియు మరియొకప్పుడు తెలిసికొందును. ఈ లోపల నతి ముఖ్యములగు కొన్ని విషయముల దెలిసికొనిననే గాని శాంతి కలుగకున్నది. అవి యెవ్వియన—

(1) హిందువు లన నెవరు?

(2) అసలు హిందు శబ్దమున కర్థమేమి?

(3) ఆ పేరు మొదటినుండి యుండెనా? లేక నడుమ వచ్చెనా?

(4) హిందు వనగా దొనిస - దొంగ - యని కొందఱు వ్యాఖ్యాన మొనర్తురు. అదెంతవరకు నిజము.

ఆర్యుడు—

మిత్రమా!. ఈ సంశయములు నిన్నే కాదు వేలకొలది జనుల బాధించుచున్నవి. ఉద్యోగస్థులు - వర్తకులు - కర్షకులు - కార్మికులు - మొదలగువారిలో ననేకులు హిందువులయ్యు హిందూత్వ మన నెట్టిదో తెలియక జీవించుచున్నారు.

శ్లో॥ ఇతః కోన్వాస్తి మూఢాత్మా
యస్తు స్వార్థే ప్రమాద్యతి.

తన సంగతిని తాను తెలియని యెడల నంతకంటె మూఢుడు కలడా ? యని శ్రీ శంకరాచార్యులు నుడివిరి. ఆ జీవితము నిరర్థకముగాక మరేమి ?

హిందువులను బానిసలని నిందించినపుడా—కుంభకర్ణుల వలె నిద్రించుట. ఈ గాఢనిద్ర మన నింకెంతకాలము అలము కొని యుండునో తెలియకున్నది. కాని కాల మెల్లపు డొకే రీతిగ నుండజాలదు. బండ్లు ఓడ లగును; ఓడలు బండ్లగును.

కావున హిందుశబ్దార్థమును గ్రహించి దానిని మానవ హృదయములపై వెదజల్లవలెను. ఉద్యోగస్థులు అధికార బలముచేతను, వర్తకులు ధనమూలముననూ పండితు లుపన్యాసములచేతను, పౌరాణికులు ప్రసంగముల వలనను కథకులు కాలక్షేపముల చేతను గ్రంథకర్తలు గ్రంథరచన లొనర్చియు ఋణవిముక్తులగుట ముఖ్యము.

ఇట్టి పద్ధతులపై మతారాధన మొనర్పబడిన దేశము సుభిక్షమై నూత్న కళలతో ప్రకాశించి కోలుపోయిన యౌన్నత్యమును సంపాదించుకొని విదేశీయులకాదర్శప్రాయమై విఖ్యాతి గాంచగలదు. అట్టి పవిత్రములగు హిందుమత రహస్యములు తెలియ వలయు నన్న సద్గ్రంధ గోష్ఠి యవసరము.

# హిందుమతగ్రంథమాల



ఇది విక్రమ సంవత్సర ఆశ్వయుజ శుద్ధ దశమి యందు బయల్వెడలెను. ఇందు గృహరాజ్యము హిందు రాజ్యము దేవరాజ్యము ధర్మరాజ్యము మోక్షరాజ్యము అను రకము లుండును. ఇప్పటికి గృహరాజ్యమున 11 భాగములు ముద్రింపబడెను. మిగిలినవి నిలుపబడి 12 వది హిందురాజ్యము ప్రారంభమయ్యెను. రెండవ వత్సరమున దేవరాజ్యము, ధర్మరాజ్యము, రెండును మొదలు పెట్టబడును. ప్రతి సంవత్సరము పోస్టేజితో సహా చందా రూ 1-8-0 అగును. 300 పేజీలకు తక్కువ గాకుండా 10 లేక 12 భాగములుగ సంవత్సరము లోపల ముద్రింపబడును. ఎట్టివైన కారణాంతరములచే నీ నియమములకు మార్పులు వచ్చినను చందాదారులు భరింప నర్హులు. ఎందుకన, ఈ గ్రంథమాల ధర్మబుద్ధితో నెల కొల్పబడెను. ప్రతి చందాదారుడుగాని గ్రంథములు కొనినవారుగాని, క్రొత్త చందాదారులను చేర్పించుటకు కృషిసల్పినటుల ఋజువుచేసినయెడల సాధారణముగా పై నియమములు మార్పుచెందవు. ఒకప్పుడు నెలనెలకు పుస్తకములు పంపుటకు వీలులేనియెడల రెండు మూడు నెలలవి కలిపి పంపబడును.

ఏదో యొక పుస్తకము సమయమునకు లేనందున

పంపబడనియెడల దానిని గుర్తునందుంచి మరియొకప్పుడు తప్పక పంపబడునని నమ్మవలెను.

నూతనముగ స్థాపింపబడుటచేతను అవకాశము కలుగక చందాదారులకొరకు తగినంత కృషి జరుగనందునను సకాలమునకు పుస్తకముల బంపుటకు గుమాస్తాను నియమించు శక్తి కలుగనందునను కలుగు లోపములకై చందాదారులు కొంతకాలమువరకు తీవ్రతను పొందవలదని ప్రార్థితులు.

హిందుమత ప్రచారమునకై రాజాధిరాజులో ధనవంతులో పీఠస్థులో చేయవలసినపనిని అల్పగృహస్థులు పూనుకొనవలసిన దశ కల్గినందున లోపములు లేకుండ చేయతగిన బాధ్యత ప్రజలదే యని విన్నవించడమైనది.

అనగా చందాదారులను చేర్చుటయు పోషకులుగా నుండుటయు ముఖ్యములు.

పుస్తకములు వలయువారు,

హిందుమత గ్రంథమాలా మ్యానేజరు

బెజవాడ

సత్యనారాయణపురం

లేక

సికిందరాబాదు

(డక్కన్)

అని వ్రాయవలెను.

హిందుమతస్థుడైన ప్రతివ్యక్తి హిందుమతమునుగూర్చి అనుదినము కొంత తెలిసికొని దానిని తనసాటివారికి తెలుపు చుండవలెను.

ఇందుకై హిందుమత గ్రంథమాల తోడ్పడగలదు.

దేశహితైకాభిలాషు లగు మహర్షు లనేకులు తమరక్తము బలిదానమొనర్చి మనమతమును జీవన్మృతముగజేసి విఖ్యాతిగాంచిరి. వారి పవిత్ర రక్తమున జన్మించిన మనము-లేదా-వారి యుపదేశముల ననుసరించిన మనము పరమపుంతల మైనచో దేశమున కెనలేని ద్రోహ మొనర్చిన వారమగుదుము. ఈ మహాపాపము మనల నెన్నిజన్మములకైన విడనాడదు, కావున నాయనా! మన మెల్లరము ఏక కంఠముతో మతమును ధ్యానించి ఒకేరూపమున సేవించి ధన్యులము కావలెను.

చూడుము—ఏ దేశమైనను విఖ్యాతకీర్తి నార్జించుచున్న దనిన ఆ దేశములో మతబోధ సుస్థిరము లగు బునాదులపై ప్రతిష్ఠింపబడి యున్నదని తెలియుము.

మతము నాశ్రయించిన ప్రతిదేశము భౌతిక సంపత్తినిసంపాదించుచుండుట ప్రతిదినము చూచుచునే యున్నాము. దైవ ధ్యానముచే నీశ్వరానుగ్రహము కలిగి తన్మూలమున మానసికాభివృద్ధి యేర్పడి వివిధసాధనములు లభించి పారమార్థికముతో బాటు ఐహికసంపత్తియు తులతూగుచుండును. మతములో నిట్టి మాహాత్మ్య మున్నదని తెలియుము.

మతము నాశయించని యొక వ్యక్తిగాని సంఘముగాని దేశముగాని కొంతకాలము రాణించినను అందు ఆధ్యాత్మికము శూన్యమగుటచే శీఘ్రకాలమున నశించకమానదు. ఇది పూర్వకాలపు సిద్ధాంత మని హేళనమొనర్చుట యవివేకము. జ్ఞాననేత్రము కలవారు కొంచెము దూరదృష్టితో జూచునెడల సర్వులకు ప్రత్యక్షమగును ఇంతకంటె విపులముగ జెప్ప నవసరము లేదు.

నాయనా! మతమును తెలిసికొనుట యన బలమగు సాధన సంపత్తిని సంపాదించుచున్నామన్నమాట. మతమును తలక్రిందొనర్చిన—కలుగు ఫలమును వినుము.

మత యను శబ్దమును తలక్రిందుచేసి చదివిన నెట్టి యర్థము కల్గునో అట్టిఫలమే మతమును తారుమారొనర్చిన బుద్ధిమంతులకు ప్రాప్తించును.

మత- యనుదానిని తలక్రిందుగా జదివిన యెడల తమ- యని యేర్పడును. సంస్కృతభాషలో తమ శబ్దముయొక్క యర్థమును చూడుము. తమ స్సనగా చీకటి.

మతమందున్న వాడు మతస్థు డనియు, తమమందున్న వాడు తమస్థు డనియు పిలువబడును. మతస్థులు కానివారు తమస్థు లనుట సత్యము. అనగా కటికిచీకటిలో నున్నవారని యర్థము మతస్థులన్ననో వెలుతురునం దుండిరని విశదము. దీనింబట్టి తెలివిగల వారెవ్వరును మతమును విడువజాల రని తెలియుము.

హిందువు లెవ్వరైన నిట నుందు రేని యీ వాక్యములు వినెదరుగాక.

"మహనీయులారా! మేము బ్రాహ్మణులము, శూద్రులము వైష్ణవులము, శైవులము, అని మాటిమాటికి జెప్పుచుందురే, మంచిది. మీరెల్లరొకచోట జేరినపు డితరులు మీరెవరని యడిగిన నేమిచెప్పెదరు. ఒకరు కాటికి, వేరొకరు ఏటికిలాగెదరా? అనగా బ్రాహ్మణులము, శూద్రులము అనెదరా. అయినచో నైకమత్యము లేక చీల్చబడినట్లుండదా. అట్టి సమయమున

మేము హిందువులమని నుడివినపుడుకదా ధన్యులయ్యెదరు. ఇంటియం దెన్ని భేదములున్నను రచ్చకెక్కినపుడు మీరెల్లరొక్కటేయని తెలియవలెను. ఒకవైపు హిందు మత సిద్ధాంతములు ఖండించువారొకరు- ఇంకొకప్రక్క సంఘ సంఖ్యను తగ్గించువారొకరు- వేరొకతావున నిలువనీడలేకుండ జేయువారొకరు- మరియొకచోట ఇది హిందుదేశమే కాదను వారొకరు - ఇటుల విపరీతపురుషులు హిందూత్వముపై దాడి వెడలి గెలియొనర్చుచుండ నోరుమూసికొని కూర్చొందురా? అటులుండుట మానవత్వలక్షణమా? వెంటనే మత గ్రంథపఠన మను శస్త్రముచే తగిన చికిత్స యొనర్చుటకు సిద్ధముకండు. ఇప్పటికే కాలహరణమైనది.

## ఇకనైన హిందు మతగ్రంథముల దెప్పించి చూడుడు

మంచిది. మిత్రమా! నీ వడిగిన ప్రశ్నల కిక ప్రత్యుత్తర మొసంగెద. హిందువు లన నెవరో ఆ శబ్దమున కర్థ మేమో హిందు మతస్వభావ మెట్టిదో తెలిపెదను. హిందుత్వము సర్వ విజ్ఞానయుతమై పరిపూర్ణతత్వమై యొప్పుచున్నది. అందలి

సిద్ధాంతము లతి పవిత్రములు. అదేమి చిత్రమో హిందువునకు జగత్సుఖముకంటె పరలోకసుఖము ప్రీతికరము. అదెట్లనిన మెలకువకల్గినది మొదలు నిద్రించువరకు డొనర్చు ప్రతి కార్యమున దైవధ్యానము మిమిడియుండును. బుద్ధిమంతు లగు హిందువులు మతములేని పను లొనర్పరు. వారికి రాజకీయము, సాంఘికము, శారీరకము అను భేదములు లేవు. వేయేల ఇవియన్నియు మతములోనివే. వీనిలో నెవరే విధముగ సాధించినను తత్ఫలము మతౌన్నత్యమునకే యని యెరుంగుము. కావున వీరెల్లరు మత మను నొక తల్లి యొక్క బిడ్డలే. ఇంతయేల, మతమును దేహముతో బోల్చి చూడుము. కన్నులు, కాళ్ళు, చేతులు మొదలగునవి యన్నియు కలిసి యెటుల దేహమగుచున్నదో అటులనే సాంఘికము, రాజకీయము శారీరకము ఆర్థికము ఆధ్యాత్మికము మొదలగునవి యన్నియు చేరి మతమని వ్యవహరింపబడును.

నిద్రించుట, మేల్కొనుట, మొగము కడుగుట, స్నానమొనర్చుట, ధనార్జనము, వ్యవసాయము, వ్యాపారము మొదలగు పనులన్నియు మత విషయములే. మత మెటుల ప్రతికార్యముతో సంబంధపడుచున్నదో చూడుము. భూగోళమునకు రాదలచిన జీవుడు మొదట పురుష గర్భమున జేరి యటుపై స్త్రీయందు ప్రవేశించును. ఈ సంగతి గ్రహించి (స్త్రీ పురుషు లిరువురు కలియుటకు పూర్వమే వివాహరూపమున బంధించి భార్యాభర్త లని పేరిడెను. పెండ్లియైన పిమ్మట వాచి ఋతుసియమములతో బాటు ఆహార పద్ధతుల విధించి

గర్భాధాన ముహూర్తమును శాసించెను. దైవ వశమున గర్భ మేర్పడెనేని సీమంతపుంసవనములచే సంస్కరించును. గర్భిణీధర్మము లుపదేశించి యా తల్లిని ఆరోగ్యవతిగ నొనర్చును. శిశువు జన్మించిన వెంటనే జాతకర్మచేయించి పదునొకొండవనాడు నామకరణమహోత్సవము గావించును. ఆరవనెలలో అన్నము పెట్టించి మూడవయేట పుట్టువెంట్రుకలు దీయించును. విద్యాసాధనముకై యుపనయనము చేయును. అనంతరము జీవయాత్ర సాగించుటకు వివాహకాండ నడుపును. ఇటుల జీవితాంతమువరకు సంస్కరించుచునే యుండును. అతడు మరణించిన వెనుక అపరకర్మ చేయించును. అంతటితో తృప్తి పడునా, లేదు. మాసికములు శ్రాద్ధము తర్పణము ఈ విధముగ నెన్నియో పురుషాంతరములవరకు ఆతనిని వదలదు. చూచితివా? తనను శరణుజొచ్చినవానిని ఎన్నివిధముల సేవించుచున్నదో. తలిదండ్రులు-రాజు-గురువు మొదలగు వారినిసయితమాజ్ఞాపించి వారిమూలమున నతనిని రక్షించుచున్నది. ఇటుల తోడు నీడవలె కాపాడగల వ్యక్తిగాని, సంస్థగాని ప్రపంచమున వేరొకటికలదా? ఏదేశమందైనను ఇట్టి బాధ్యతగల మతము కలదని యెవరైన దెలుపగలరా? అందువలననే

హిందుమతము ప్రత్యక్షదైవమనుట సత్యము.

ఇట్టి పరమపవిత్రమైన మతధర్మములు తెలియవలెనన్న నెంత మనఃపారిశుద్ధ్య ముండవలెనో యోచింపుము. అప్పుడు కాని మతరహస్యములు బోధపడవు. అంతట ముక్తి నార్జింపవచ్చును. ముక్తి యెందుకని కొందర నుచుందురు. దానితో

పనిలేనివారికి కావలసినది భుక్తియేకదా. ముక్తిని సాధించక కేవలము భుక్తితోనే సంతృప్తిపడెడిజాతి యేదైనా కలదేమో యోచింతము. గాఢముగ విమర్శించిన ముక్తికై యత్నింపక ప్రత్యేక మాహారముతోనే శాంతించెడిజాతి పశుపక్ష్యాది జంతుజాలమని తేలుచున్నది. అట్లైన నిక మానవుని యౌన్నత్యమేమి? ముక్తిని సాధించుటే యతని గొప్పతనమై యుండవలెను. అయితే ముక్తిమార్గమును చూపున దెవరు. మతమే యని తెలియుము. కావుననే మతములేని మనుజజాతి ప్రపంచమున లేకుండెను. ఎచ్చోటనో అడవిమనుష్యులలో మతము లేకున్ననుండుగాక. తుదకు రష్యాలోని బోల్షివిజము నయితము మతము ననుసరించి దైవమును ధ్యానింపవలదని శాసింపలేకపోయెను.

అయిదారువేల యేండ్లనుండి పాశ్చాత్యదేశములలోను 195 కోట్ల వత్సరములనుండి హిందుదేశముననుమతప్రభావము విస్తరించియున్నది.

బౌద్ధ క్రైస్తవ మహమ్మదీయ రాజ్యములు స్థాపింపబడుటకు ముఖ్యసాధనము మతమే యని చరిత్రల సారాంశము చాటుచున్నది. అందు హిందుమత రహస్యములు తెలియదలచిన బుద్ధిబల మొక్కటే చాలదు. ఆత్మబలముకూడా అత్యావసరము. ఏమన ఆ మతము పరమాత్మచే బోధింపబడినది. ఆత్మకు, పరమాత్మకు, పరస్పరము సాదృశ్యమున సన్నిహిత సంబంధముకలదు. అందువలన ఆత్మబలముచే హిందూమత మర్థమగును.

సోదరా! హిందుమతమందలి సర్వోత్కృష్టమగు ప్రభావమును చూచితివా! ప్రపంచమం దెన్ని మతములు లేవు. ఏ మతమున జూచినను "భగవదాజ్ఞచే మేమీ మత రహస్యముల వెల్లడించుచున్నా"మని పల్కెడి ఘట్టములే కలవు. కాని "నేనే దేవుడ నని" వచించెడి పరిస్థితు లెచ్చటను గాన్పింపవు. ఈనాడు ప్రపంచమం దన్ని మతములవారిచే గౌరవింపబడి పారాయణ మొనర్పబడుచుండిన శ్రీమద్భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ

శ్లో॥ "అహం ప్రభు రహం గతిః"
నేనే దేవుడ నని వెల్లడించెను.
శ్లో॥ "మామేకం శరణం వ్రజ"

తనను నమ్మిన న్యాయముగ మోక్ష మిత్తుననియు నభయ మొసగెను. హిందుమతమందలి గొప్పతన మింత కంటె మరేమి కావలె. ఇక నితర మత ప్రవక్తల ధోరణి చూడుము.

ఏసుక్రీస్తు శ్రీకృష్ణ పరమాత్మవలె తానే దేవుడ నని చెప్పక తనను నమ్మిన భక్తుని గురించి దేవునితో విన్నవింతు నని బోధించెను.

మహమ్మదు నయితము దేవుడనని తెలుపక తాను దైవభక్తుడ ననియు తన వాక్యములు పాటించిన యెడల దైవ మార్గము జూపెదననియు ప్రకటించెను.

ఇట్లే యింకననేక మత ప్రవక్తలు తామే దైవముగాక తమకన్న నన్యమగు దైవపదార్థము మరియొకటి కలదని

తెలుపుకొనిరి. దీనింబట్టి సాక్షాత్తుగ భగవంతునిచే బోధింప బడిన హిందుమత మందలి పవిత్రతను గూర్చి తెలిసికొనుటకు పరిశుద్ధాత్ములకు మాత్రమే చెల్లుపాటగును.

ఇక ప్రస్తుత విషయమునకు వత్తము. విమర్శించుచో ప్రపంచమున గల పదార్థములన్నిటిలో శుద్ధమైనది పర బ్రహ్మము. అందనంత శబ్దములు కలవు. కావున నా దైవము శబ్ద బ్రహ్మ మని పిలువబడును. అట్టి శబ్దసముదాయమే వేదము. ఆ వేదము హిందుమతమునకు బునాది. దానిపై ధర్మశాస్త్రములు, పురాణములు, ఇతిహాసములు అను గొప్ప భవనము నిర్మింపబడి జీవులకు సర్వసౌఖ్యప్రద మగుచున్నది. ఈ మతము యొక్క మహిమ తెలియ వలెనన్న వేదార్థమును గ్రహించు శక్తి యవసరము. అట్టి తెలివి శుద్ధాత్మునకు గాని కలుగదు. కావున హిందుమతము జ్ఞానుల సొమ్మైయున్నది.

ఆత్మబలము లేక కేవలబుద్ధి బలముచే వేదసిద్ధాంతముల నెటుల ఖండింప వచ్చునో చూడుము.

కోటి వత్సరములకు పూర్వము దశరథుడు హిందు దేశమునకు ప్రభువుగా నుండెను. అతని యాస్థానమున ననేక పండితులుండిరి. అందు జాబాలి యను నొక బ్రాహ్మణుడు మంచి సమర్థుడు, ఆత్మబలము లేక కేవల బుద్ధిబలముచే వాదించువారెంత యవివేకులో లోకమునకు ప్రదర్శింపదలచి

శ్లో॥ తస్మాన్మాతా పితా చేతి రామ! సజ్జేత యో నరః।
ఉన్మత్త ఇవ సజ్ఞేయో నాస్తి కశ్చిద్ది కస్యచిత్.

ఓ రామా! నీతండ్రి మరణించినందుకు దుఃఖింపకుము. ఏలనన గతించినవారికి జీవించినవారితో సంబంధములేదు. వ్యర్థముగా శ్రాద్ధము పెట్టనేల? అటులొనర్చువారు ఉన్మత్తులు.

శ్లో॥ అష్టకా పితృదైవత్యం ఇత్యయం ప్రసృతోజనః
అన్నస్యోపద్రవం పశ్య మృతోహి కిమశిష్యతి.

శ్రాద్ధమువలన పదార్థము వ్యర్థమగునేకాని ప్రయోజన ముండనేరదు. ఏమన మరణించినవాడు తినగలడా?

శ్లో॥ యదిభుక్త మిహాన్యేన దేహమన్యస్య గచ్ఛతి।
దద్యాత్ప్రవసత శ్శ్రాద్ధం నతత్పథ్యశనం భవేత్.

ఒకని తండ్రి పరదేశమేగ ననుకొనుము. ఒక బ్రాహ్మణుని బిలచి భోజనమిడిన పరదేశమందున్న తండ్రికి కడుపు నిండునా? ఇచ్చట బ్రాహ్మణుడు తినిన నీ లోకమందున్న తండ్రికే తృప్తికల్గనపుడు చనిపోయి ఎక్కడో అంతులేని పరలోకమందుండిన నీ తండ్రి భుజించు ననుకొనుట వెఱ్ఱిగాక మరేమి?

శ్లో॥ దాన సంవననా హ్యేతే గ్రంథా మేధావిభిః కృతాః
యజస్వదేహి దీక్షస్వ తపస్తప్యస్వ సంత్యజ.

ఒకవేళ శ్రాద్ధములు పెట్టవలెనని శాస్త్రముల జూపెదవేమో. వానిని రచించినది కుక్షింభరులగు బ్రాహ్మణులు కారా. "యజ్ఞము లొనర్పుడు. మేము చేయించెదము. దానము లొసంగుడు. మేము పట్టెదము. [illegible] పరలోకప్రాప్తియు మాకు ఇహలోక భుక్తియు [illegible]ల్గును" అని

తంత్రిజ్ఞులగు విప్రులు తెల్పిరి. స్వార్థపరులగు బ్రాహ్మణులచే రచింపబడిన గ్రంథములు ప్రమాణములు కాజాలవు. కావున నీ తండ్రికి శ్రాద్ధము పెట్టకుము. అని తెలిపెను.

(వాల్మీకిరామాయణము)

ఈ యుపదేశము లాలకించిన వెనుక శ్రీరామచంద్ర భగవాను డేమి పల్కెనో చూడుము.

శ్లో. భవాన్ మే ప్రియకామార్థం వచనం యదిహోక్తవాన్
అకార్యం కార్యసంకాశం అపథ్యం పథ్యసమ్మితం

ఓ బ్రాహ్మణుడా! నా లాభమును గోరియే నీవు మాట్లాడియుందువు. కాని నీపలుకులు వినదగినవికావు. అవి వేద విరుద్ధములు. అందువలన అకార్యములు. అనగా చేయ దగినవికావు. చూచుటకు కార్యములవలె బొడకట్టును. పథ్యములవలె గనపడి యాచరించిన పిమ్మట నపథ్యములై దుఃఖమొనగూర్చును.

శ్లో. అనార్య స్త్వార్యసంకాశః । శౌచాద్ధీనః తథా
శుచిః । లక్షణ్యావ దలక్షణ్యో దుశ్శీలః

శీలవానివ ॥ నీవు చెప్పినది ఆర్యధర్మమని తలచుచున్నావు. కాని అది అనార్య సిద్ధాంతము. ఎందుకన ఆర్యులు శ్రాద్ధమును విడువరు. ఇంతియే గాక మాటిమాటికి శుద్ధి శుద్ధి యని పలుకుచుందువు. నీవు తలచినది శుదికాదు. అశుద్ధియని యెరుంగుము. నీశీలము సయితె మంచిదియౌ.

శ్లో. అధర్మం ధర్మవేషేణ యదీమం లోకసంకరం
అభిపత్స్య శుభం హిత్వాక్రియావిధి వివర్జితం.

మరియు అధర్మమును ధర్మరూపమున ప్రదర్శించుచున్నావు. నీ బోధ సంకరమునకు హేతువై లోకసంకట మగును.

శ్లో. బహుమంస్యతి మాం లోకే దుర్వృత్తం లోకదూషణం.

నీ యుపదేశముల ననుసరించి వర్తింతునేని లోకదూషణమునకు పాత్రుడ నగుదును.

శ్లో. సత్య మేవానృశంసంచ రాజవృత్తం సనాతనం

అసలు రాజవృత్తిసనాతనంబగు ధర్మరూపమైయున్నది.

శ్లో. యద్వృత్తాస్సంతి రాజానః తద్వృత్తాస్సంతి హి ప్రజాః

పరిపాలకుల ననుసరించి ప్రజాధర్మములు వర్తిల్లును. సర్వమునకు రాజే కారణము. ఏ దేశమున జనులు జ్ఞానశూన్యులై యుందురో ఆదేశమున కధిపతియగు రాజు అవివేకి యనబడును. కావున నేను మూఢుడనై శాస్త్రమును విడిచినప్రజలయం దీ దురాచారము వ్యాపించి తన్మూలమున వారితో గూడా నేను నరకమున కరుగవలసియుండును.

శ్లో. నిందా మ్యహం కర్మ పితుః కృతం త
ద్యస్త్వా మగృహ్ణాత్ విషమస్థబుద్ధిం
బుద్ధ్యా౽నయైవం విధయా చరంతం
సునాస్తికం ధర్మపథా దపేతం.

నీవంటివానిని సత్పురుషుడని భ్రమించి సంస్థానమం

దుంచుట మా జనకుని లోపము. గురువైనను, తండ్రియైనను, బ్రాహ్మణుడైనను ధర్మద్రోహ మొనర్చినపుడు క్షమార్హుడు కాజాలడు.

శ్లో॥ యథాహి చోరః స తథా హి బుద్ధః
తథాగతం నాస్తిక మత్ర విద్ధి.—

ఆత్మతత్త్వ మెరుగక నెవడు బుద్ధిబలమునే యాధారముగా గొని వాద మొనర్చునో అతడు బుద్ధమతస్థు డనబడును. అతనిది దొంగబుద్ధిసుమా. నాస్తికు లనువారు వేరుగ లేరు. పై విధముగ వాదించువారే నాస్తికులు. నేను ఆస్తికుడ గావున మరణించిన మా తండ్రికి శ్రాద్ధకర్మ చేసెదను అని శ్రీరామచంద్రుడు సమాధాన మొసగి కృతకృత్యు డయ్యెను.

రాము డన సామాన్యుడా! ఎవ్వాడు జగత్కర్తయగు బ్రహ్మను సృజించి యతనికి వేదము లొసగెనో ఆ మహాత్ముడే రాముడు. వేదార్థ మెరింగిన ధీరు డెవ డన శ్రీరామచంద్ర భగవానుడే. అతని గుణము లెవ్వియో వినుము. కరతలామలకమగు రాజ్యమును దృణప్రాయముగ నొనరించెను. అరణ్యవాస మొనర్చు తరి రాజ్యమేలు మని భరతు డెంత ప్రార్థించినను ధర్మరక్షణపై నిలిచి అందుల కంగీకరింపకుండెను. భ్రాతృద్రోహియగు వాలిని సంహరించి ధర్మాత్ముడగు సుగ్రీవుని రాజ్యమం దుంచెను. శత్రుపక్షమునుండి యరుదెంచిన విభీషణుని సంశయింపక రక్షించి లంకాధిపతిగ నొనర్చెను. ప్రజాభిప్రాయ మెరిగి పాలింపవలె నను తలంపున రజకుడాడిన దుర్భాషలపై నిండు గర్భవతియగు జానకిని వనవాసమున

కప్పగించెను. ఆత్మబలముగల రాముని వాక్యముల వింటివా ? నిజమైన వేదధర్మమిట్లుండును. జాబాలివంటి వేషధారులకు పవిత్రముగు హిందుమతము బోధపడదు.

ప్రభువేషమును ధరించిన నటకుడు నిజమైన రాజు కాగలడా ! హాస్యగాడు దొరవేషమును వేసికొని కలెక్టరు నని చెప్పినంత మాత్రమున గౌరవింపబడునా. ఆర్యధర్మముల దల క్రిందొనర్చి అవియే వేదధర్మములని ఘోషించువారు కూడా పైవారివలెనే వ్యర్థు లగుదురు. కొయ్యతో జేసిన ఏనుగును గజేంద్రుడని పిలచినను నిజమైన యేనుగు కాజాలదు. ఎంత యత్నించినను కాకిబంగారమును, మేలిమి బంగారముగ మార్చ సాధ్యపడదు. రాతివెండి-నిజమైన వెండివలె గౌరవముపొందదు. కుక్కగొడుగు (పుట్టకొక్కు) సయితము గొడుగనబడి ప్రయోజనములేదు. పేరుపెట్టుకొనిన మాత్రమున నవి నిజమైన వస్తువులు కావు. అటులనే పైపై మాటలు జూచి యిదియే యార్య మతమని భ్రమింపకుము.

సనాతన ధర్మము - ఆర్య ధర్మము
భారత ధర్మము - హిందు ధర్మము

ఇవి వేరువేరుగ గన్పడినను ఇవి యన్నియు నొక్కటే. హిందువులన నెవరో వారి మతమెట్టిదో యిప్పుడైన తెలిసికొని యుందువు.

అనార్యుడు—

అయ్యా! హిందుమతము బహుశుద్ధమైనదనియు, దైవ

నిర్మిత మనియు నుడివితిరి. అందలి సిద్ధాంతములు పైవిషయ ములరుజువుచేయగలవా.

ఆర్యుడు —

మిత్రమా! వినుము. మలినము లేకుండుటకే, శుద్ధమని పేరు. మలినమనగా హీనమని యెరుంగుము.

హీనమును దూషించినగాని శుద్ధస్థితి యేర్పడదు. అట్టి పవిత్రత హిందుధర్మ మందున్నది. పైభావము హిందుశబ్ద మందుండుటచేతనే అది హిందుమత మనబడెను. హీనమును దూషించనిది పరిశుద్ధభావ ముదయించదు. దీనినే మరియొక విధముగ జెప్పవచ్చును. ఎట్లన శుద్ధస్థితి లేనిది హీనమును దూషించుటకు సాధ్యపడదు. అయితే "హిందు" అను రెండ క్షరములలో పరిశుద్ధభావ మెంతవరకు కలదో విమర్శింతము. హీనమును దూషించి యిక ప్రేమింపవలసిన దెద్దియని ప్రశ్నించుచో

పరిపూర్ణమై, శుద్ధమై యానందరూప మగు పదార్థమే ప్రేమార్హమని ప్రత్యుత్తరము వచ్చును. దానినే పరబ్రహ్మ మని పెద్దలు వచింతురు. అది జీవపోషకమై సర్వవ్యాపకమై యున్నందున తద్బోధకంబగు హిందుమతము నయితము పై గుణముల గ్గియున్నది. ఎట్లన, లోకమందున్న మతములన్ని టిని జీవింపజేయు శక్తి అనగా పోషించు స్వభావము, హిందుమతమున గలదు.

శ్లో॥ ఏతద్దేశప్రసూతస్య సకాశాదగ్రజన్మనః
స్వంస్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వ
మానవాః॥ మనుస్మృతి.

ఎచ్చటెచ్చట నేయే దేశములుకలవో అవి యన్నియు తమ చరిత్రలను హిందువులనుండి నేర్చుకొనెనని మనుప్రభువు వచించెను. ఇతర మతములలోని సిద్ధాంతములు నయితము హిందుమతమున నెచ్చటనో యొకమూల నిమిడియున్నవి. ఇంత కంటె పోషకత్వము, వ్యాపకత్వము, వేరొండుకలదే! ఈ విషయములలో సందియముకలదేని వేరొక సారి ప్రశ్నింపుము.

ఇక హిందుమతముయొక్క పవిత్రతను చూడుము. ప్రతిమతమును సహించి గౌరవించును. ఎవరి మతమున వా రుండవచ్చునని యుదారతను ప్రకటించును. ఇతర మతములు నరకహేతువు లని దౌర్జన్య మొనర్పదు. మీ మీ మతముల విడచి నాలోనికి రమ్మని పురిగొల్పదు. అటు లొనర్చిన, పరస్పర ద్వేషము లంకురించి యశాంతి ప్రబలు నని యెరుగును. ఆయా దేశ భేదముల ననుసరించి మనుజుల నుద్ధరించుటకు వివిధమతము లేర్పడె నని విశ్వసించును. కావున వానిని మాపుమాపుటకు విదేశములపై దాడి వెడలదు.

శ్లో. యే యథా మాం ప్రపద్యంతే
తాం స్తథైవ భజామ్యహం.

ఎవరెవ రేయే విధముగ సేవించిన వారివారి నాయా విధముగ రక్షించుటకు దేవు డొకడు సంసిద్ధుడై యున్నాడని

యుభయమిచ్చును. అంతియేకాని ఫలానా దేవుడే మోక్షకర్త యనియు, తదితర దేవత లసమర్థులనియు వచింపదు. అనగా అల్లా యెహోవా శంభో కృష్ణా యని యేపేరునైనను తలచి ధన్యులుకావచ్చునని డిండిమము మ్రోగించును. అయితే ఆమార్గములలోని భేదములనుబట్టి మోక్షము కొంచెము ముందు వెనుకలతో నుండునని తేటపరచును. పరమతస్థులు హిందు దేశమున కరుదెంచునెడల నాతిథ్య మొసంగును. అంతియేగాక నొకప్పుడు సర్వసమర్పణము సయితము చేయుచుండును.

విదేశస్థుల విషయమే కాదు. మానవేతర జాతులగు పశుపక్షి వృక్షముల సయితము ప్రేమించును. అదెటులనో వినుము.

నమో వృక్షేభ్యః = వృక్షములను
నమశ్శ్వభ్యః = కుక్కలను
నమో అశ్వేభ్యః = గుర్రములను
నమో అస్తు సర్పేభ్యః = పాములను

ఈవిధముగ సర్వజీవరాశిని ప్రేమించి నమస్కరింపుమని వేదమూలమున హెచ్చరించెను. గోపూజ గజపూజ గరుడపూజ నేటికిని హిందుమతమున జూచుచున్నాము. నాగపంచమి నాడు విషజంతువులగు పాములకు సయితము పాలు పోయబడును. రావిచెట్టు తులసి పవిత్రవృక్షముగ పూజింపబడును. ఎందుకన, నందు దైవశక్తి కలదని నమ్మెను. ఆ దైవశక్తి నిరాకారమగుటచే అది యిమిడియుండిన వస్తువులగుండా సర్వేశ్వరుని భజింపుడని బోధించును. దేవుడు విశ్వరూపుడని

హిందుమత సిద్ధాంతము. కావున విశ్వమందున్న ప్రతివస్తువు దైవరూపమే యని భావించును. దేనిని ద్వేషించినను దేవుని దూషించినట్లే యని తెలుపును.

భుజించుటకు పూర్వము పాలు పితికినంత కాలము గృహద్వారమున నిలుచుండి భూతశాంతి యొనర్పుమని యెటుల బోధించుచున్నదో చూడుము.

శ్వభ్య శ్శ్వపచ వాయసేభ్యః క్రిమిభ్య ఇదం నమమ.

కుక్కలకు, మాంసభక్షకులకు, కాకులకు, క్రిమికీట కములకు, గొంత యన్న మొసంగు మని యాదేశించును.

శ్లో. పాపో వా యది చండాలో విప్రఘ్నః పితృఘాతుకః
వైశ్వదేవేతు సంప్రాప్తే సోతిథి స్స్వర్గ సంక్రమః

పాపులు-పంచములు-బ్రాహ్మణహంతకులు-పితృఘాతుకులు-మరియు నెట్టి కటికివారైనను సరియే తన గృహ సమీపమునుండి పోవుచున్నయెడల గౌరవించి మంచిమాటలతో భుజింప చేయుడని యాజ్ఞాపించును. చూచితివా హిందుమత ప్రభావము. ఎంత భూతదయ! మనశ్శుద్ధి లేనిచో సేవనులు జరుగవు. ఎటుల పరమేశ్వరుడు దయాసముద్రుడో అటుల హిందుమతము నయితము ప్రేమపూరితము. ఇక హిందుమతమునకును, దేవునకును భేద మెక్కడ.

నిజముగా సీమతము—ప్రభుమతము—జీవన్మతము—దైవమతము— అని యెరుంగుము.

హీనబుద్ధిని దూషించుటలో హిందుమతముయొక్క గొప్పతన మిమిడియున్నదని మరువకుము.

శుద్ధమైన వస్త్రమునకు మురికిపట్టుట యెంతసులభమో తెలిసియుందువు. ఆగుడ్డ మాయకుండుట కెంతయో శ్రద్ధ వహించుచుందుము. మురికిగుడ్డలవారిని దరిజేరనీయము. నేలపై గూర్చొనము. ఈ నియమము లెందుకో తెలియునా. శుద్ధవస్త్రములు చెడకుండుటకే. అంతియేకాని మురికిగుడ్డలవారిపై ద్వేషముచేకాదు. ఒక యుద్యోగి తన మేజాబల్లపై కుక్క నెక్కించుకొనును. బీదయింటి బాలుడు గదిలోనికి వచ్చిన నతనిని బల్లపై గూర్చుండబెట్టడు. కుక్కకంటె మనుజుడు తక్కువనియా యతని యూహ? ముమ్మాటికి కాదు. గొప్పమేడలలో పిల్లులు కుక్కలు తిరుగుచుండును. అటులనే తమకు దెలియని మనుజులను ఆ గృహస్థులు రానియ్యరు. దీనింబట్టి కుక్కలకంటె నరులుహీనులని భావమా? ఒక శయ్యపైగల దంపతులు తమవద్దకు వచ్చిన పిల్లలనుజూచి అది దోషమని యెంచరు. అట్లే పెద్దలను రానిత్తురా. లేదు. అందువలన పెద్దలకంటె పిల్లలు జ్ఞానులనియా? ఇట్టి ప్రశ్నలకు జవాబులు లేవనుట వెర్రితనము. పై విషయములు బోధపడిన యెడల పరిశుద్ధతను కాపాడుకొనుట మానవధర్మ మని తేలుచున్నది. ఇదే విషయమును వేరొకరీతిగ జెప్పదలచినయెడల హీనస్థితిని తొలగించుటయే అనగా దూషించుటయే మానవధర్మమని సారాంశము. అట్టి విశ్వసత్యమైన ధర్మము హిందుమతమున ప్రతిష్ఠింపబడె నని గర్వింపవలసియున్నది.

అయితే ఒక ప్రక్క పారిశుద్ధ్యమును కాపాడుకొనవలె నని మనుజులందు సహజగుణ ముండినను రెండవవైపు దానిని చెడగొట్టు తత్వము నయితము స్వాభావికమై యున్నది.

ఇటుల మానవులలో శుద్ధికొరకై యత్నించువారు కొందరు - దానిని భంగపరచువారు మరి కొందరు - ఇటుల రెండు తరగతులుగ నున్నారు. అందలి ప్రథమపక్షము తద్విరుద్ధమగు రెండవపక్షముచే వివిధబాధ లనుభవించుచుండును. శుభ్రము, ధర్మము, ఎచ్చటనుండునో అచ్చట కష్టములు కల్గుచుండుట సర్వసాధారణము.

కనుకనే సత్యసంధుడగు హరిశ్చంద్రుడు శ్మశానవాటికయందు కావలికాయవలసివచ్చెను. ధర్మరాజాదులు అరణ్యములపాలైరి. ద్రౌపది, సీత, సావిత్రి, మొదలగు సాధ్వీమతల్లులు అగ్నిపరీక్షలకు గురి కావలసివచ్చిరి. అటులనే యొకప్పుడు పరిశుద్ధమగు హిందుమతము నయితము ఎన్నియో యిబ్బందులకులోనై తుదకెప్పుడో దినదిన ప్రవర్ధమానముగుచు రాణించగలదు.

ఆ కష్టములగూర్చి మేరుతంత్రమను మంత్రశాస్త్రమెటుల వర్ణించెనో చూడుము.

శ్లో. హుంఫట్ స్వాహేతి మంత్రోయం యుగాష్టనగవర్ణవాన్
* * * *
దత్తాత్రేయ ప్రియతమం షడంతం హృది విన్యసేత్.

---

* హిందుమతమునకు గల్గిన కష్టము శాశ్వతముగ నుండదు. అది యెపుడు తొలగునో ఆ విషయమును గురించి "హిందూరాజ్యముయొక్క" రెండవ భాగమున తెలుపబడును.

పార్వతితో శివు డీ క్రిందివిధముగ దెలుపుచున్నాడు. ప్రియా! దత్తాత్రేయున కభీష్టమగు మంత్రమొకటి కలదు. కార్తవీర్యార్జును డద్దాని జపించి ధన్యుడయ్యెను.

శ్లో. పశ్యేత్ సమ్యక్ సర్వపశూన్ గృహాభిముఖ మాగతాన్.

ఈ మంత్రసామర్థ్యమువలన దొంగలచే నపహరింప బడిన పశువులు తమంతట తామింటికి రాగలవు. అంతియే కాదు. ఇంకను చూడుము.

శ్లో. దశదిక్షు జపే న్మంత్రం రాష్ట్రే రక్షణం భవేత్. 143

సర్వదిశలయం దా మంత్ర మొకేసమయమున జపింప బడినయెడల దేశరక్షణము కాగలదు. అత్యాశ్చర్యకరము లగు నిట్టి మంత్రము లింకెన్నియో హిందుమత గ్రంథములందు కలవు. వానిని జపించియే భారతీయులు కార్యసిద్ధుల బడయు చుండిరి. కాని యికముందు వారికి మంత్రములం దంతగా లక్ష్య ముండదు. అందువలన భ్రష్టులై రాజ్యమును గోల్పోయి దుఃఖము లనుభవింతురు. ఈ దుస్థితి యెపుడు సంభవించునో వినుము.

శ్లో॥ పశ్చిమామ్నాయ మంత్రాస్తు ప్రోక్తా
శ్చారబ్బభాషయా అష్టాశతా న్యశీతిశ్చ ఏషాం
సంస్థాపనా కలౌ

అరబ్బీ భాషలో లిఖింపబడి పశ్చిమామ్నాయ మంత్ర ములతో నొప్పు మతము హిందు దేశమున కొకప్పుడు రాగలదు.

శ్లో॥ హిందుధర్మ ప్రలోప్తారో జాయంతే చక్రవర్తినః—

ఆ సమయమున హిందుధర్మమును నశింపజేయు చక్రవర్తులు పుట్టెదరు. చూచితివా-హిందుమతమునకు కలుగనున్న ఆపత్సమయము. పరిశుద్ధమైనది కనుకనే యీ మత మొకప్పుడు బాధలకు గురికావలసివచ్చెను.

ఇక హిందుశబ్దార్థమును వినుము. అప్పుడు హిందుమత ప్రభావము తెలియగలదు.

శ్లో॥ హీనంచ దూషయత్యేవ
హిందు రిత్యుచ్యతే ప్రియే!
హీనం = హీనమైదానిని
దూషయత్యేవ = దూషించుచున్నందుననే
హిందుః ఇతి = "హిందు" అని
ఉచ్యతే = పిలువబడుచుండెను.

ఇంతటి పరిశుద్ధమగు మతము క్షీణించుటకు ఇంకొక సమయముకూడా కలదు.

శ్లో. పూర్వామ్నాయే నవశతషడశీతి ప్రవర్తినః
ఫిరంగిభాషయా మంత్రా స్తేషాం సంసాధనా ద్కలి.

పూర్వామ్నాయ సంబంధమగు మతము ఫిరంగిభాషలో వ్రాయబడియున్నది. అదియెప్పుడు భరతఖండమునకు జేరునో హిందుధర్మమపుడు చాలాభాగము క్షీణింపగలదు.

శ్లో. అధిపా మందరాణాంచ సంగ్రామేష్వ
పరాజితాః । ఇంగ్రేజా నవగర్వాశ్చ లండనేష్వపి
భావినః

ఆ మతస్థు లతిపరాక్రమవంతులై యుద్ధములలో జయ మొందు చుందురు.

లండనేష్వపి = లండను మొదలగు పట్టణములలో వసించి
ఇంగ్రేజాః = ఇంగ్లీషు భాషను మాట్లాడుచు దానిని సర్వత్ర వ్యాపింప జేతురు.

శ్లో. బహువిద్యాని దృశ్యానః ప్రవక్తారో మనోరథ
వివిధవిద్యల నేర్చి తమ్ముతాము మతప్రవక్తలై మనోరథముల బూర్తిజేసికొని ప్రఖ్యాతి గాంతురు. అని శివుడు తెలిపెను.

53 శ్లో॥న హామినాం హితార్థంతు మంత్రవీర్యం ప్రయోజయేత్
న ప్తజన్మసు దారిద్ర్యంపైశాచ్యం ప్రాప్నుయాత్ ద్విజః॥
బ్రాహ్మణులు పైకార్యములకు తోడ్పడుదురు. అందు వలన నేడుజన్మములవరకు వారు దారిద్ర్య మనుభవింతురు.

ఇతి శ్రీ మహామాయామహాకాలానుమతే మేరుతంత్రే శివ ప్రణీతే కార్తవీర్యార్జున మంత్ర కథనం నామ పంచత్రింశత్తమః ప్రకాశః—(35 వ ప్రకాశం)

మిత్రమా ! ఈ విధముగ పూర్వ పశ్చిమామ్నాయ మతములు బయలు వెడలి హిందుమతమునకు ముప్పు కలుగ జేయును. జగచ్ఛక్షు వగు సూర్యభగవానుడు సయితము రాహు కేతువులచే గ్రసింపబడి తేజోరహితుడై యుండుట లేదా.

భగవన్మతమగుటచే నిదియు ప్రత్యక్షదైవమగు శ్రీ సూర్య నారాయణుని స్థితిని వహించుటయు సహజమే.

అనార్యుడు—

అయ్యా! మనమత మింత గొప్పదే, ఇట్లుండ మొదటి నుండి హిందుమత మనియే దీనికి నామకరణమా? లేక నీపేరు నడుమవచ్చెనా?

ఆర్యుడు—

మిత్రమా! నీప్రశ్న చాలా బాగుగ నున్నది. ప్రత్యు త్తరము లోకానుభవముచే దెలిపెదను. సాధారణముగ ప్రత్యక్ష నామముల కంటె పరోక్షనామములకే గౌరవముండును. ఈ సంగతి, లోకానుభవమే గాక వేదసిద్ధమై యున్నది.

"పరోక్షప్రియా ఇవహి దేవాః"

కృష్ణయజుర్వేదము.

పవిత్రులగు దేవతలు తమకు ప్రత్యక్షముగ నున్న నామములచే గాక, పరోక్షనామములచేతనే తృప్తి చెందెదరట. వారి వారి మహిమలను బట్టి యీ పరోక్షనామములు ఏర్ప డును. చిన్నతనమున పెట్టబడిన పేరు ప్రత్యక్షనామమనియు వారి ప్రభావమువలన నడుమ యేర్పడిన నామము పరోక్ష మనియు తెలియుము. ఇట్టి యాచారము మానవులలో సయి తము విస్తరించియున్నది.

పై రీతిగనే పరిశుద్ధములగు మతములకు కూడా పరోక్ష నామములు ప్రాప్తించును.

(1) మన మతమునకు తొలుదొల్త
సనాతన ధర్మమని పేరు

(2) ఆ ధర్మము ఋషులనూాలమున వెల్లడింపబడుటచే
"ఆర్షం ధర్మోపదేశం చ" మనుస్మృతి
"ఆర్షధర్మమని" పిలువబడెను.

(3) ఆర్యు లీ ధర్మమునను ష్ఠించుటచే దీనికి ఆర్యధర్మ మనికూడా పేరుగల్గినది.

(4) ఆర్యులకు భారతీయులని వేరొక పేరుంటచే వారి ధర్మమునకు

భారతధర్మ మను నామమేర్పడెను.

(5) ఆ ధర్మమే నేడు

హిందుధర్మ మని బిరుదమునుపొంది వ్యవహారింపబడు చున్నది.

ఈ హిందుశబ్దము నడుమవచ్చిన దని యెంచుము. అయితే అది సుప్రసిద్ధమగు బిరుదము. ఈ విషయమింకను బాగుగ దెలియుటకొక దృష్టాంత మిచ్చెదను.

రాముడనువా డొకడుండెను. స్కూలులో విద్యార్థిగా నున్నపుడు రిజిష్టరుబుక్కునందు రాము డని వ్యవహారింపబడుచు వచ్చెను. చదువుకొను గ్రంథములందును రాము డని వ్రాసి

* మనకు-సనాతను లనియు-ఆర్యులనియు-భారతీయు లనియు నామము లుండుటకు కారణము హిందురాజ్యముయొక్క రెండవ భాగమున విశదము చేయబడును.

కొనుచుండెను. వివాహసమయమున నాహ్వాన పత్రిక లలో రామునకు జానకి యను కన్య యొసగబడునని యుండెను. కొంతకాలమున కతడు దేశసేవ యొనర్చి "దేశోద్ధారకు"డను బిరుదమును పొందెను. అది మొదలు పూర్వనామము మరుగు పడి ఎవరినోట జూచినను దేశోద్ధారక సంబోధనలే వినవచ్చు చుండెను.

ప్రస్తుతము గాంధిగారికి "మహాత్మా" యను బిరుద మేర్పడుట చూడమా? అది నామకరణ సమయమునగాని విద్యాభ్యాస కాలమున గాని, యుద్యోగ తరుణమునగాని లేకుండెను. అప్పటికి వ్రాయబడిన యాతని చరిత్రలో మహాత్మాయను పేరు కానపడదు. అంతమాత్రమున మహాత్మాజీ యని పిలుచుట మానెదమా. జగద్విఖ్యాతమై సకల హృదయములలో ప్రతిధ్వనించు పదమును తీసివేసి పూర్వకాలపు పేరే యుండవలె నని వాదించు వారెవరైన నుందురా.

అనార్యుడు—మహాశయా! విదేశీయు లీ దేశమునకు వచ్చినంతమాత్రమున హిందుమతముయొక్క పవిత్రత చెడు ననుట భావ్యమా?

ఆర్యుడు—మిత్రమా! విదేశీయు లెందుకు జనించిరో తెలిసినయెడల నీ సంశయము తీరును. ఇక వారి జన్మమును గూర్చి వినుము.

భారతయుద్ధము జరుగుటకు పూర్వమొక వేయి సంవత్సరముల క్రిందట విదేశములలో మానవజాతి యుద్భవించెను.

అందుకు కారకుడు కలిపురుషుడు. అతడు వర్ణాశ్రమధర్మములు లేనివాడు. శ్రీ మహావిష్ణువును గూర్చి తప మొనర్చ దేవుడు ప్రత్యక్షమై వరము కోరుమనెను. అంత నా మ్లేచ్ఛుడు స్వజాత్యాభివృద్ధికై వేడుకొనెను.

శ్లో॥ బహురూప మహం కృత్వా తవేచ్ఛాం పూరయామ్యహం
భవిష్య పురాణం, ప్రతిసర్గపర్వం.

భగవానుడు భక్తవాత్సల్యు డగుటచే "నీ జాతివారి ననేకుల బుట్టింతునని యభయ మొసగెను. అందుకై నూతనముగ నేర్పడిన భూమిలో నొక తోటను నిర్మించి

శ్లో॥ ఆదామోనామపురుషః పత్నీ హవ్యవతీ తథా
విష్ణు కర్దమసంజాతౌ మ్లేచ్ఛవంశప్రవర్ధనౌ.

ఆదామోనామ = ఆదాము అను పేరుగల పురుషుని బుట్టించి, యతనికి తోడుగా నుండుట కొక స్త్రీని సృజించెను. ఆమె పేరు "హవ్యవతి". తెలుగు భాషలో "హవ్వ" యని పిలువబడును. ఇంగ్లీషులో ఆమెను "ఈవ్" అనియు, ఆదామును "యాడం" అనియు చెప్పుచుందురు. ఈ యాదిమ దంపతుల సంతతివలన

శ్లో॥ ఆర్యదేశాః క్షీణవంతో
మ్లేచ్ఛవంశాబలాన్వితాః

ఆర్యదేశములు క్షీణించి మ్లేచ్ఛజాతులు వృద్ధియగును.

శ్లో॥ ఇతి శ్రుత్వా ద్విజాస్సర్వే నైమిశారణ్య వాసినః
అష్టాశీతి సహస్రాణి గతాస్తే తుహినాచలం.

నైమిశారణ్యమున వసించు భారతీయులలో గొందరు వర్ణాశ్రమ రహితమగు జాతి జనించె నని తెలిసి వారీ దేశము నకు రాగల రనియు, నందువలన నార్యజాతియొక్క పవిత్రతకు భంగము కలుగుననియు నిశ్చయించి ధర్మరక్షణము కలుగదను తలంపున హిమాలయ పరిసర ప్రాంతముల కరిగిరి. అటు లేగిన వారు

అష్టాశీతి సహస్రాణి = 88 వేలమంది కలరు. మిగిలిన జనులు జన్మభూమిని విడువలేక నిలిచిరి. వారి సంతతి నానా బాధ లనుభవించుటకు సిద్ధపడిరి. మన మెల్లరము వారి సంతానమే.

అనార్యుడు.—

మహాత్మా! హిందుశబ్దము మేరుతంత్రమున గలదని నుడివితిరి. అట్లే, సంస్కృత వాఙ్మయమున మరెచ్చటనైన నా శబ్దము కలదేమో తెలుపగలరా?

ఆర్యుడు-—

మిత్రమా! ఆ పదము దేవభాషలో ననేక స్థలము లందున్నది.

1 మేరు తంత్రమునగాక—

2 శ్లో॥ జానుస్థానే జైనుశబ్దః సప్తసింధు స్తథైవచ।
స ప్తహిందుర్ యావనీచ పునర్జ్ఞేయా గురుండికా॥

భవిష్య పురాణము. ప్రతిసర్గ పర్వము. అయిదవ అధ్యాయము.

3 శ్లో॥ కాలేన బలినాచ్ఛన్నే ధర్మేకబలితే కలౌ
యవనైరవనిః క్రాంతా హిందవో వింధ్య మావిశన్
(కాళికాపురాణం)

(హిందవో అనగా హిందువులు,
వింధ్యం = వింధ్యపర్వతమును, ఆవిశన్ = చొచ్చిరి.)

ఈ స్థితి ఎప్పుడో తెలిసికొనుము. మ్లేచ్ఛులు భారత దేశము నాక్రమించి ధర్మనాశన మొనర్చినపుడు పై దశ సంభవించె నని భావము.

4 "మేదినీకోశము" అను సంస్కృత నిఘంటువులో హిందుః- హిందూ - హిందవః అని వ్రాయబడెను.

మరియు శంభుశబ్దవత్ అని సూచింపబడెను.

5 "శబ్దకల్పద్రుమము" అను మరియొక నిఘంటువులో
"హీనం దూషయతీతి హిందుః"
పృషోదరాదిత్వాత్ సాధుః, జాతివిశేషః
అని కలదు.

6 "రామకోశము" అను నిఘంటువున
శ్లో॥ హిందుర్దుష్టనృహాః ప్రోక్తోనార్యనీతి విదూషకః
సద్ధర్మపాలకో విద్వాన్ శ్రౌతధర్మపరాయణః
అనగా—

దుష్టనృహా = దుష్టులను సంహరించువాడును, అనార్యనీతివిదూషకః = అనార్య సిద్ధాంతమును ఖండించువాడును;

సద్ధర్మపాలకః = సద్ధర్మమును పోషించువాడును, విద్వాన్ = జ్ఞానియు, శ్రౌతధర్మ పరాయణః = వేదధర్మాసక్తి కలవాడును, హిందుః = హిందు వనబడును.

7 "అద్భుతకోశమున"

శ్లో. హిందుర్హిందూశ్చ ప్రసిద్ధౌ దుష్టానాంచ విధర్షణే
రూపశాలిని దైత్యారౌ రాజ్ఞి యోగిజనేపిచ.

హిందుశబ్దము ఉకారాంతముగను ఊకారాంతముగను రెండువిధముల వాడవచ్చును—ఎట్లన

హిందుమతము—హిందూమతము } అనవచ్చును.
హిందు దేశము— హిందూదేశము }

ఈ శబ్దమునకర్థము తెలియుము.

(1) ప్రసిద్ధౌ = ప్రసిద్ధియందును
(2) దుష్టానాంచ విధర్షణే = దుష్టసంహారమందును
(3) రూపశాలిని = సౌందర్యవంతునియందును.
(4) దైత్యారౌ = రాక్షససంహారకుండగు శ్రీమహావిష్ణువునందును
(5) రాజ్ఞి = ప్రభువునందును.
(6) యోగిజనే = యోగిపుంగవునియందును

హిందుశబ్దము వర్తించును. సుప్రసిద్ధుడై, దుష్ట సంహారకుడై, సుందరుడై, దేవుడై, రాజాధిరాజై, యోగియై వెలయువాడే హిందువు.

**8** పారిజాతాపహరణ నాటకము

శ్లో. నామగుణోపమ తుల్యరసః హిందుః పాతు పతిర్నః
హినస్తి తపసాపాపాన్ దైహికాన్ దుష్టమానసాన్

(హినస్తి = హింసించుచున్నాడు.
వేనినో తెలియునా?
దుష్టమానసాః = దుష్టబుద్ధులను.)
"హినస్తి దుష్టమానసాన్"

ఈ వాక్యమును చదువునపుడు బి. ఎ. యం. ఎ. అను పొడియక్షరముల జ్ఞప్తికి దెచ్చుకొనుము. యం. అనగా మాష్టర్. "ఎ". అనగా ఆర్ట్ అనియు నెటుల నర్థమున్నదో అటులనే హిం + దు అను అక్షరములయందును హిం అనగా హినస్తి అనియు, "దు" అనగా దుష్టమానసాన్ అనియు అర్థమగుచున్నది. హినస్తి అను క్రియయందలి మొదటిఅక్షరము 'హి' అని యొకచోటవ్రాసి దుష్టమానసాః అను శబ్దములోని మొదటియక్షరమైన "దు" అనుదానిని 'హి' అను అక్షరమునకు ప్రక్కగా చేర్చుము. ఆ రెంటిని కలిపినయెడల 'హిదు' అను శబ్దమేర్పడును. అది క్రమముగా 'హిందు'శబ్దమై యొప్పెను. తెలిసినదా? సంస్కృతభాషలో హిందుశబ్దము హాత్మ్య మెటుల వర్ణింపబడెనో!

**9** హింసను దూరము చేయువాడు

హిం+దు అనియు చెప్పబడును. తెలిసినదా ! హిందు శబ్ద మహాత్మ్య మెటుల వర్ణింపబడెనో.

ఇక పరభాషలం దీ పదమునకు గల గౌరవ ప్రతిపత్తిని చూతము. అందు పురాతనమై మాతృస్థాన మలంకరించిన భాష హిబ్రూభాషయని యెరుంగుము. బైబిలు వ్రాయబడిన దీ భాషయందే. హిందు శబ్దమును హంద్ అని వాడునట్టి యలవాటు ఆ భాషలో కలదు. "హంద్ సే పరిషియాతక్" "హిందు దేశమునుండి పరిషయావరకు" అని దీని యర్థము. ఆ భాషయందు హిందుదేశమునకు హంద్ అని వాడినటుల పై వాక్యమున జూచితిమి.

హంద్ అనగా హిబ్రూ భాషలో గౌరవము- తేజము- అని యర్థము. దీనింబట్టి హిందు దేశము తేజోవంతమై గౌరవ స్థానము వహించెనని వారి భావమైయున్నది. పారశీక గ్రంథ మగు "జందవేస్త" అను దానిలో "హిందవ్" అనేది హిందు శబ్దమునకు పునాదిగా నుడువబడెను. గ్రీకు భాషలో "హంద్ కోశ్" "ఇందికోశ్" అను రూపములనుండి హిందు శబ్దము వాడు చున్నటుల కలదు. ఆభాషలో సహితము "హన్ద్" అనగా గౌరవము అని భావము.

అనార్యుడు——మహాశయా! హిందువనగా బానిసయని కొందర నెదరు. అదినిజమా!

ఆర్యుడు——నాయనా! భూమండలమున గణనీయమగు వివిధభాషలలో "హిందు" శబ్దమునకు పవిత్రమైన యర్థముండె నని యిప్పుడే గ్రహించితిమిగదా! ఇక—నేభాషలో హిందు శబ్దమునకు బానిసయని యర్థముండెనో చూతము. ఒక్క- ఉర్దూ భాషలోమాత్రమిా శబ్దమునకుదుష్టార్థము వ్రాయబడెను.

అందుకు కారణము లేక పోలేదు. ఏమన నది స్వతంత్రమగు భాషకాదు. విదేశస్థులగు మహమ్మదీయులు — ఈ దేశమున కరుదెంచి మనల జయించినపుడు హిందూ సైనికులు వారి సైన్యమున జేరిరి. వారిది అరబ్బీ భాష. మనవారిది హిందీ భాష. ఈ యుభయ సైన్యములు పరస్పరము సంభాషింప వలసివచ్చెను. ఒకరి మాట లొకరికి తెలియవయ్యెను. ఎటులనో సాంగత్య బలమున భాషించుచుండ పై రెండుభాషల లోని పదములుచేరి యొక మిశ్రమభాషయై వెలసెను. ఆ భాషలో కొన్ని అరబ్బీ పదములు మరికొన్ని హిందీపదము లుండెను. ఆ సైన్యములో కొందరు పారశీకు లుండుటచే పారసీ భాషలోని కొన్ని పదములున్ను కలిసెను. నియమరహితమగు భాషకు గౌరవభావ ముండుటయు శూన్యమే. అందువలన మహమ్మదీయులు సంకరభాషయందీ శబ్దమును హేయముగ వాడిరి. ఇటుల వాడుటకు మరియొక హేతువున్ను కలదు. వీరాధివీరుడై యనేకమంది మహాయోధుల గడగడ లాడించిన శ్రీ శివాజీవంటి మహనీయుని "దొంగ"యనియు "కొండ యెలుక" యనియు నీ భాషాసాంప్రదాయకులు చెప్పుచుండిరి. అంతియేకాక యీ దుష్టపదములను దేశ చరిత్రలలో నయితే మెక్కించి యున్నారు. కొంతకాలమున కీ విషయము సత్యమేమో యను భ్రమ రాబోవు సంతతికి నేర్పడు ననుటలో నాశ్చర్యములేదు. పోనీ, శివాజీ నిజముగ నట్టి భీరువందుమా! కాదు. అతడొక గొప్ప దేశభక్తుడు. అఖండ బలపరాక్రమ సంపన్నుడు. భారతీయుల కారాధింపదగిన పవిత్రమూర్తి. ఇట్టి మహామహుని విదేశస్థు లెంతటి హేయ

భావములతో వాడిరో గ్రహించితివా. అతనిపై గల విద్వేషమే యిందుకు కారణము. ఒకవ్యక్తి యెంత బుద్ధిమంతుడైనను అతడు యోగ్యుడుకాదని తలచుట శత్రువులకు సహజము. కావుననే శ్రీ శివాజి "దొంగ"యని ప్రతిపక్షులచే నుడువ బడెను. పైరీతిగనే తమ సాంప్రదాయమునకు విరుద్ధమగు హిందుశబ్దము ఉర్దు నిఘంటువున నీచభావముతో వ్రాయ బడెను. కావున నిందెంతమాత్రము సత్యములేదు.

ఇదిగాక మరియొక విషయము గ్రహింపదగి యున్నది. అది యేమన—ఒక భాషలోనున్న పదము మరియొక భాషలో నుండినను దాని యర్థము వేరుగా నుండవచ్చును. మరియు నీచార్థమును బోధింపవచ్చును. అంతమాత్రమున నా పదమునకు లోపము కలుగనేరదు.

ఉదాహరణము

| ఇంగ్లీషులో | | తెలుగులో |
|---|---|---|
| God the good<br>గాడ్ ది గుడ్ | } | గాడిదిగుడ్డు |

| సంస్కృతమున | పార్శీలో |
|---|---|
| (1) రామ్ = దేవుడు, | (1) రామ్ = సేవకుడు - నీచుడు, |
| (2) మార్ = మన్మథుడు, (మారః) | (2) మార్ = పాము, |

ఈ విధముగ జూచినను పవిత్రమగు హిందుశబ్దమునకు నీచస్థితి యుండెనని భ్రమించుట యవివేక మగును.

---

రాబోవు గ్రంథమున హిందుశబ్దము వ్యాకరణరీతిచే సాధువా అసాధువా అని చర్చింపబడును.

—♦ వృష సం॥ ఆశ్వయుజమునుండి ♦—

రెండవ సంవత్సరము ప్రారంభమగును.

హిందురాజ్యముయొక్క — ప్రథమభాగముతో మొదటిసంవత్సరము పూర్తియైనది.

చందాదారులు

రెండవ సంవత్సరపు చందా ముందుగా రు 1—8—0 మనియార్డరు చేయని యెడల హిందురాజ్యముయొక్క రెండవభాగమున్ను దేవరాజ్య ధర్మరాజ్యములున్ను పంపబడవు.

—♦ ఆ భాగమందున్న విషయములు ♦—

హిందు దేశము 195 కోట్లవత్సరముల క్రింద పుట్టినదని ప్రమాణమేమి? హిందువులు ఇతర దేశములలో జనించి యిచటకు వచ్చిరా? లేక వారి జన్మభూమి హిందూదేశమేనా? సింధు శబ్దము హిందుశబ్దముగా మారినదని చరిత్రలలో కలదు. అది యబద్ధమా? హిందువనగా బానిస లేక దొంగ యని మహమ్మదీయులనుచుందురు. అది నిజమా? హిందుమతము దైవమతమైనచో సర్వజ్ఞుడగు దేవునివలె ఈ మతము క్రైస్తవ మహమ్మదీయ మతములనుగురించి తెలుపునా? ఏసుక్రీస్తు, మహమ్మదు, అక్బరు, బేబరు, ఔరంగజేబు, విక్టోరియా మొదలగు విదేశీ

యుల పేర్లు చరిత్రలుకూడా హిందుమత గ్రంథములలో నున్న వి రుజువుచేయబడును. ఏ పురాణమున, ఏ అధ్యాయమున, ఏ ఏ శ్లోకములలో నున్నవో అవి అన్నియు తెలుపబడును. రాబోవు రాజవంశములుకూడా వెల్లడింపబడును. ఇక ముందు హిందు దేశమున వర్ణాశ్రమ ధర్మములచే పాలించు క్షత్రియరాజుల పేర్లు సయితము వ్రాయబడును. ప్రతిహిందువు పై విషయ ములు చదివి తీరవలెను. ఆ గ్రంథమువలన నెంతయో లోక జ్ఞాన మలవడును. ఇదివరకు చదివిన దేశచరిత్ర లోకప్రక్క నను హిందురాజ్యముయొక్క రెండవభాగము వేరొక వైపున నుంచి చదివినయెడల హిందువులు నూతనోత్తేజమును పొంది స్వస్వరూప జ్ఞానులయ్యెదరు.

# విద్యార్థులు – ఉపాధ్యాయులు

చదువదగియున్నది. హిందూరాజులు ప్రజల నెటు పాలించిరో ఆవిషయమున్ను పఠింపదగినది.

(2) దేవరాజ్య మను గ్రంథమున దేవతలు వ్యభిచరి చిరా? అను దానికి జవాబు చెప్పబడును.

(3) ధర్మరాజ్యమును గ్రంథమున నాల్గుజాతుల మొదటినుండి యున్నవా? లేవా? ఈ మొదలగు వర్ణాశ్రమ ధర్మముల గురించి తెలుపబడును.

సంపూర్ణం

ఈ గ్రంథమాలలో

# గృహరాజ్యము అను పుస్తకమున

11 భాగములు పూర్తియైనవి.

మిగిలిన భాగములు నిలుపబడి

# హిందు రాజ్యము

అను పుస్తకము ప్రారంభింపబడెను.



ఈ పంద్రెండు పుస్తకములు కలసి వృష సం॥ భాద్రపదాంతమునకు పూర్తియైనవి.

ఆశ్వయుజ శు ౧౦ నుండి రెండవ సంవత్సరము ప్రారంభమగును.

అందు

# దేవరాజ్యము, ధర్మరాజ్యము

సయితము ప్రారంభమగును.



ఈ గ్రంథములు వలయువారు:—

మ్యానేజరు:

హిందుమత గ్రంథమాల

సత్యనారాయణపురం, బెజవాడ.

లేక,

సికింద్రాబాద్ (డక్కన్)

అని వ్రాయవలెను.

| | | |
|---|---|---|
| పోస్టేజితో సహా సంవత్సర చందా | బ్రిటీష్ రు | 1—8—0 |
| ,, | నైజాం రు | 1—8—0 |
| విడి పుస్తకం | | 0—2—0 |

పండితులవారి యుపన్యాసములు వినగోరువారు గాని

వారితో మాట్లాడదలచినవారు గాని

బెజవాడ యడ్రసుకు వ్రాయవలెను.

☞ ఈ పుస్తకములు విక్రయించుటకు ఏజంట్లు కావలెను.

మంచి కమీషన్ యివ్వబడును.

హిందూ మత గ్రంథమాల



ఉపన్యాస చక్రవర్తి
ఉమామహేశ్వర పండిట్ గారి ఉపన్యాససారము.

# Home Rule

# గృహరాజ్యము

**2, 3, భాగములు.**

విక్రమ సం॥ కార్తిక మార్గశిరములు.

2-3 పుష్పములు

వెల
**0-3-0**

ధర్మోద్ధారక, ఉపన్యాస చక్రవర్తి

బ్రహ్మశ్రీ ప్రభాకర ఉమామహేశ్వర పండితులవారి

ఉపన్యాససారము

# గృహారాజ్యము.

## ( 2, 3 భాగములు )

---

మూడవ కూర్పు

సంగ్రాహకుడు

విద్వాన్ శ్రీపురం విశ్వేశ్వరశాస్త్రి

---

కొండా శంకరయ్యగారి ప్రిమియర్ ముద్రాక్షరశాల,

సికింద్రాబాద్.

 వెల 0-3-0

గ్రంథములు వలయువారు

మేనేజరు:—

# హిందూమత గ్రంథమాల

లాలా టెంపిల్ స్ట్రీటు

సికిందరాబాద్-దక్కన్.

# గృహారాజ్యము.

## ( 2 వ భాగము )

అనార్యుడు:—  (14 వ ప్రశ్న)

ఒకవేళ తల్లిదండ్రులు బాగుగ నాలోచించి తమ కుమార్తెలకు తగిన సంబంధమును దెచ్చినయెడల మంచిదే. అటుగాక ధనాశాలోలురై అజ్ఞానవశమున తగిన భర్తల నేర్పరుపక ఏ పనికిమాలినవారికో అంటగట్టినయెడల నా బిడ్డలకు బ్రతికినన్నాళ్లు తీరని దుఃఖము వాటిల్లును. ఈ బాధ లేకుండుటకై స్త్రీలు స్వయముగ పతిని వరించుకొనుట మేలు కాదా ?.

ఆర్యుడు:—

తల్లిదండ్రులొనర్చు పెండ్లిండ్లవలన స్త్రీలకు దుఃఖము కల్గుననియు స్వయంవర వివాహములవలన సర్వసౌఖ్యము లబ్బుననియు తలచుట గొప్ప పొరబాటు.

ఏమన, సృష్టి ప్రారంభమునుండి నేటివరకు బయలు వెడలిన ఉద్యమములన్నియు నూటికి పాతికవంతైనను జనులకు నష్టము కలుగజేయుచున్నవి. రాజకీయముగ గాని, సాంఘికముగగాని ఆరోగ్యవిషయమునగాని, నూటికి నూరువంతులు సంపూర్ణసౌఖ్యమును కలుగజేయు పద్ధతి లోకమందెచ్చటను గానరాదు. అటులొనర్చు శక్తియు మానవునకు లేదు. ఏకముందెవ్వరైన నటుల కలుగవచ్చునని జెప్పినను అది ప్రకృతిసిద్ధముగ నుండదు. దీనికి దృష్టాంతములు వినుము.

I. జనులకు ప్రయాణసౌకర్యములు గల్గజేయుటకై రైలు-గొప్ప సాధనమని మనమెల్లరము తలంచుచున్నాము. మొదట దానిని నడపించుటకు భూమిపై ఇనుపదారిని సిద్ధపరుపవలెను. ఒక సమయమున గ్రామ మధ్యమునుండి యా మార్గము వేయవలసివచ్చును. అపుడు కొన్ని యిండ్లను తీసి వేయకతప్పదు. ఆ యిండ్లవారు తమ కెంతయో కష్టము కల్గునని జెప్పుచు రైళ్ళను దూషింపుచుందురు.

అయినను ఎటులనో రైళ్ళు వేయబడును. ప్రయాణ సౌకర్యములు గల్గుచుండును. ఒకానొకప్పుడవి పడిపోవుటయు సంభవించును. ఆ సమయమున నెందఱో జనులు మరణింతురు ఆ వృత్తాంతమును విని రైళ్ళవలన వేలకొలది జనులు మరణింతురనియు కావున నవియుండరాదనియు వచింతురు.

II ఒక రైలు విషయముననే కాదు. దేశమునకు మహోపకారమొనర్చు పంట కాలువలు సైతము తమ పొలములలో త్రవ్వబడునని తెలిసి అవి హానికరములని మొఱపెట్టు రైతు లెందఱో గలరు. వారిని లెక్కింపక ప్రభువులు కాలువలను త్రవ్వింతురు. అంత బహుకాలము పంటలను పండించుకొని ప్రజలు సుఖింతురు. ఒకానొక సమయమున సముద్రముపొంగి పై కాలువలగుండా ప్రవహించి భూమిపై కెక్కి గ్రామముల ముంచివేయును. అపుడా ప్రజలు మొరక భూములను పొగడుచు కాలువలను నిందింతురు.

III రాజ్యపాలన మొనర్చుటకు వంశపారంపర్యముగ ప్రభువులుండవలెనని కొందఱందురు. దీనిని ధిక్కరింపుచు ఆ ప్రభుత్వమువలన అనేకులు బాధింపబడుచుండిరనియు

ప్రజలచే నెన్నుకొనబడినవాడే పాలింపవలెననియు మఱి కొందఱు వచింతురు. అందును గొన్ని లోపములు గలవని తలంచి ధనవంతులు, దరిద్రులు, అను భేదములేకుండా జేయు గల ప్రభుత్వము అనగా "సోషలిజం" వ్యాపింపవలెనని పలువురు పల్కుచుందురు.

ఏదేశమున సోషలిజము వ్యాప్తమైయుండెనో అందు కొందరైనను దీనిని నిందింపనివారుండరు.

IV ఆయుర్వేద చికిత్సలో గొన్ని లోపములుగలవని యూనానీ వైద్యులందురు. యూనానీ వైద్యము రోగనివారణము జేయజాలదని ఇంగ్లీషువైద్యులు పల్కుదురు. ఆంగ్ల వైద్యము సైతము రోగమూలమును పోగొట్టలేదని హోమ్యోపతి వైద్యులు జెప్పుదురు. పైవైద్యములన్నియు క్రొత్త రోగముల బుట్టించునని తొట్టివైద్యు లాక్షేపింతురు.

ఈ విధముగ నెన్నిపద్ధతులు గమనించినను అవి యన్నియు లోపభూయిష్ఠములైయున్నవి. సర్వులచే నంగీకరింపడిన మార్గము సృష్టియందెచ్చటను లేదు. జగత్కర్త యగు పరమేశ్వరుడొక్కడే పరిపూర్ణుడు.

అయినను అతని సృష్టి, యసంపూర్ణము. అట్టి సృష్టిలో లోపములు లేని సిద్ధాంతమును గనిపెట్టగల్గుట కేవల మసంభవము. కావున తల్లిదండ్రులొనర్చు వివాహములలో సయితము లోపములుండును. అందే కాదు. స్వయంవర వివాహములలోను దోషములు కలవు. ఎట్లన నడి వయస్సుగల స్త్రీలు-ఇచ్చవచ్చినవారిని బెండ్లాడినను బాధలనుభవించుటలేదా? వారెల్లరు సుఖమే పొందుచుండిరా?

ఎన్నడును లేదు. ఏకొందఱో సుఖులైయుండవచ్చును. కావున స్త్రీలు స్వయముగ పెండ్లాడినను దుఃఖములు తప్పవు.

బాల్యవివాహములవలన కొందఱికి తగిన భర్తలు లభింపకుండుట సత్యము. స్వయంవర వివాహములలో సైతము పై దురవస్థ తటస్థించుచున్నది. నిదర్శనమునకై విదేశములలో చూడుము. అచ్చట పతులను విడనాడి రెండవవాని పెండ్లాడుచున్నారు. అప్పటికైనను ఒకరిద్దరితో పూర్తియగుట లేదు. నలుగురైదుగురు కావలసివచ్చుచున్నది. ఈ మాటలు కల్పితములుకావు. మనదేశమునకూడా ఎఱుకల, యానాది, చాకలి మున్నగు జాతులలోని, యనుభవములు ఇటులనే యున్నవి. ఆ స్త్రీలు స్వయముగ పతులను వరించియు పరస్పర మనోభావముల నైక్యము కుదురక వారిని విడనాడి మరల నితరుల బెండ్లాడుచున్నారు. ఇతరదేశములలో పది పండ్రెండుమందిని పెండ్లాడినవారుగలరు.

కావున బ్రాహ్మణ వైశ్యశూద్రులలోని స్త్రీలు సైతము స్వయంవర వివాహము లొనర్చుకొన్నయెడల వారికి కూడ పై గతియే సంభవించును. రెండవ భర్తమాత్రము సర్వసౌఖ్యమొసంగగలడని నమ్మకమేమి? ఒకవేళ నతడు చెడ్డవాడయ్యెనేని మూడవ వానిని వరింపవలసియుండును. అది నీతియగునా? అట్టి యాచారము దేశమందెల్లెడల వ్యాపించినచో నయ్యది సదాచారమే యగునని కొందఱన వచ్చును.

సదాచారమో దురాచారమో అది రోగహేతువై యున్నచో బుద్ధిమంతు లంగీకరింతురా?

ఒకానొక స్త్రీ తన ప్రథమభర్తను విడచి రెండవవానిని జేపట్టినయెడల నా సాంప్రదాయము రోగహేతువో లేదో తెలిసికొందము.

ఒక పురుషుడొక ప్రదేశమున మూత్రవిసర్జన (ఒంటేలుపోయుట) మొనర్చెనను కొనుము. అతడా ప్రదేశమున ప్రతిదినము మూత్రము విడచినను తన్మూలమున నొక క్రొత్తరకపువ్యాధి యంటనేరదు. అస్థలమున వేరొకడు పై విధముగ మూత్రమును గావించిన యెడల మొదటివాడు రోగములులేనివాడైనను రెండవవానికొక రకమైన వ్యాధి యేర్పడును. మొదటివాడు రోగియేయైనయెడల జెప్పవలసినదిలేదు. అది యెట్లన, చిలిపిరోగములుగల పురుషుడు ఒక తావున మూత్రమును విడువగా నాప్రదేశమున వేరొకడు పైవిధముగ మూత్రవిసర్జనము గావించెనేని వానికా రోగము లంటుచున్నవి. దీనిని కాదనువారుగలరా? ఈ పద్ధతిని స్త్రీ పురుష వివాహవిషయమున నడిపించి చూతము.

ఒక పురుషుడొక స్త్రీని పెండ్లాడెను. ఆమె భూమి వంటిది. అతడు విత్తనమువంటివాడు. పురుషుడెటుల నొక ప్రదేశమున మూత్రవిసర్జన మొనర్చెనో అటుల నొకడొక స్త్రీని బెండ్లాడి యామెతో కామసుఖ మనుభవించి రేతో విసర్జన మొనర్చెను. అనగా ఇంద్రియమును విడిచెను. ఒకడు మూత్రవిసర్జన మొనర్చిన ప్రదేశమున వేరొకడు అదేపని గావించిన యెడల నెటుల వ్యాధిగ్రస్తుడగునో, అటులే యొకడు రేతో విసర్జనము గావించిన స్త్రీని వేరొకడు పెండ్లాడి యామెయందు వీర్యపతన మొనర్చినయెడల నీ రెండవ

వాడు రోగముల పాలగును. ఇందువలన నొక స్త్రీకి ఇద్దరు భర్తలు పనికిరారని స్పష్టమగుచున్నది.

మఱియు సూక్ష్మదృష్టిచే గమనింపదగిన విషయము వేరొండుగలదు. దానిని సైతము బాగుగ గ్రహింపుము. ఒకడు కేవలము మంత్రములచే నొక స్త్రీని పెండ్లాడి ఆమె యందు గర్భాధానమును మాత్రము జరుపలేదు. ఇంతలో కాలవశమున నతడు మరణించెను. ఆ దంపతుల శరీరములు పరస్పరము కలియనందున నా స్త్రీని వేరొకడు పెండ్లాడినను వానికి పైవిధముగ రోగములంటనేరవని కొందఱనవచ్చును. కాని-ఆధియనియు-వ్యాధియనియు-రోగములు రెండురకము లని వారెరుంగరు. దేహసంబంధమగు జాడ్యము వ్యాధి యనియు-మనస్సంబంధరోగము ఆధియనియు జెప్పబడును. స్త్రీపురుషులకు గర్భాధానమైన పిమ్మట నా స్త్రీ తనభర్తను విడనాడి వేరొకని బెండ్లాడి యతనిని పొందెనేని ప్రథమ భర్తవలన తనకు లభించిన శరీరసారమును రెండవవానికం టించి యతనిని-వ్యాధిగ్రస్థునిగ జేయగలదని గ్రహించి యుంటిమి. అటుగాక ప్రథమభర్తతో కాపురమొనర్పని స్త్రీ రెండవభర్తకు దేహసంబంధ జాడ్యములంటించుటకు బదులు మానసికరోగముల నైనను ప్రసాదించి తీరును. ఈరహస్య మును సామాన్యులెఱుగరు. ఎందుకన ఒకరిమనస్సు వేరొ కని మనస్సుపై ప్రసరించి ఎటుల సంకర మొనర్చునో దానిని మానసికశాస్త్ర (సైకాలజి) వేత్తలే యెరుంగుదురు. సాధా రణముగ "మెస్మరిజం" అను నొక విద్యను అభ్యసించిన పురుషుడు తన మానసికశక్తిని వేరొకని మనస్సుపై ప్రస

రింపజేసి యతని మనస్సును తనమనస్సుతో సమానముగ జేయగల్గును. ఈవిషయము లోకానుభవముగల వివేకులెల్ల రకు దెలియును. అంతదూరము పోనేల? మంత్రశాస్త్రవేత్త విభూతినిగాని, జలమునుగాని, మంత్రింప నామంత్రశక్తి పై విభూతిలోను జలములోను జేరి యనేక యద్భుతపరిదర్శన ముల గావించుటలేదా?

తేలుమంత్రము, పాముమంత్రము, బెణుకుమంత్రము మొదలగునవి మానసికశక్తియొక్క ప్రభావమును వెల్లడించు నవి కావా? ఈసిద్ధాంతము ననుసరించియే హిందూవివాహ పద్ధతి నిర్మింపబడినది. ఇతరమతములలోని పెండ్లిండ్లకును హైందవ వివాహములకును గల భేదమిదియే. ఇతరమత ములలోని వివాహములు చేతియుంగరము మార్చుకొన్నంత మాత్రమున నొకపూటకో గంటకో పూర్తియగును. అందు స్త్రీపురుషుల మానసికశక్తులు ఒకటికొకటి జేరి యైక్యమగుట కై యవకాశ మొసంగబడవు. కావున దంపతులభావములు పెనవేసిన త్రాళ్ళవలె గట్టిగ నుండజాలవు. దూముడివలె విడువకుండుటకు సంసిద్ధతను జూపుచుండును. విదేశముల లోని. వివాహబంధము తాత్కాలిక ప్రేమమయమై సమ యము తటస్థించెనేసి భార్యాభర్తలను విడదీయుటకు సులభ మై యుండునని దేశచరిత్రలే సాక్ష్యమొసంగగలవు. కారణ మేమన? వారి వివాహపద్ధతులు మానసికశాస్త్రప్రకారము నిర్ణయింపబడలేదు.

హిందూ వివాహములలోని గొప్పతనమేదియని నీ వడుగవచ్చును. వినుము అవి నాలుగైదు దినములు జరు

గును. స్త్రీపురుషుల మానసికశక్తులు మంత్రమహిమచే నొక్కటగుటకు మంచి యవకాశముండెను. ఆ బంధము జన్మాంతమువఱకు వెంటనంటుకొని వారిరువురిని విడదీయక గృహస్థధర్మమున బంధింపుచుండును. పెండ్లికొడుకు పెండ్లి కుమార్తెను అయిదుదినములు మంత్రములచే మంత్రించి ఆమెయందు తన మానసికశక్తులను ప్రసరింపజేయును. అంత వారిరువురి మనస్సు లొక్కటేయగును. అది మొదలు ప్రతి దినము అతని భావనాబీజములు అర్ధాంగియగు భార్యయొక్క హృదయక్షేత్రమున విత్తబడుచుండును. ఆమె మనస్సు భర్త యొక్క మనోదోషములచే నావరింపబడును. అట్టి స్త్రీయందు వేఱొక పురుషుడు వివాహరూపమున సంకల్పబీజముల నాటుటకు యత్నించెనేని ప్రథమభర్తయొక్క మానసిక దోషములతో నిండియున్న నామెహృదయము రెండవభర్త యొక్క మనస్సుపై ప్రసరించి దానిని మలినముగజేయును. అందువలన నతడు మనశ్శుద్ధిని గోల్పోవును.

శుద్ధిలేని క్రియలు ఫలవంతములగునా? అందువలన గృహరాజ్యమున శాంతి చేకూరదు. పరలోకమున సైతము సుఖముకలుగదు. * ఈకారణమున స్త్రీలకు ద్వితీయవివాహములు కూడవు. ఒకవేళ నటుల నొనర్చినను మానసికరోగములచేతను, దేహరోగములచేతను, వారిద్దరు జీవితాంతము వరకు సుఖదూరులై మనశ్చాంచల్యము నొందుచు జీవచ్ఛవములవలె నుందురు.

* స్త్రీలకు రెండవపెండ్లి కూడదని వేదములు శాస్త్రములు చెప్పుచున్నటుల రాబోవు గ్రంథములలో తెలుపబడును.

మిత్రమా! ఇట్లున్న యెడల మానవజాతి మహోపద్ర ములకు గుఱికాదా! ఆహా! ఇంకెక్కడి మానవత్వము. స్త్రీలు స్వయముగ పెండ్లాడినను లెక్కలేనన్ని కష్టములు రాగలవని తెలియుచున్నది.

అనార్యుడు:—

పదునాలుగేండ్లు దాటినతోడనే స్త్రీలకు లోకజ్ఞానము కల్గును. అట్టి యనుభవముగల వనితలు మొట్టమొదట తమకు దగిన భర్తనే పెండ్లాడగలరు. వివాహానంతరము పతులు నచ్చరనుట—న్యాయముగ లేదు. చక్కగ పరీక్షించి పెండ్లాడిన భర్తల నెన్నడు విడనాడరు. కావున స్వయంవర వివాహములు నష్టదాయకములనుట యోగ్యమా?

ఆర్యుడు:—

లోకజ్ఞానము గణించిన స్త్రీలు స్వయముగ బురుషుల పరీక్షించినగదా పెండ్లాడవలెను. ఆ పరీక్ష సరిగా జరిగెనో లేదో తెలియుటెట్లు? లోకమందనుభవింపదగిన పదార్థము లెన్నియోగలవు. స్త్రీలు, పురుషుల ననుభవించుటగాని, పురుషులు స్త్రీల ననుభవించుటగాని లోకవస్తువుల ననుభవించుట వంటిదిగాదు. ప్రపంచమందలి సర్వ విషయముల ననుభవించుట ఒక వైపునను, స్త్రీపురుషు లిద్దఱు కామసుఖముకై గలసి యనుభవించునట్టి విషయము, మఱి యొకవైపునను, త్రాసునందుంచి తూచినయెడల సర్వ విషయానుభూతికంటె నీ దాంపత్య సుఖమే ఘనముగనుండును. అట్టి సుఖము సామాన్యమైనదా? అనిర్వచనీయము. అహో

ఘము, అప్రతిమానము, అఖండము, అమూల్యము. కావు
ననే సర్వజీవులీ దాంపత్య సౌఖ్యమున మునింగి రాత్రింబవ
ళ్లని గుర్తింపనేరక అవిచ్ఛిన్న ప్రేమాంబుధిలో నోలలాడుచు
తమ కల్యాణమే జగత్కల్యాణమని భావించుచున్నారు.
మహత్తర సుఖప్రదుండగు పురుషుని పెండ్లాడి సుఖింప దల
చినయెడల స్త్రీ రత్నములు, ఎట్టి పరీక్ష గావింపవలెనో
తెలిసికొనుము.

ఈ వివాహము మూన్నాళ్ల ముచ్చటలువలె మటు
మాయమగునది కాదు. నూరేండ్లపంట. అంతియేకాదు. జన్మ
సాఫల్యమార్గమై, సద్గతికి పట్టుగొమ్మయై, ధర్మార్థ కామ
ములకు సాధనమై, తుదకు గమ్యస్థానమును జేర్చుచున్నది.
పర్యవసాన మెంతదూరమేగెనో చూచితివా? ఆహా! ఎంత
ఆనందము! మానవుని సర్వశక్తులు వివాహ విషయమున
బ్రవర్తించినగాని ధన్యతను జెందజాలవు.

ఒక దేశమున కొక ప్రభువునో లేక సభ్యునో
యెన్నుకొనుట కెందఱో ధీమంతులు, రాజకీయవేత్తలు,
మతప్రవర్తకులు, లోకజ్ఞులు, ఎటుల యత్నింతురో అట్లే
గృహరాజ్య సింహాసనమున నొకని నభిషిక్తునిగ నొనర్పదల
చుచో వేదమూర్తులు, బ్రహ్మవేత్తలు, సత్సంతానవంతులు,
సన్నిహిత సంబంధులు, ఆప్తులు, మున్నగువార లెందఱో
యత్నింపవలసియున్నది. స్త్రీపురుషులకు గల బాధ్యత
యెట్టిదో గుర్తించినగాని, యే పు రు షు న కే స్త్రీ
యుక్తమో తెలియ వీలులేదు. ఈపని కేవలము అనుభవము
లేని భవిష్యద్దంపతులు జేయదగినదికాదు. ఏ వయస్సుగల

పురుషునకు ఎంత యీడుగల స్త్రీని ముడిపెట్టవలెనో, వారి కులగోత్ర సాంప్రదాయము లెవ్వియో గ్రహించి అట్టివారిని జేర్చుటయే నిజమైన పరీక్షయగును. అటుగాక పదునాలుగేండ్లు దాటిన మాత్రముననే స్త్రీలు తమకు తగినవానిని పరీక్షించుకొందురనుట యవివేకము. వారికి లోకానుభవము కావలెనన్న నీక్రిందివిధముగ జగముతో పరిచయము కావలెను.

I ఒక స్కూలులో గొంతకాలము పంతులమ్మగ నున్నయెడల పిల్లల స్వభావములైనను తెలిసియుండెడిది.

II కచేరి (కార్యాలయము)లో కొన్నాళ్లపాటు ఉద్యోగ మొనర్చినయెడల వ్యావహారిక జ్ఞానమైనను పొందవచ్చును.

III వ్యవసాయవృత్తిలో నాటితేటినయెడల నాయా పొలములందు పనిజేయువారితో, కొంత పరిచయమైనను గల్గియుండెడిది.

IV కొంతకాలము వ్యాపారము జేసియున్నచో వేల కొలది జనులతో మాట్లాడుటకు నేర్పు గల్గియుండెడిది. అపుడు వివిధ మానవస్వభావములు గుర్తింప వీలగును.

ఇట్లుండ ఇరువదేండ్లు వచ్చినమాత్రమున పై విషయములలో సహస్రాంశమైనను జ్ఞానము గలుగుననుట తగదు.

ఇక పురుషుని మంచి చెడ్డలను తెలియదలచిన యెడల పదునాలుగేండ్లు వయస్సుగల స్త్రీలకు లోకానుభవ ముండునా? ఏమియు నుండదు. అట్టి స్థితిలో పురుషుని గుణము లెవ్వియో తెలియుటెట్లు? అతడు శాంతుడో,

కోపియో, బోధకుడో, బాధకుడో, పురుషుడో, నపుంసకుడో తెలియుటకు వీలులేదు.

కావున స్త్రీలకు పురుషుల విషయమున నొకటి రెండు పర్యాయములైనను పరిచయము గల్గినగాని వారి స్వభావములు బోధపడవు. పురుషులకు సైతము స్త్రీల విషయమున నింతియే. ఒకవేళ పురుషుని వరించుటకు యత్నించు నేని లోకానుభవము ననుసరింపవలెను.

I ఒక పండును కొనదలచినయెడల చూపున కది యెంత యందముగ నున్నను 30, 40, ఏండ్లు దాటినవాడు కూడ సర్వజ్ఞుడనని తలచి పరీక్షింపక కొనజాలడు. అనగా నాపండులో నొక ముక్కనుగోసి రుచిజూచి మంచిదిగనున్న పుడే కొనును.

II ఒక యావు కలదనుకొనుము కేవలము పొదుగు, కొమ్ములు, కండ్లు, తోక, నిడివి, మున్నగువానిని చూచినంత మాత్రమున నొక రైతు కండ్లుమూసికొని కొనునా? ఒకటి రెండుసార్లు స్వయముగ పాలు పిదికి పరిమితిని, రుచిని, గ్రహించి యటుపై తనకు నచ్చినయెడలఁ దీసికొనును.

III అమ్మకమునకు వచ్చిన యెద్దుయొక్క పొడవు, ఎత్తు, లావు, మున్నగువానినిఁ జూచి తటాలున గొనువా డెవ్వడునుండడు. బండికో నాగలికో కట్టి లాగించి సరియని తోఁచెనేని తీసికొనును. అట్లే గుఱ్ఱమునుఁగూడ స్వయముగ నెక్కి స్వారిజేయనిది తీసికొనడు.

మైనారిటీ వెళ్లుటయేగాక బహుకాలము లోకానుభవము గణించినవారైనను, స్వల్పకాల మనుభవింపదగిన పదార్థములసైతము కొంచెముగనైన ననుభవింపక (శాంపిల్ చూడక) స్వీకరించువారు లేరు. ఇఁక యావజ్జీవము తనతోపాటు కష్టసుఖములలో పాల్గొను ప్రాణనాథుని గ్రహించుటకై యాతని నొక్కమారైన మచ్చుజూడక పెండ్లాడదగునా ?

సంపూర్ణ పరీక్షయనిన నిట్లుండవలెను. అప్పటికిగాని స్వయంవర విధానము పూర్తిగాజాలదు.

స్త్రీ జనోద్ధరణ దీక్షాదక్షులై పురుషాగ్రగణ్యులై వెలసిన ధీరులుండు రేని పైరీతిగ సర్వ సంపూర్ణ స్వాతంత్ర్య మొసంగి స్త్రీలపాలిటి కల్పతరువులై నవ్యసిద్ధాంతములకు నాయకులై కలిబాల్లియగు నీ కలియుగమున కధిదేవతలై వెలయుదురుగాక.

తనతోఁగూడి సుఖించుట కొకనినే కేర్పరచుకొని యా పరీక్షలో కృతార్థత నొందిన స్త్రీ యాప్రియుని పెండ్లాడినయెడల నొకింతదోషము లేకపోవచ్చును. కాని కోటి కొకతావున నైవిధముగ కృతార్థత కలుగునేమో. మిగిలిన వన్నియు నచ్చక విడిపోవును.

కొంతకాల మొకరికొకరు కలిసి మెలసి దాంపత్య సుఖ మనుభవించి యెద్దియో యొక నెపమున నా పురుషుని విడచి, పునఃపూజకై వేరొకనిఁగూడి కార్యక్రమము నుపక్రి

18 ఏండ్లలోపల వయస్సునకు మైనారిటీయని పేరు.

మించి, యిటుల వివిధపురుష సమాగమ సౌఖ్యాతిశయముచే తన శరీరమును రోగముల పుట్టగ నొనర్చుకొని, తన్నుం గూడిన క్రొత్త పెండ్లికొడుకులకు ప్రథమ గర్భాధాన సమయముననే చిత్రవిచిత్రరోగముల నంటగట్టి, వారి యిల్లు వళ్లు గుల్లం జేసి, ఘోర నరకకూప నిమగ్నులుగ నొనర్చి, దుఃఖ సామ్రాజ్య పట్టాభిషిక్తులం జేయుటయే, ఈ స్వయంవర వివాహజనిత మహోపకారమని యెఱుంగుము.

అనార్యుడు:—

మైనారిటి వెళ్లినను స్త్రీలకు లోకానుభవము కలుగనేరదని తెలిపియుంటిరి. ఒకవేళ నొకని వరించినను, అందనేక దోషములు గల్గును. వివరించితిరి. ఈడువచ్చినను స్త్రీల విషయముననే యిట్లుండ ఇక బాల్యావస్థలోనున్న కన్యలు తమకుదగిన పతులను వరింపగలరని జెప్పగలమా! అదియునున్నయే. అయితే ఇక స్త్రీలకు వివాహమగుటకు మార్గమెద్ది?

ఆర్యుఁడు:—

ఇదివఱకు జెప్పిన సమాధానములలో నాపద్ధతి యిమిడియున్నది. అయినను సూత్రప్రాయముగ జ్ఞప్తికిం దెచ్చెదను వినుము. స్త్రీ, భూమివంటిది. కాన నామెకొక యధిపతియుండవలెను. అది విధియైయున్నది. ఆతడే యామె పాలిటికి ప్రభువు. దేశమున కొక రాజుగావలెనన్న, భూవాసులందఱుగలసి యతని నెన్నుకొందురు. ఆరీతిగ భూమివంటి స్త్రీకి అధిపతి కావలసియుండెను. అనగా భర్తయవసరమయ్యెను. భూమివలె స్త్రీ సైతము పతిని వరింపం

జాలదు. భూసంబంధ జనులు ఎటుల భూపతి నెన్నుకొందురో అటులే స్త్రీసంబంధజనులు, స్త్రీకొక పతిని నిర్ణయింతురు. ఈ విధముగ స్త్రీలకు వివాహసంబంధ మేర్పడును.

అనార్యుఁడు:—

భూమి జడపదార్థ (ప్రాణములేనిది) మగుటచే పతి నెన్నుకొనుటకు వీలులేదు. స్త్రీయన్ననో ప్రాణముగలది. ఆమె స్వయముగ నొకని వరింపవచ్చును. కావున మీరు చూపిన పోలిక సరియైనదనుటకు వీలులేదు. ఈ సందర్భమున తమ భావమేమి ?

ఆర్యుఁడు:—

వీలులేకేమి ? ఇచ్చట ప్రాణమున్నను లేకున్నను ఒక్కటే. భూమి తననుండి సమస్తము నెట్లు కనుచున్నదో స్త్రీలు సైతము అట్లే సంతతిని కనుచుందురు. ఈ విషయమున నుభయులు సమానులే.

ఉపమానమందలి అంశములన్నియు ఉపమేయమున వచ్చునా ? రావు. ఒకనినిజూచి యాతడీ గ్రామమునకు సింహమని యందుము. సింహముగ పోల్చబడిన నరునకు నాల్గుకాళ్లు, తోక, మెడమీాద జూలు, ఈ విధముగ పశుత్వము సంభవించునా ? లేదు.

సింహమందలి ముఖ్యగుణమును మాత్రము గ్రహించి అనగా పౌరుషవంతునిగఁ జెప్పఁదలఁచి సింహమువంటి వాడని వెల్లడించితిమి. ఏదేని యొక ముఖ్యగుణమును స్వీకరించి పోలిక జెప్పచుండుట లోక సాంప్రదాయమై యున్నది. కావున స్త్రీని భూమితో పోల్చునపుడు అందుఁగు

ముఖ్య ధర్మమును అనగా సంతతి విషయమును గ్రహించి యటుల వర్ణింపఁబడెను.

భూమి కొకవేళ ప్రాణ మేర్పడినను తనకొక యధి పతిని స్వయముగ నిర్ణయించుకొనరాదని యెఱుంగుము. ఎందుకన వినుము.

I క్రైస్తవులు తమ యధిపతియగు "యెహోవా" యను దేవుని చేరదలతురేని, స్వయముగ నతని వరింప జాలక "క్రీస్తువు" అను నొక మహాత్మునివల్ల కృతకృత్యు లగుచుండిరి.

II తురకలు, తమ యధిపతియగు "అల్లాను" స్వయముగ గుర్తింపనేరక ప్రవక్తయగు మహామ్మదును మధ్యవర్తిగ నొనర్చుకొనిరి.

III తమ యధిపతియగు బ్రహ్మమునందైక్యమొంద దలచిన హిందువులు, స్వయముగ నతని గ్రహింపజాలక గురూపదేశమున ధన్యులగుచుండిరి.

జీవేశ్వరైక్య సిద్ధాంతమునకు మార్గమెద్దియో అదియే భార్యాభర్తలకు త్రోవయగును. ఇట్లగుటకు కారణము లేకపోలేదు. జీవుడు స్త్రీ స్వరూపుడనియు, సృష్టికర్తయగు దేవుడు పురుషరూపుడనియు మతము, బోధింపుచున్నది. జీవుడెటుల స్వీయపురుషుడగు దేవుని, (అనగా తనపతిని) వరించుటకు పరుల సహాయమాశించునో, అట్లే జీవునితో పోల్చబడిన స్త్రీ సైతము, తనపతిని స్వయముగ నెన్నుకొనక పరుల మూలమున ( అనగా తల్లిదండ్రులగుండా ) నాతని

జేరవలెను. కావున స్త్రీలు, బాల్యమునగాని, యౌవనమున గాని స్వయముగ పతిని వరింప వీలులేదు.

అనార్యుఁడు:—

అంతఃపుర స్త్రీలకు స్వయంవరము పనికివచ్చునని యిది వరకు తెలిపియుంటిరి. మరల జీవేశ్వర దృష్టాంతమును జూపి స్త్రీపురుషు లిరువురిలో బంధుత్వ మేర్పడుటకు మధ్యవర్తి తప్పదని సూచించితిరి. ఈ రెండుపద్ధతులు పరస్పర విరుద్ధములు గావా? వీనిలో గ్రహింపదగినదెద్ది?

ఆర్యుఁడు:-

పై సిద్ధాంతములు రెండును నిజమే. అది వారికి నిజము. ఇది వీరికి నిజము. ఎట్లన, ఇద్దఱు రోగులుండిరనుకొనుము. వారిరువురికి కావలసినది యారోగ్య మొక్కటే. అయితే అందొకడు వాత తత్వముగలవాడు. వేఱొకడు ఉష్ణ తత్వము గలవాడు. వాతతత్వ ప్రధానియగు పురుషుడు ఉష్ణ పదార్థముల సేవింపవలెను. ఉష్ణతత్వముగల రోగి శీతపదార్థముల నుపయోగింపవలెను. ఎవరెవరి కేపదార్థము లారోగ్య ప్రదములో ఆయా పదార్థముల సేవించుటే పరమ ధర్మము.

ఇట్లే అంతఃపురనివాసినులకు స్వయంవర పంధయును ఇతర స్త్రీలకు బంధునిర్ణీత పద్ధతియు శ్రేయోదాయకములు.

అనార్యుఁడు:

ఆర్యమహాశయా! అంతఃపురములోనున్నను సామాన్య గృహములోనున్నను స్త్రీలెల్లరు జీవులనియు పురుషుడు

దేవుడనియు తెలిపియుంటిరి. దేవుని జేరవలెనన్న, జీవునకొక మధ్యవర్తి (అనగా గురుస్వరూపి) యవసరమని జెప్పితిరి. అంతఃపుర స్త్రీలు సైతము జీవులవంటివారుకారా? దేవుని జేరుటకు మధ్యవర్తి యవసరమైనచో పతి నపేక్షించు (పెండ్లాడు) నంతఃపుర కాంతలకు మాత్రము సంధానకర్త యవసరము కాదా? కావున ఏతలిదండ్రులలో లేక బంధువులో స్త్రీ పురుషుల సంధింపజేసినగాని వారొక్కటగుటకు వీలులేదు. సత్య మిట్లున్నది. ఇక స్వయంవర రూపమున నొకనిని వరించు టెట్లు?

ఆర్యుడు:— మిత్రమా! వినుము.

మానవులు విషయవాసనల జిక్కుకొందురని తలచి అందుండి మరల్చుటకై యొక రక్షకుడు (అనగా నొకగురువు) మధ్యవర్తిగ నేర్పరుపబడెను. గురువుయొక్క యావశ్యకము విషయవాసనా లంపటులకేగాని తదన్యులకు లేదు. పుట్టినది మొదలు ఆహార వ్యవహారములలో మనసు లేనివాడై ఆత్మ చింతలో మునిగియుండెనేని అతనికి విషయవాసనలు లేవని తెలియవలెను. అవి లేనపుడు మోక్ష ప్రతిబంధకములుండవు. అట్టివానికి గురూపదేశ మెందులకు? అతడు స్వయముగ నాత్మరతుడై యుండెను. కావున, ఉపదేశకునితో పనిలేదు.

I దీనింబట్టి జీవులలో రెండువిధములైన జన్మములుండెనని తెలియవలెను. అందొకరి జన్మము మోక్షమునకు దూరము. అనగా పక్వముకానిది. కొంతవరకాశరీరమునకు క్రమశిక్షణము కావలెను. వానిని నడపుటకై గురువు లవసరము.

(2) వేరొకనిజన్మ మటులగాదు. అది మోక్షవిషయ మున కడ్డులేనిదై స్వతస్సిద్ధముగ పుట్టెను. అనగా జన్మించు నప్పటికే చాలవరకు పండుపండియుండెను. ఇంక నాతనికి గురువేల? ఉపదేశాదులన్నియు పూర్వజన్మముననో, లేక గర్భముననో, స్వప్నముననో, జరిగియుండెను. వారిని సామాన్య మానవులతో పోల్పరాదు. ఆధ్యాత్మికరాజ్య విష యమున ప్రయత్నించు జీవులు రెండు తరగతులని గ్రహించి తిమి. అట్లే ఐహికరాజ్య విషయమునగూడ స్త్రీలు రెండు తరగతులుగ నుందురు.

I బ్రాహ్మణ వైశ్య శూద్రాదాది జాతులలో జన్మించెడి పురుషులు కేవలము గృహరాజ్యాధిపతులై యుందురు. కాని దేశరాజ్య మధిష్ఠింప నర్హులైయుండరు. గృహరాజ్య మును కాపాడుటకన్న దేశరాజ్యమును రక్షించుట కెంతయో త్యాగ మవసరము. అది కృత్రిమముగాక నెంతసహజమై యుండిన నంతమేలు.

గృహాధిపతి తన యింటిచుట్టు నొకగిఱ (సర్కిల్)గీసి యందు వసించుచు నిదియే పరమావధియని తలచి మమకార మున వర్తించును. గృహమందలి యోగక్షేమములు ప్రతి క్షణమున వీక్షించునట్లు దేశక్షేమమునకై పూర్ణముగ పరీక్షింపజాలడు. ఒకవేళ నటులొనర్చినను జీవితాంతము వరకు సాధ్యపడదు. ఏమన, దేశరక్షణము గృహరక్షణము వలె సామాన్యమైనదికాదు. కోటానకోట్ల ప్రజలను కాపాడు టకు, చురుకుదనము, నైపుణ్యము, పరాక్రమము, బుద్ధివికా సము, దీర్ఘదృష్టి, పాపభీతి, భూతదయ, ఆస్తిక్యము, త్యాగ

శీలత, నిరంతరదీక్ష మొదలగు గుణపుంజము లెన్నియో ముఖ్యము లైయున్నవి. దే శ ర క్ష ణ ము క త్తిసాము వంటిది. సమయము వచ్చునేని ప్రాణత్యాగమున కైనను నడుముగట్ట వలెను. సంసార మేమగునని చింతింప వీలులేదు. భోగముల నెల్ల తృణప్రాయముగ జూడవలెను. అంతఃపురాలలో నుయ్యేలలూగు అసూర్యంపశ్యలైన లతాంగుల నవలీలగ విడువవలయును. ముక్కుపచ్చలాఅని ముద్దుబిడ్డలను సయితము త్యజింప సమయమే తెంచును. ఆహా! రాజధర్మ మెంత దుర్భరము!

కావుననే కాబోలు జగత్ప్రభువగు పరమేశ్వరుడు లోకరక్షణార్థము ప్రభురూపమున నవతరించునని ప్రాజ్ఞులు పల్కుచుందురు. అతడు దేవాంశసంభూతుడే కాకున్నచో పై గుణపుంజము లెన్నియో యలవడుటకు సాధ్యమా? కావుననే హిందూమతము ప్రభువును దేవునిగ పోల్చుచున్నది. "నావిష్ణుః పృథివీపతిః" అనున్యాయమిదియే.

మిత్రమా! అట్టి పవిత్రమూర్తులగు రాజన్యవరుల గనుట కెట్టి విరాగిణులగు సాధ్వీమతల్లు లుండవలయునో యోచింపుము. గృహరాజ్యమున వసించు సామాన్య స్త్రీలకును, వీరికిని, ఎంత భేదముండునో తెలిసెనుకదా! వారలకు విషయవాసనలు మెండు, వీరికి వైరాగ్యమధికము. కావున సామాన్య గృహిణులు విషయలంపటలై యింటిలోపలను, వెలుపలను మెలగుచుందురు. తన్మూలమున విషయసంబంధమతిశయించును. అంత నాశాపాశములలోజిక్కి వా ని ని

తృణీకరింపలేరు. మనోదౌర్బల్య మావహించి, త్యాగము నశించును. ఎపుడు త్యాగశక్తి లేదో అపుడు ఆధిపత్యము లభింపదు. అనగా విషయములపై నధికారముండదు. అది క్షీణించుచో పాలనాసామర్థ్య మంతరించును.

ఇవ్విధముగ సామాన్య స్త్రీలలో ప్రభుశక్తి తగ్గి వారియందు ప్రభుబల సంపన్నులు జన్మింపరు ప్రభువులనగా ధర్మరాజ్యము సేయువారని యర్థము.

రాజ్యములేనిది ప్రపంచము నిలువజాలదు. అందుకై కొందఱు వనితామణులు రాజుల గనవలసియున్నది. ప్రపంచ రంగమున పలువురిలో కలసిమెలసి తిరుగుచుండెడిస్థితి తొలగినగాని యట్టిశక్తి కలుగనేరదు. అపుడు విషయనిరసనము, ఇంద్రియ నిగ్రహము, ప్రభుత్వశక్తి మున్నగు ధీరగుణములలవడును. అట్టి గుణములతో మిళితమైన రక్తమునుండి ధర్మరాజు జనింపగలడు. వానిని గనుటకై నారీరత్నములంతఃపుర నివాసినులై యుండవలెను. అచ్చట నానావిధ ప్రదర్శనములుమఱియు. కామోద్రేకమును బుట్టించు పురుషపుంగవుల వీక్షణప్రసారములు గోచరింపవు. ఏమియుఁ దోచలేదని ముచ్చటలకై యిచ్చవచ్చినటుల నిరుగుపొరుగులకేగవలసిన మనశ్చాంచల్య ముదయించదు. కొండ గుహలలోనుండు సహజ నిష్ఠాగరిష్ఠులగు యోగీశ్వరులవలె నంతపుర గుహాన్తరాళమున వర్తించు పతివ్రతలు యోగినీమణులై యుండురనుటలో నాశ్చర్యమా!

ఆహా ! వారి జీవితచరిత్ర మతి పవిత్రము. ధన్యము. పూజ్యము. మఱియు నాధ్యాత్మిక రాజ్య మాక్రమించుటకు స్వతస్సిద్ధముగ జన్మించి పక్వమైయున్న యోగులతోఁ బోల్పఁదగియున్నది. పండుపండిన జీవులకు గురుసహాయము లేక, నెటుల స్వయముగ నాత్మతత్వము తెలియునో అట్లే అంతఃపుర నివాసినులగు యోగినీరత్నములు సైతము, బంధు నిర్ణయము లేక స్వయముగ నాత్మేశుని (ప్రాణనాథుని) వరింప గలరు.

అనార్యుఁడు:—

"సామాన్య స్త్రీలకు విషయవాసన లతిశయించును. అంతఃపురస్త్రీలకవి విశేషముగ నుండవు. అని జెప్పితిరే విషయవాసనలనగా నెవ్వి?

ఆర్యుఁడు:—

ప్రపంచము, దేహము, అని రెండు పదార్థములు గలవు. ఈదేహము, పై ప్రపంచమును అనుభవించుట కేర్పడినది.

<u>పంచ</u> యనగా అయిదని యర్థము. ప్ర, అనగా పెద్దది. ప్రపంచ, అనగా పెద్దవి యైదు. ఆకాశము, గాలి, నిప్పు, నీరు, మట్టి, ఈ యైదింటికి పంచభూతములని పేరు. ఇవి కలసిన స్వరూపమే ప్రపంచమనబడును. దేహము, ఈ యైదింటి నెటుల ననుభవించునో గ్రహింతము. ఆకాశమునకు శబ్దశక్తి, గాలికితాకు (స్పర్శ) నట్టిశక్తి నిప్పునకు కనపడే (రూప) శక్తి, నీటికి రసశక్తి, భూమికి గంధశక్తి కలదు.

వీనినే, శబ్ద స్పర్శ రూప రస గంధములనియు, విషయము లనియు వ్యవహరింతురు.

వీని నార్జించి యనుభవించుటకు జీవుడు యత్నింపు చుండును. అందుకై అతనియం దైదు సాధనములుఁ గలవు. అవి త్వక్, చక్షు, శ్రోత్ర, జిహ్వా, ఘ్రాణములని పిలువ బడును. చర్మము, కన్ను, చెవి, నాలుక, ముక్కు, అని వానికి పేరు. పంచేంద్రియములనగా నివియే. జీవుడు ఈయైదింటిచే ప్రపంచమందలి యైదు విషయములను స్వాధీన మొనర్చు కొనుచుండును.

1. చర్మము చే గాలి కలదని తెలిసికొనుచు నందలి సుఖ మనుభవించును.

2. కన్ను చే నిప్పు యొక్క రూపమును గ్రహించి తనివి జెందును.

3. చెవుల చే నాకాశ స్వభావమగు శబ్దమునువిని యానందించును.

4. నాలుక చే జల మందలి రసమును రుచిచూచి సుఖించును.

5. ముక్కు చే భూమి యందలి వాసననుబీల్చి తృప్తి జెందును.

ఇటుల నైదింద్రియములచే నైదు విషయముల గ్రహించునట్టి యలవాటుపడును. ఒకమా రలవాటుపడిన విషయము, ఇంద్రియముల మూలమున మనస్సునందు అచ్చు గ్రుద్దినటుల నిలచును. అది యెట్లన,

ఒక డొకనాడు సినిమాకు వెళ్లెను. అచ్చట ననేక విధములగు బొమ్మలను జూచెను. అటుల జూచుటకు సాధన ములు నేత్రములై యున్నవి. నేత్రములనగా కండ్లు. అవి బొమ్మలయందలి సారమును మనసునందు జేర్చెను. అంత నామనసు ఆ విషయమును అనగా బొమ్మల సారమును తన యందు అచ్చుగుద్దినటుల జేసికొనెను. ఇట్లే చెవి ప్రపంచ మందలి శబ్దముల గ్రహించి వానిని మనసునందు జేర్చును. ఇంద్రియములన్నియు నీవిధముగ విషయములను సంపాదించి మనస్సు అను పెట్టెలో దాచుచుండును. తన పెట్టెలోనున్న విషయముల ననుభవించి జీవుడానందింపుచుండును. ఇంత టితో నీకథ ముగియదు. ఏమన లోకమున నొక విచిత్రమగు స్వభావముగలదు. అది ప్రకృతి సిద్ధము. ఇంగువ నొక గుడ్డ యందుకట్టి కొంతకాలముంచి యటుపై తీసి వాడుకొన్నను అది లేనందున గుడ్డలోనివాసన పోవునా? అది యెటులపోదో, అటుల నాయింగువను తినవలెనని యాశయు మననుండి పోజాలదు. ఆయాశను పుట్టించునదియే వాసనయనబడును.

ఎటులైనను దానిని సంపాదింప విశ్వప్రయత్న మొన ర్తుము. జీవులెల్లరు పైవిధముగ విషయవాసనలచే జిక్కుచు పూర్వ కార్యముల జేయ నలవాటుపడుచుందుము. సముద్ర తరంగముల కెట్లు అంతముండదో యీ వాసనాపరంపరలు సైతము అంతమొందక ననంతమైయొప్పు సంసారమున ముంచివేయును. ఇట్లు సంసారసాగర నిమగ్నులైన జీవులు దరిగానక దుఃఖింపుచుందురు.

దీనింబట్టి ఏయే వేళల నేయే విషయముల సాధించుటకు కర్మలొనర్పబడెనో ఆయా కర్మలు విషయవాసనారూపమున నేర్పడి తిరిగి వానినే చేయించును. కావున మొదటినుండి తెలివిగల్గి విషయములలో జిక్కకుండునటుల యత్నించుటే ముక్తిమార్గమని తెలియవలయును.

అనార్యుడు:—

స్త్రీలు పతులను వరించినను వివాహానంతరము వారిని విడువగలరని జెప్పితిరి. అది నిజమేని అంతఃపురనివాసినులగు క్షత్రియస్త్రీలకు స్వయంవర వివాహాజ్ఞ యొసంగబడినచో వారికి మాత్రము పై దోషము లేలసంభవింపవు. అనగా మొదటి మగడు నచ్చనిచో రెండవవాని నేమకు పెండ్లాడరు!

ఆర్యుడు:—

క్షత్రియ స్త్రీలు ఇంటిలోగాని, వెలుపలగాని పురుషులతో కలసిమెలసి తిరుగుట కవకాశము లేదు. దీనిని జ్ఞప్తియందుంచుకొన్నచో నీ సంశయము తీరును. ఆ జాతియందలి రక్తము స్వేచ్ఛాప్రవర్తనకు స్థలమొసంగదు.

మత ధర్మముల నశింపజేయు దురాచార మతిశయించినయెడల దాని నణగద్రొక్కుటకై క్షాత్రరక్తము కదలుచుండును. ఈ కారణమున నాజాతి దేవతాంశతో బుట్టి దుష్టసంహార మొనర్చునని తెలియవలెను. మానవుల గనుకన్ట్టి స్త్రీలు మూడుతరగతులని గ్రహింపుము. అందు క్షత్రియ స్త్రీ లొకతరగతికి జెందియుండిరి.

### 1. వ తరగతి స్త్రీలు.

వీరికి శాస్త్రములతో బనిలేదు. కాపురము చేయు చున్నను పురుషులతో సమానముగ వర్తింతురు. వారి హృదయములు కామవాసనా దూషితములై యుండును. సాధారణముగ ననేకుల నాకర్షింపగలరు. వీరిలో యోగ్యతను కాపాడుకొనువారు కోటికొక్కరుందు రేమో!.

### 2. వ తరగతి స్త్రీలు.

వీరు వేదశాస్త్రానుసారము గార్హస్థ్యధర్మముల బాటింతురు. ఇంటియందే కాలము గడుపుదురు. ఇంటి వెలుపలకు పోదలతురేని తమ మగవారిని తోడుజేసికొనకపోరు. ఒకప్పుడొంటరిగ వెళ్ళదలచినను సమీపబంధువుని వెంట నిడుకొందురు. మఱియు భయభక్తులుగల్గి చరింతురు. వీరిలో సామాన్యముగ నూటికి తొంబదితొమ్మిదివరకు చెడిపోవుటకు తావులేదు. ఒకరిద్దఱు చెడినను అంతగ లెక్కింపవగినది కాదు.

ప్రభువులు వేదధర్మము ననుసరించి పాలింతురేని యీ తరగతియందలి స్త్రీలలో పారిశుద్ధ్య మెంతమాత్రము జెడనేరదు.

### 3. వ తరగతి స్త్రీలు.

వీరు జన్మించినది మొదలు యిల్లువెడలక అంతఃపురములయందే వసింతురు. అచటనైన తల్లిదండ్రులను, అన్నదమ్ములనుతప్ప నితర బంధువులనుగాని, పరపురుషులనుగాని చూచుటకైనను నోచుకొనరు. లోకమంతయు స్త్రీ స్వమే యని భ్రమించునట్టి యమాయకస్థితిని బొందియుందురు.

కొంతకాలమునకు పెండ్లాడినను పతిస్వరూపమునుదప్ప పర పురుషసందర్శనాదుల జేయజాలరు. భర్తయొక్కడే తన పాలిటికి కల్పతరువని విశ్వసింతురు. కోపిష్ఠుడైనను, అసమర్థుడైనను ఆతని విడువజాలరు. క్షత్రియస్త్రీలెల్లరు మూడవ తరగతిలో జేరియుండిరి. కావున వీరు స్వయంవరముచే నొక పురుషుని పెండ్లాడి యనంతర మతనివలన సుఖముకల్గకున్నను వానిని విడచి యన్యుని చేపట్టవలెనని కలలోనైన దలంపరు.

క్షత్రియజాతిలోనున్న నియమముల దెలిసికొనుట దుర్లభము. వారి జీవితము లోకముతో పోల్పదగినది కాదు. వారియెడ కళంక మెంతమాత్రమాపాదించుటకన్న మౌఢ్యము వేరొండులేదు. * క్షత్రియులలో నిట్టి ఘోషాపద్ధతి పూర్వకాలమున గలదాయని సంశయింతువు కాబోలు!

నేటికి రామావతారకాలము రమారమి కోటి వత్సరములకు మించినది. రావణ సంహరణానంతరము సీతను మహాజనులుండుచోటికి తీసికొనిరమ్మని శ్రీరాముడు లక్ష్మణునితో బల్కెను. పరపురుషులెందరో యుండగ వారియెదుటకు దెచ్చుటెట్లని లక్ష్మణుడు ప్రశ్నించెను. "విపత్తులందు, యుద్ధములందు, ఉత్సవములందు, యాత్రలందు, మహాజన సమావేశములందు, పట్టాభిషేకములలో—స్త్రీలు జనమధ్యమున నిలుచుట నిర్దోషమని శ్రీరాముడనెను. దీనినిబట్టి తదితర సమయములందెల్ల ఘోషాపద్ధతి యున్నదని స్పష్టమగుచున్నది. సారాంశ మేమన!

---

* క్షత్రియస్త్రీలకు పూర్వకాలమున ఘోషా కలదనుటకు శాస్త్రప్రమాణములు రాబోవు గ్రంథములలో దెలుపబడును.

మొదటి రెండుతరగతులలోని స్త్రీలు స్వయంవర వివాహము లొనర్చుకొన్నయెడల నేయే దోషములు సంభవించునో, అయ్యవి మూడవతరగతిలో జేరిన క్షత్రియ స్త్రీల కంట నేరవు.

అనార్యుడు:- ఆర్యపుంగవా!

"మైనారిటీ వెళ్ళిన స్త్రీలైనను పరపురుషుల వరింప దలతురేని, బాహ్యలక్షణములే యెఱుంగగలరు. ఆంతరంగిక స్వభావములు గ్రహింపజాలరు"అని యిదివరకు తా మాక్షేపించి స్వయంవర వివాహముల నిషేధించితిరి. ఇక తలిదండ్రులో లేక బంధువులో పతుల నేర్పఱుపవలసియుండును. ఎంతపెద్దలైనను వరుని బాహ్యలక్షణములే గ్రహింపగలరు. వధూవరుల మనోభావముల కైక్యముగలదో లేదో వారు మాత్రము గుర్తింపగలరా!

ఆర్యుడు:—

నీవడిగినది బాగుగనేయున్నది. మైనారిటీ వెళ్ళినను స్త్రీలు పురుషులగుణములను గ్రహించుట కెటులసమర్థులుగారో అటుల తల్లిదండ్రులు మొదలగు బంధువులు సైతము వరుని మనోభావముల గుర్తింపజాలరు. అయినను ఈ విషయమున కన్యకంటె తలిదండ్రులు వివేకులని యెఱుంగుము. ఏమన; తమ జీవయాత్రలో మిక్కిలి యనుభవము పొందియుండిరి.

ఇవ్విధముగ జూచినను స్త్రీలు తమ భర్తల నిర్ణయించుకొని పెండ్లాడుటకంటె తల్లిదండ్రులే నిశ్చయించి వివాహము లొనర్చుట యుక్తమని తోచుచున్నది. వారికి దైవదత్తమగు వేరొక సాధనము గూడగలదు. దానిని ప్రపంచ

మున నిదివర కెవ్వరును కనిపెట్టియుండలేదు. అదృష్టవశమున భారతీయులకు మాత్రమే లభించినది. దీనినే జాతకచక్రి మందురు. తత్సహాయమున * వధూవర స్వభావములు పూర్తిగ తెలియగలవు.

స్త్రీయొక్క జాతకచక్రమునకును, పురుషుని జాతక చక్రమునకును పరస్పర సంబంధముండెనేని వారికి వివాహము లొనర్తురు. అటుగాక పైచక్రములకు పరస్పర విరోధ ముండునెడల వారల కెంతమాత్రము పెండ్లి గావింపరు. స్త్రీలు తమంతటతాము వరించి పెండ్లాడు విధానముకంటె పై పద్ధతి ననుసరించి తల్లిదండ్రులచే నొనర్పబడు వివాహములే శ్రేష్ఠములు.

ఇక్కాలమున నటుల జేయుచుండిరాయని ప్రశ్నింప కుము. సాంఘికులు కలిసి పనిచేసినయెడల నసాధ్యమగు కార్య ముండదు. అందుకై యత్నించవలసియున్నది. ఈవిధముగ సంఘసంస్కారము గావింపనగును.

అనార్యుడు:—

మహాశయా! స్త్రీపురుష జాతకములలోని గ్రహము లకు సంబంధమున్నచో వారికి ప్రేమభావము లతిశయించునని తెలిపియుంటిరి. ఆకాశమందలి గ్రహములకును, భూమియం దలి జీవులకును సంబంధమున్నదనుట వింత కాదా? ఇట్టి సిద్ధాం తము బుద్ధిమంతులకు రుచించు టెట్లు?

ఆర్యుడు:—

మిత్రమా! ఈసిద్ధాంత మెంతమాత్రము దోషయుక్త

* వధువు—పెండ్లికూతురు. వరుడు—పెండ్లికొడుకు.

ముగ లేదు. భూతలమున చరాచర జీవరాశి యంతయు గ్రహా ధీనమని యెఱుంగుము. అందు ముఖ్యముగ సంసారయాత్రకు గ్రహసంబంధ మత్యావశ్యకము. సంవత్సరములు, మాసములు, వారములు, తిథులు లేనిది క్షణమైనను వ్యవహారము నడువజాలదు. చైత్రము, వైశాఖము, జ్యేష్ఠము, ఆషాఢము అను నామము లెక్కడివి? మొదటినెల, రెండవనెల, మూడవనెల అని వ్యవహరింపకూడదా? అవి యెటుల కలిగెను? ఈ రహస్యము ప్రతి హిందువు తెలియదగియున్నది. వినుము. లోకమున కెక్కువ మేలుసేయు నక్షత్రములు 27 గలవు. అందులో చిత్తానక్షత్రి మొకటి. ఏ నెలలో పౌర్ణమియందు చంద్రుడు చిత్తానక్షత్రి సమీపమున తిరుగునో ఆనెలకు చైత్రమాసమనిపేరు. ఏమాసమున పూర్ణిమ నాటి చంద్రుడు విశాఖా నక్షత్రమున చరించునో ఆనెలకు వైశాఖమనిపేరు. జ్యేష్ఠానక్షత్రముచే జ్యేష్ఠ మాసము, పూర్వోత్తరాషాఢలచే ఆషాఢమాసము, శ్రవణముచే శ్రావణము. పూర్వోత్తర భాద్రలచే భాద్రపదము. అశ్వినీ నక్షత్రముచే ఆశ్వయుజము. కృత్తికా నక్షత్రముచే కార్తికము. మృగశిరచే మార్గశిరము. పుష్యమీ నక్షత్రముచే పుష్యమాసము. మఖచే మాఘము. పూర్వోత్తర ఫల్గునీ నక్షత్రములచే ఫాల్గుణము, ఇటుల ఖగోళమండలి తారాగణముచే భూగోళమున మాసనామము లేర్పడి జగద్వ్యవహార కారణము లగుచున్నవి.

ఇక వారములవిషయ మాలోచింతము. ఆదిత్యుడనగా సూర్యుడు. అతని నామమున ఆదిత్య (ఆది) వార

మేర్పడెను. సోముడన చంద్రుడు. అతని పేరున సోమవారము కలైను. మంగళుడనగా నంగారకుడు. అతనివలన మంగళ వారము. బుధగ్రహమువలన బుధవారము. గురుగ్రహముచే గురువారము. శుక్రునిచే శుక్రవారము. శనిగ్రహముచే శనివారము. ఇటుల ఖగోళమందలి గ్రహములు భూగోళ మున వారములకు కారణములయ్యెను.

క్రైస్తవ మతమునగూడ నిట్లేయున్నది. సన్ అనగా సూర్యుడు. ఆదివారమునకు "సన్ డే" అని పేరు. మూన్ అనగా చంద్రుడు. సోమవారము "మండే" అని పిలువబడును. సాటరన్ అనగా శని. శనివారమును స్యాటర్ డే అని పిలు తురు. భూగోళ వ్యవహారమునకు ఖగోళము కారణమనుట స్పష్టము. ఆకసమున చిత్తానక్షత్రముండెను. కుక్కలు భూమి యందుకలవు. చిత్తకార్తెలో కుక్కలకు కామ మతిశయిం చును. శునక (కుక్క) దేహములలోని పదార్థములకును, చిత్తా నక్షత్రమందలి వస్తుతత్వమునకును సంబంధములేనిచో నటుల జరుగదు. ఆకార్తెలోవేసిన పైరుపంటలు విశేషముగ ఫలించును. మృగశిర కార్తెలోని పునాసపైరులు బాగుగ పండును. పసుపు, జొన్నలు మొదలగునవి రోహిణీకార్తె మొదలు ఆర్ద్రకార్తెలో వృద్ధిజెందును. ప్రత్తికి మఖకార్తె ఉత్తమము. హస్త చిత్త కార్తెలు తెల్లజొన్నలకు ముఖ్యము. కొన్ని కార్తెలలో గురిసినవర్షము సస్యములకు కీడు గల్గిం చును. అనగా తెగులుగల్గి పంటలు చెడిపోవును. ఒక కార్తెయం దొకరకమగు ధాన్యము ఫలించును. అదేధా న్యము వేరొక కార్తెయందు క్షీణించును.

వడ్లలో ననేక జాతులుగలవు. వడ్లన్నియు నొకేజాతి యని భ్రమించి వాని నన్నిటి నొక కార్తెయందు వెదజల్లి నాటినయెడల అందు కొన్ని జాతులేపండి మిగిలినవి నశించును. ఆకసమందలి ఉరుములవలన మొగిలిచెట్లు పుష్పించును. కొన్ని సమయములందు గల్గిన యురుములచే వంకాయలకు పురుగుపట్టును. అపుడు చెరకునకు రుచి తప్పును. ఎదురుబొంగులను చీకటియందు నఱికినయెడల అందలి గట్టితనము చెడదు. వెన్నెలలో నఱికినచో పుచ్చిపోవును. హస్త చిత్త స్వాతి కార్తెలలో వేయబడిన గోధుమలు, శనగలు విశేషముగ పెరుగును. స్వాతి కార్తెలోని వర్షబిందువులు ముత్తెపు చిప్పయందు బడినపుడు ముత్తెములగుచున్నవి. తొలి యురుమునకు ఎదురు ఒక్కసారి పైకి పెరుగుచున్నది. గ్రహణము పట్టినపుడు గర్భిణీ స్త్రీలు వెలుపల సంచరించిన యెడల గర్భములోని శిశువున కేదేని యొక యవయవము వంకర బోవుచున్నది. ఆకసమున తోకచుక్క పుట్టెనేని భూమియందొక మహాపురుషుడు మరణించును. ఏడుగ్రహము లొకరాశియందు చేరినపుడు యుద్ధములు, భూకంపములు, సంభవించును. ఇవి యన్నియు పుక్కిట పురాణములని వచింపకుము. అటుల జెప్పినయెడల తెలివిలేని తెలివికల వాడవయ్యెదవు. రైతులు సయితము నిన్ను చులకనగ జూతురు. ఈ కారణమువలన ఆకసమందలి గ్రహములకును భూమికిని విశేష సంబంధ మున్నటుల స్పష్టమగుచున్నది.

రెండవ భాగము సమాప్తము.

# గ్రహ రాజ్యము.

## ( 3 వ భాగము )

### (24 వ ప్రశ్న)

అనార్యుఁడు:—

మహాత్మా! ఆకాశ భూములకుగల సంబంధము యుక్తి యుక్తముగను, అనుభవసిద్ధముగను, ప్రకృతి బద్ధముగను, వివరించి నాస్తికులకు సయితము సమ్మతంబగునటుల తెలిపితిరి. అయితే ఆకసమందున్న గ్రహములు లేక నక్షత్రములు భూలోకవాసులకు సుఖదుఃఖముల నొసంగుచున్నవని వేద ప్రమాణములు కలవా?

ఆర్యుఁడు:—

మిత్రమా! ఆవిషయము వేదమునకలదు. ఆకసమందున్న చిత్తానక్షత్ర మెటుల భూలోకమునకు మేలొనగూర్చునో చూడుము.

"త్వష్టా నక్షత్రమభ్యేతి పశ్చాత్ ।
తన్నక్షత్రం భూరిదాఅస్తుమహ్యాం ।
తన్నఃప్రజాం వీరవతీగ్ంసనోతు ।
గోభిర్నో అశ్వైస్సమనక్తుయజ్ఞం॥" (వేదము)

చిత్తా నక్షత్రమున కధిదేవత త్వష్టప్రజాపతి, ఆనక్షత్రము, మాకు వీర్యవంతమగు సంతతినేగాక, సంపదను సయితము, ప్రసాదించుగాక. మరియు ఆవులను గుఱ్ఱములను

యజ్ఞసహాయార్థము సమకూర్చుగాక, అని వేదమున గలదు. ఈనక్షత్రి మెటుల మనుష్యులకు మహోపకార మొనర్చు చున్నదో తెలిసెనుగదా!

"ఇంద్రో జ్యేష్ఠామనునక్షత్రమేతి ।
తస్మిన్వయ మమృతందుహానాః ।
ఉరుంకృణోతు యజమానాయలోకమ్." (వేదము)

ఇంద్రాధిపత్యముగల జ్యేష్ఠానక్షత్రిమునుండి అమృతము లభించుగాక. ఆనక్షత్రిము యజ్ఞమొనర్చు యజమానునకు సర్వోత్తమంబగు నుత్తమలోకమును ప్రిసాదించుగాక.

"నక్షత్రాణాం శతభిషగ్వసిష్ఠః ।
శతగ్ం సహస్రాభేషజాసిధత్త ।
దీర్ఘమాయుః ప్రతిరద్భేషజాని॥" (వేదము)

నక్షత్రములలో శతభిష నక్షత్రము వసిష్ఠునివలె శ్రేష్ఠమైనది. అది వేనకువేలు దివ్యౌషధముల నొసంగుచు దీర్ఘాయుష్యమును ప్రిసాదించుగాక.

"హృద్రోగం మమసూర్య ।
హరిమాణంచ నాశయ॥"

ఓ సూర్యదేవా! నాహృదయరోగమును, పచ్చని రోగమును, నశింపజేయుము.

"సోమోధేనుగ్ంసోమో అర్వంతమాశుగ్ం ।
సోమోవీరం కర్మణ్యంచదాతు॥" (వేదము)

చంద్రగ్రహము ఆవులను, గుఱ్ఱములను, కర్మనిష్ఠులగు పుత్రిలను ప్రిసాదించుగాక. అని వేదము గ్రిహనక్షత్రిముల యుపయోగములను వేనోళ్ల చాటుచున్నది.

ఈ సంభాషణము వినుచు నొక నాస్తికుడు (దేవుడు లేడనువాడు) ఈక్రిందివిధముగ ప్రశ్నించుచున్నాడు.

నాస్తికుడు:—

ఆర్యానార్య మహాశయులారా! మీ ప్రశ్నోత్తరము లెంతయో హాస్యాస్పదములై యున్నవి. మీ రిరువురు గ్రుడ్డివారు. దేవుఁడొకడు కలఁడా? అతడు మీయెదుట ప్రత్యక్షమై వేదము లొసంగెనా? * అవి దైవదత్తములా? ఎందుకీపిచ్చి? అమాయకులగు మానవుల మోసపుచ్చుట యింకెంత కాలము? మీయిరువురిలో నొకరు వేదములన్నిటిని నమ్మెదురు. మఱియొకరు వేదమందలి కొన్ని భాగములే విశ్వసింతురు. మీరిరువురును దేశద్రోహులే. ఇది యిరువదియవ శతాబ్దము. ప్రకృతిశాస్త్ర (సైన్సు) పరిజ్ఞానము వ్యాపించుచున్న కాలమున సగమువేదము, నిండువేదము అని పలవరించుట వివేకమా? ఆకసమందలి గ్రహములకును భూమియందలి వ్యక్తులకును గల సంబంధమును, ప్రత్యక్ష ప్రమాణము చేతను, ప్రకృతిశాస్త్ర విజ్ఞానముచేతను, నిరూపించిననాడు లోకము మీనాయకత్వ మంగీకరించును. ఆర్యమహాశయా! అనార్యుని ప్రశ్నల నవలీలగ ఖండింపుచుంటిరే. ఆకాశభూములకుగల పరస్పర సంబంధమును ప్రత్యక్షముగ తెలుపగలరా?

ఆర్యుడు:—

సోదరా! వినుము. పూర్ణిమయందు చంద్రుడాకస

* వేదములు భూలోకమున కెటులదిగినవో, రాబోవు గ్రంథములలో నుండును.

మున పూర్ణప్రకాశమున నుండును. తత్కారణమున భూమి యందలి సముద్ర ముప్పొంగును. అత డచ్చోట లేని సమయ మున అనగా, అమావాస్యయందు భూమియందలి పిచ్చివాం డ్రకు పిచ్చి యుద్రేకించును. సూర్యగ్రహణ సమయమున కొన్ని రకములైన కుక్కలు మరణించును. ఈవిషయమిట్లుండ నిమ్ము. సైన్సు, సైన్సు, అని మాటిమాటికి కలవరింపు చుంటివి. నీకు ప్రకృతి శాస్త్రవేత్తలు గురువులు. వారి చరిత్ర మును వినుము. పిచ్చివారలకు వైద్యశాలల (ఆసుపత్రిల) నిర్మింపుచున్నారు. దానిని నీవెఱిగియేయుందువు. ఆ వైద్య శాలలను ఇంగ్లీషులో "ల్యూనెటిక్ ఎసైలం"అని పిలుతురు. ల్యూనా యనగా ల్యాటిన్ భాషలో చంద్రుడని యర్థము. ఆ వైద్యశాల చంద్రసంబంధమైనదని స్పష్టమగుచున్నది. అక్కడికి పిచ్చివారే పోవుటకు కారణమేమి? పిచ్చియనునది శరీర సంబంధమైన జాడ్యముగాదు. అది మానసిక రోగము. మనస్సునం దెద్దియో లోపముగల్గుటచే నయ్యది చెడెను. తన్మూలమున పిచ్చి యేర్పడెను. మనసునగల్గిన లోపము పూర్తి యగునేని పిచ్చి కుదురుటలో నాశ్చర్యము లేదు. మానసిక పదార్థమును పిచ్చివారి మనసులో జేర్చినయెడల నా మనసునిండినదై రోగ మెగిరిపోవును. ఈ వైద్యశాల చంద్రసంబంధమగుటచే నచ్చట నా తత్త్వమునకు సరిపడు చికిత్స జరుపబడును. అంతట పిచ్చివారి మనసులో చంద్ర సంబంధ పదార్థ మావరించి దానిని కుదుర్చుచున్నది.

ఆకసమందలి చంద్రునకును భూమియందలి మనస్సునకు సంబంధము లేనిదే పై వ్యాధి శమింపదని విశదమయ్యెను.

"చంద్రమామ నసోజాతః" అని వేదము నయితము చంద్రునకు, మనస్సునకు సంబంధము గలదని తెలుపు చున్నది. చూచితివా! వేదము-సైన్సు-ఒక్కటేయని తెలిసెను. ఇంతియేకాదు. సైన్సుకుగూడా తెలియని విషయములు వేదమున గలవు.

"Half knowledge is dangerous."

అన్నటుల వేదశాస్త్రజ్ఞాన మెఱుంగక ప్రకృతి శాస్త్రమును (సైన్సు) పూర్తిగ జదువక నుభయభ్రష్టులగుచు వేదమును

"నాన్ సెన్సు" (తెలివి లేనిది)

అనుచుందురు. సెన్సు (తెలివి) లేనివారు వేదమును "నాన్ సెన్సు" అనుట సహజమే.

"ఫిజియాగ్రఫీ" శాస్త్రవేత్తయగు డాక్టరు టూరంటక్ అను పాశ్చాత్య విద్వాంసుడు అనేక వత్సరములు కృషి యొనర్చి చంద్రునకును, మనస్సునకును చాల సంబంధము గలదని నిరూపించెను. ఇక రెండుజాములకు గ్రహణము పట్టుననగా జీవరాసుల గర్భములలోని జీర్ణాశయమునకు పటుత్వము తగ్గునని వచించెను. మఱియు గ్రహణమునకు ముందు ఆహారమును గైకొనరాదని నుడివెను. ఈ రహస్యమును దివ్య జ్ఞానులగు మహర్షులు కోట్లకొలది వత్సరముల క్రిందటనే గ్రహించి శాస్త్రరూపమున వెల్లడించిరి.

అనార్యుఁడు:-

అయ్యా! నాస్తికునకు తగిన ప్రత్యుత్తర మొసంగితిరి. ఇదివర కెన్నఁడును కనివిని యెఱుంగని క్రొత్త విషయమును దెల్పితిరి. స్త్రీపురుషుల జాతకములగుఱించి విశేషముగ వర్ణించితిరి. జాతకచక్రమనగ నేమి?

ఆర్యుఁడు:—

స్త్రీగాని, పురుషుఁడుగాని, జన్మించినపుడు ఆ సమయమును గుర్తించి అపుడాకసమున నేయే గ్రహము లేయే రాసులందున్నవో తెలియుటకు వ్రాయబడునదే జాతకచక్రమనబడును. దానిని జూచి ఆజీవి యేనక్షత్రమున జనించెనో, ఏ లగ్నమునబుట్టెనో, ఏయే గ్రహము లతనికి సుఖదుఃఖ కారకములగునో, అతని జీవిక యెట్టిదో, ఆయుఃప్రమాణ మెంతయో, మనోభావములెట్టివో తెలియుటకు వీలగును.

ఇవి వివాహవిషయమున మహోపకార మొనర్చుననుట సత్యము.

పూర్వకాలమున హిందూ ప్రభువులు రాజ్యమేలు నపుడు మతప్రచార మకుంఠితముగ వెలయుచుండెను. పల్లెలనక పట్టణములనక నెచ్చట జూచినను మతప్రబోధము గావింపబడుచుండెను. మతసంబంధమగు గ్రంథాలయములు వాడవాడల వ్యాపించియుండెను. ప్రజలెల్లరు విద్యావంతులగుటకై ఎన్నియో గురుకులములు నెలకొల్పబడెను. వీధివీధులలో లోకజ్ఞాన మలవడుటకై పురాణ కాలక్షేపములు జరుగుచుండెను. పదుగురొకచోట గూడినపుడెల్ల—వారు ఏజాతివారైనను ధర్మవిషయ ప్రసంగము లొనర్చుచుండిరి.

అంతియేకాని చతుర్ముఖపారాయణములు (చీట్లపేక) అప్రస్తుతప్రసంగములు-అనవసర తర్కములు, అసద్గ్రంథ పఠనములు, అభూతకల్పనలు, మున్నగు కృత్యము లొనర్పరైరి. కొందరున్నను వారు సంఘమున హీనముగ జూడబడుచుండిరి. ఇంతయేల ? ఆకాలమున ప్రతిపనికిని అనగా నిద్రించుటకు, మేల్కొనుటకు, కూర్చుండుటకు, లేచుటకు, తినుటకు, నడచుటకు, కట్టుటకు, విడుచుటకుసైతము మతమే మార్గదర్శిగనుండెను. అందు నాలుగు భాగములు కలవు. ప్రతి భాగము దేశరక్షణమునకు ముఖ్యసాధనము.

—* త్యాగభాగము *—

ఇందు జేరినవారు బ్రాహ్మణులు. వీరు త్యాగైకశీలురై ఆధ్యాత్మిక రాజ్య సంరక్షణార్థ మత్యంత కుతూహలురై ధర్మప్రచార మొనర్చుచు పారమార్థిక సైనికులవలె నిరాడంబరవృత్తితో జీవింపుచుండిరి.

—♦ వీరభాగము. ♦—

ఈ భాగస్థులు క్షాత్రపుంగవులు. వీరు దేశసంరక్షణార్థము బద్ధకంకణులై ధర్మరాజ్యమును నెలకొల్పి దేవదేవుని యాజ్ఞల విశ్వసించి జనుల నేలుచుండిరి.

—♦ వాణిజ్య భాగము ♦—

ఇందు వైశ్యులుండిరి. వీరు ప్రజల సౌకర్యములకై యాలోచించి సమయాసమయములనక సర్వవస్తువుల విక్రయింపుచు తామార్జించిన ధనమంతయు ప్రజోపయోగార్థ మర్పింపుచుండిరి.

—* నిర్మాణ భాగము. *—

ఈ భాగమున శూద్రసత్తములుండిరి. వీరు పలువిధము లగు వృత్తుల స్వీకరించి వివిధపదార్థముల నిర్మించి దేశసేవా ధురంధరులై విలసిల్లిరి.

ఇటుల నాలుగువర్ణములవారు స్వధర్మనిరతులై భావి భారత సౌభాగ్యసౌధములకు బునాదులగుచుండిరి. అనగా ఏకులమున కాకులము స్వలాభమునకై యత్నింపక భారతీయు లెల్ల రొక్కటేయని భావించి భరతమాతను సేవింపుచుండిరి.

మఱియు నట్టి సద్బుద్ధిగలజాతి నుత్పత్తి జేయుటకు భార్యాభర్తలను జోడింపనెంచిరి. అందుకై సర్వోత్తమమగు పద్ధతిని గమనించిరి. దంపతులలో పరస్పరానుకూల్యము లేనిది సత్సంతానము కలుగదని నిశ్చయించి తగిన సాధనము లన్వేషింపమొదలిడిరి. అవి ప్రకృతిసిద్ధములై, ఈశ్వరప్రేరితములై యుండవలెనని యూహించిరి. బ్రహ్మాండగృహమున వసించు దంపతు లెవరని తర్కించి ఆకాశభూములను ఆదిమ దంపతులుగ స్థిరపఱచిరి. అందు భూమి–స్త్రీస్వరూపమనియు నాకసము పురుషుడనియు దెలిసికొనిరి. ఈ సనాతన దంపతుల కెటుల నైక్యమొదవెనో విమర్శించిరి. ఆ విధానము సూర్యచంద్రాదిగ్రహసంబంధమని యనుకొనిరి. గ్రహముల వలన భూమికెట్టి సంబంధముండెనో యీ క్రిందివిధముగ నూహించిరి.

ఆకసమున జ్యోతిశ్చక్ర మొకటికలదు. అనగా నక్షత్రములు, గ్రహములు, ఒక చక్రాకారముగనేర్పడి నిరంతరము

తిరుగుచు జీవులకు సుఖదుఃఖ హేతువులగుచున్నవి. ఇందు సంశయముగలదేని వినుము.

భూమిపై వర్షములు గురియుట, రాత్రింబవళ్లు వచ్చుట, పూర్ణిమ, అమావాస్య మున్నగు తిథులు సంభవించుట, ఇవి యన్నియు నాకసమందలి గ్రహసంబంధముననేకదా! జ్యోతిశ్చక్రమున పండ్రెండుభాగములుగలవు. ఒక్కొక్క భాగమందొక్కొక్కరీతిగ తిరుగుచు కొంతకాలమున కాప్రదేశమును విడచి క్రమముగ నాభాగములన్నిటిని దాటి తుదకు స్వస్థలమునకు జేరుటయే గ్రహములపని. ఇటుల ప్రపంచ ప్రళయమువఱకు గ్రహసంచారము కలుగుచుండును. అవి తిరుగునపుడు ఒకానొక సమయమున మొదటిభాగములో చంద్రుడు, రెండవభాగములో గురువు, మూడవభాగమున శని ఇటుల నవగ్రహము లాయారాసులలో (భాగములలో) నుండెనను కొనుము. ఇంతలో నొకజీవుడు భూమిపై జన్మించెను. ఆయా స్థలములందలి నవగ్రహములవలన భూమియందొకమార్పు గల్గి తన్మూలమున జీవునకు సుఖదుఃఖములు గల్గుచుండును. ఈవిషయమున కొందఱు సంశయింతురు. అది కేవల మవివేకము. ఆకసమున సూర్యుడుండ భూమిపై వేడి యతిశయించునుగదా? అపుడు జీవులకు దుఃఖము కలుగదేమి? చూడుము. పగలు పన్నెండుగంటలకు నడినెత్తిమీదికి చంద్రబింబము వచ్చెను. అదే సమయమున సరిగా దానిపై సూర్యుడుండెను.

అప్పుడు భూమికిని సూర్యునకు నడుమ చంద్రుడడ్డపడెననుట స్పష్టము. అందుచే సూర్య ప్రకాశము సహజ

తీక్ష్ణముగ భూమిపై బడదు. సూర్యకిరణములు చంద్రుని గుండా ప్రసరించుటయే యిందుకుగారణము. అపుడు భూమి సమశీతోష్ణముగ నుండును. సూర్యునకును భూమికిని నడుమ చంద్రుడు లేనియెడల భూమి వేడిగనుండెడిది. గ్రహముల నడకలు యీసమయములలో వేరుగ నున్నపుడు భూమి యందెన్నియో మార్పులు గల్గుచుండునని తెలిసినది. ఒకప్పుడు దేశము వేడిజెందుటకును చల్లబడుటకును సమశీతోష్ణముగ నుండుటకును హేతువు గ్రహసంచారభేదమేయనుట నిక్క ము. ఆభేదము భూమియందొకమార్పును కలిగించి శీతతాపాదులమూలమున జీవులకు సుఖదుఃఖము లొసం గును.

మిత్రమా! గ్రహమండలమువలన భూమండలము, దానివలన పిండాండము—మార్పుజెందునని మఱువరాదు. మఱియొక రహస్యముగలదు.

* భూమండలమువలె గ్రహమండలము సయితము జీవుల కాటపట్టని యెఱుంగుము. అందు వసించువారి దేహములు మనోమయములు. వారే దేవతలనబడుదురు. జీవుల మనోరాజ్యమునకు ప్రభువులై సుఖదుఃఖకారకులై సూక్ష్మ దేహములతో చరింపుచుందురు. ఈసిద్ధాంతము ననుసరించి

గ్రహములు ఏయేవస్తువులతో నెట్టి సంబంధమును గల్గియున్నవో రాబోవుగ్రంథములలో తెలుపబడును.

* నక్షత్రమండలములు అందలి దేవతలు, వారి యాహార విహార స్వభావములెవ్వియో తెలుపగల వేదశాస్త్ర పురాణ ప్రమాణములు రాబోవు గ్రంథాలలో చూడండి.

జాతకచక్రము నిర్మింపబడెను. దాని యుపయోగమును వినుము.

ఒకకాలమున నొకస్త్రీ జన్మించినదని తలపుము. అపుడాకసమున గ్రహములు తిరుగుచుండెను. సంచారభేదము ననుసరించి పైశిశువుయొక్క మనోభావములుండును. ఆ భావములకు తగినవానిని వెదకి భర్తగా నొనర్చుట యెంతయో మేలు. అయితే అతనిని గుర్తించుటకు మార్గమెద్ది? గ్రహబలమునుబట్టి తెలియవచ్చును. ఆమార్గమనుసరించి వారిరువురి తత్త్వమొక్కటిగనున్నచో వివాహమొనర్పనగును. గ్రహబలములు వేరుగ నుండెనేని వారిని జోడింపరాదు. తెలిసినదా జాతకచక్ర ప్రభావము.

అనార్యుడు:—

మహాశయా! జాతకతత్త్వమర్థమైనది. అది బాగుగ నున్నను సాధ్యమైనదిగలేదు. ప్రజలకు విద్యాబుద్ధులను నేర్పి సన్మార్గమున నడిపించుటకంటె దేశశాంతికి వేరొండుమార్గము లేదు. దీనినివిడచి జాతకములనియు, వివాహములనియు, మతధర్మమనియు, ప్రసంగించు టెందులకు?

ఆర్యుడు:

మిత్రమా! తొల్లి భారతీయులకు స్వరాజ్యముండెను. అపుడు క్షత్రియులు ప్రభువులై, బ్రాహ్మణు లుపదేశకులై, వైశ్యులువాణిజ్యనిరతులై శూద్రులు నిర్మాణకర్తలైయుండిరి. ఈ విధముగ ప్రతిజాతి దేశసౌభాగ్యమునకు హేతువగుచుండెను. అది యెటులనో వినుము. ఒకజాతి వేరొకజాతిని జీవనార్థ మపేక్షింపవలసియుండెను. అందువలన ప్రతి

వ్యక్తియు వేరొకజాతిని ప్రేమించినగాని జీవనము జరుగ నేరదు.

ఎపుడితరులతో పనియుండెనో అపుడు భయభక్తు లేర్పడెను. పరశ్రేయమునుగోరినగాని స్వాభివృద్ధి కలుగ దయ్యెను. ఇటుల హైందవులలోని సమస్తజాతులు స్నేహ భావమున వర్తించెను. అందు బ్రాహ్మణుని త్యాగము మహోపకార మొనర్చెను. నిజముగ నతడు దేహమాతకు బలి హారణమయ్యెను. హిందూమతము సర్వోత్తమంబని నుడువు టకు సాహసింతువేని యాకీర్తి యెవరిది? బ్రాహ్మణులదే.

"బ్రాహ్మణస్య ధనంభిక్షమ్"

అను న్యాయము ననుసరించి యతడు భిక్షాటనము వృత్తిగా గ్రహించెను. సర్వసామర్థ్యము కల్గియుండియు దేశ సౌభాగ్యముకై స్వాతంత్ర్యమును త్యజించెను. తలచెనేని ప్రభువు కాదగిన శక్తిగలదు. అయినను భోగముల నాశింపక కడుబీదయై వర్తించి అంటియంటనివాడైయుండి ఇతరులకు ధనార్జన పద్ధతుల జూపెను. అది యెటులనో వినుము.

(1) కొంత ధనమొసంగినగాని యా వృత్తి జేయజాల నని రాజకీయోద్యోగి పలుకును.

(2) ధనము గైకొనినగాని యొకవర్తకుడు వస్తువుల విక్రయింపడు.

(3) గోడుగో, గుడ్డయో, బండియో, విమానమో నిర్మించిన బుద్ధిమంతుడు వెలను నిర్ణయించి ధనము గైకొనును.

ఇటుల ధనసంపాదనార్థము వృత్తులన్నియు సర్వ స్వాతంత్ర్య మొసంగుచున్నవి. "దయాధర్మభిక్షము" అను

సామెత నెఱుంగవా ? ఎవ్వరైనను దయదలచి ఏదియో కొంత భిక్షను ధర్మరూపముగ నొసంగిననేగాని యీ బ్రాహ్మణుడు జీవింపజాలడు. వృత్తులన్నిటిలో నిది బ్రతికియున్న వారిని సైతము సగము చచ్చినవారినిగ జేయునని యెల్లరెఱింగినదే. బాహ్యమున కెంత గౌరవింపబడుచున్నను బ్రాహ్మణుడు లోలోపల తన కోర్కెల దీర్చుకొనుటకై యెటుల పరితపించునో దేవున కెఱుక. ఏమన నతడొక కర్మను జేయించెననుకొనుము. ఇంతధన మొసంగినగాని నెరవేర్పనని పలుకరాదు. ఒకవేళ వెల్లడించెనేని యది హోమపాతకమని శాస్త్రము ఘోషించుచున్నది. అహో! బ్రాహ్మణవృత్తి కడుంగడు దుర్భరము.

ఏనాడు బ్రాహ్మణుడు ప్రపంచభోగముల కాశపడి రాజకీయోద్యోగముల నపేక్షించునో, వ్యాపారమునదిగునో వ్యవసాయమున జిక్కునో, వివిధవృత్తుల స్వీకరించునో, ఆనాడే నిలువ నీడలేక కష్టములపాలగును.

ఒకకాలమున కులవృత్తిచే జీవనము జరుగనపుడు బ్రాహ్మణు డితరవృత్తుల స్వీకరింపవచ్చునని కలదు. కాని స్వధర్మములగు సంధ్యావందనాది కర్మల విడువరాదు. వానికేర్పడిన కాలమునగాక తదితర సమయమున నా వృత్తుల జేసికొనిన దోషములేదు. అటులొనర్పక ధనాశాలోలుడై వర్తించెనేని శాస్త్రమతనిని నిందించును.

ఇతరజాతులవలె సుఖమనుభవించుట కతడు జనింపలేదు. జైలునందుంచబడినటుల కర్మకాండల నొనర్చుచు తన్మయుడై యుండవలెను. కాలమును రెండుగ విభజించి

అందొక భాగము దైవధ్యానమునను, రెండవభాగము ధర్మ ప్రచారమందును, వినియోగింపవలెను. ఇతరులవలె వేళకు భుజించుటకైన వీలులేదు.

మతసంబంధమగు కర్మకాండవిశేషముగ నుపవాసములతో గూడియుండును. అందుచే వివాహాది కార్యముల చేయించు బ్రాహ్మణునకు సకాలభోజనముండదు. వత్సరమునకు మూడుపాళ్లు అకాలభోజనములతోడను, ఉపవాసములమునను కాలము గడపుచుండును. వైదికకర్మల జేయించునపుడు దానములంబట్టి దాతల పాపములసైతము శిరమున నిడికొనకతప్పదు. మరల నా పాపరాసుల భస్మమొనర్ప దలచి లక్షలకొలది జపము గావింపుచు తన్మూలమున సకాల భోజనములు లేక తపింపవలసియుండును. అపుడపుడు కృచ్ఛ్ర చాంద్రాయణాది కఠిన వ్రతములు సలుపవలెను. పేదఱికము ననుభవించుటకు సంసిద్ధతను జూపవలెను. ధర్మబోధకై జనించితినని తలచి దేశసేవ గావింపుచుండవలెను. అక్రమపాలన మొనర్చిన రాజపాపమును సయితము బ్రాహ్మణు డనుభవింప సమకట్టెను. కావున నిరంతరము ప్రజల మంచిచెడ్డల గమనించి రాజులకు తగినసలహా నొసంగుచుండును. బ్రాహ్మణోపదేశముల వినక రాజులు పాపమొనర్తురేని, దానితో బ్రాహ్మణునకు పనిలేదు. అతనిసలహా గైకొనక పాలింపబడు దేశము శాంతియుతమైయుండదు. ఉండినను బహుకాలము నిలువజాలదు. ఇందుకు కారణమతని త్యాగ ధర్మమే.

# గృహరాజ్యము.

ఏనాడు ప్రభువులకును బ్రాహ్మణులకును పరస్పర ప్రేమభావములుండునో ఆనాడే దేశసౌభాగ్యమబ్బును. ఇంత కంటె జగత్కల్యాణమునకు వేరొండుమార్గము లేదు. ఈ రహస్యమెఱుంగక నెన్నియుద్యమములు లేవనెత్తినను అవి యన్నియు బుడగలవలె స్వల్పకాలమున మాయమగును. నిజముగ దేశశాంతికి బ్రాహ్మణత్వము ముఖ్యసాధనము. ఎందుకన! అది స్వార్థరహితమైయున్నది. అందు వైరాగ్యము మెండు. విషయేచ్ఛకు తావులేదు. దైవభక్తి, దేశోపకారము, ఈరెంటిని మూలసూత్రముగ నిముడ్చుకొనెను. ఈ తత్త్వము కేవలము వ్యక్తిగతమైయుండక వంశపారంపర్యముగ సయితము పాదుకొనెను. ఇది కడుంగడు శ్లాఘ్యము. విదేశములకును భారతభూమికినిగల విలక్షణమిదియే. ఈకట్టుబాట్లు లక్షలకొలది వత్సరములు గడచినగాని చెడుట కవకాశ ముండదు. ఇట్టి పద్ధతిని కనిపెట్టుటకు మానవునకు శక్తి లేదు. అయితే పైసూత్రము ఈశ్వర నిర్మితమై భారతభూమిలో ప్రతిష్ఠింపబడెను.

శాంతి స్థాపనముకై భారతీయ ధర్మమెటులవ్యాపించెనో వింటివిగదా? విద్యావ్యాపకము, జ్ఞానబోధ, రాజ్యపాలనము, ఇవి శాంతిసాధనములని పలువురు తలంతురు. అందు కొంతనిజమున్నను పూర్తిగ నంగీకరింపరాదు.

ఏమన! శాంతి మనస్సంబంధమైనది. ఎంత బోధించినను పుట్టుకలోలేనిగుణము నడుమరానేరదు. విత్తనము ననుసరించి ఫలముండును. మంచి విత్తనముగాక సామాన్య బీజముల భూమియందుంచి యెరువువేసి నీరుపోసినయెడల కోరి

నంతగ ఫలించునా? పుట్టుకలోనే సత్స్వభావము గల మన స్సుండెనేని దానికి శిక్షణము తోడ్పడగలదు. అటుగాక చెడ్డమనస్సున కెన్ని చేసినను నిరర్థకము లే. దేశాభివృద్ధి నపే క్షించువారు మొదట మంచిమనస్సుగల జనుల బుట్టించుట కంటె వేరెండు మార్గము లేదు. పిమ్మట విద్యాబుద్ధుల నేర్ప నగును. ఈ రెండు మార్గములు లేని దేశ మెన్నడును బాగు పడదు. అది యెటులనో వినుము.

ఒకరికి గణితమున, వేరొకనికి భాషలో, ఇంకొకరికి యుక్తులందు తెలివియుండుటకు హేతువేమి? కర్మానుసార మటుల గల్గెనని జెప్పుదుము. వెంటనే యాకర్మము ఎప్పటి దని ప్రశ్నింతుము. పూర్వకర్మమని ప్రత్యుత్తరము వచ్చును. పూర్వమనగా నెప్పుడని సంశయముగల్గును.

I కొందరు పూర్వజన్మమందలి కర్మమనియు,

II పుట్టుటకు పూర్వము గర్భమందు తలిదండ్రులొన ర్చిన కర్మమని మరి కొందఱును

III ఫలమనుభవించిటకు పూర్వ మీజన్మమున జేయ బడిన కర్మమని వేరొకరు జెప్పుచుందురు. వాస్తవమున నింవొక్కొక్కటి యెన్నటికి కారణము కాదు.

I పూర్వజన్మము.

II మాతృగర్భము.

III ప్రస్తుత కృషి (స్వీయకర్మము)

ఈమూడుకలిసి యొకఫలమునకు కారణంబగును. ఏమన నొక కార్యమున కొక్కటేకారణముండుట లోకమున

గానము. రెండుమూడు కారణములు కలిసి యొక కార్యమగును.

(1) ఒకని మంచిచెడ్డలకు హేతువు పూర్వజన్మ కర్మమని గాని,

(2) మాతృగర్భమందున్నపుడు తల్లి యొనర్చిన కర్మమని గాని,

(3) జన్మించినపిమ్మట నతడొనర్చిన కర్మమనిగాని,

ప్రత్యేకముగ జెప్పక పై మూడును గలసి సుఖదుఃఖము లొసంగునని వచింపవలెను. దీనిని బాగుగ తెలిసికొందము. ఇపుడు మూడు కారణములు వివరింపబడినవి. అందు మొదటిది పూర్వజన్మ సంబంధము. దానినిగురించి యీ జన్మమున జేయదగిన పని యెంతమాత్రము లేనందున తర్కించి ప్రయోజనము లేదు.

ఇక రెండవ కారణమును గూర్చి మాట్లాడుదము. దీనికి పూర్వజన్మకర్మము బీజమగుచున్నది. ఆ బీజము ఏదో యొక ప్రదేశమున (అనగా తల్లిదండ్రుల గర్భమున) జీవుని జన్మింపజేయుచున్నది. మొదట తండ్రియందు మూడునెలలుంచి పిమ్మట తల్లిగర్భమున జేర్చును. జీవుడు పరలోకమును విడచి భూమిపై నవతరించుట కివ్విధముగ తల్లిదండ్రుల నాశ్రయించెను. గర్భస్థుడైయుండుటచే, నేపనియు జేయజాలడు. అయితే తల్లిదండ్రుల సంకల్పములే యతని సంకల్పములు. వారి యాహారవిహారములే యతని భోజనాది కృత్యములు. జన్మించినపిమ్మట రెక్కలు వచ్చువఱకు తల్లిదండ్రుల కృత్యములే యతని సుఖదుఃఖములకు హేతువులు.

వారి సంకల్పములుగాని కర్మములుగాని యెంతశుద్ధములైన నంత మేలు. అతని క్షేమమునకు గారణము పూర్వజన్మ కర్మమైయున్నను, ఈ జన్మమున తల్లిదండ్రుల కర్మములు సైతము సహాయపడునని తెలిసికొంటిమి. అయితే ఈ రహస్య ము సామాన్యులెరుగరు.

దృష్టాంతపూర్వకముగ నీవిషయమును వినుము.

ఆకసమునుండి సూర్యునివలన బయలుదేరిన వేడిమి యొకవిధమైన పరిమితిని కలిగియుండె ననుకొనుము. దానివలన జీవుల కంతగ బాధలేకుండెను. అయినను ఒకడా వేడిమిని సహింపలేక యిల్లు కట్టుకొనెను. మఱియొకడు వేఱొక గృహమును నిర్మించుకొనెను. మొదటివానిది రేకుల యిల్లు. రెండవవానిది పూరిల్లు. వారిద్దఱికి సూర్యుడొక్కడే. అయినను మొదటివాని యింట్లో వేడి యధికమయ్యెను. రెండవవాని గృహము చల్లగనుండెను. సూర్యతాప మొక్క టిగ నున్నను గృహభేదములబట్టి శీతోష్ణములు భిన్నము లయ్యెను. వేడికల్గుటకు ప్రథమకారణము సూర్యుడు. ఆ వేడి యతిశయించుటకుగాని తగ్గుటకుగాని గృహము రెండవ కారణము. ఆ యిల్లు రేకులతో మూయబడుటచే సూర్య తాపమును వృద్ధి జేసెను. అందువలన నా గృహస్థు తపించుచుండెను. దీనికితోడు ఆరోగ్యశాస్త్రమెఱుగనందున ఆహారవిహార విధానములలో నేర్పరిగాక తోచినటులెల్ల సంచరించుచుండెను. అనగా ఇత్తడి పాత్రలో వంటజేయిం చి ఫ్యాక్టరీ (గిన్ని) బియ్యముపయోగించి విశేషముగ నూనెపదార్థముల దినుచుండెను. వృత్తియందును విశ్రాంతి

లేదు. అందువలన రేకులవల్ల వచ్చిన వేడియింకను వృద్ధియై జీవుని బాధించుచుండెను. ఈకష్టములకు కారణములెవ్వియో తెలిసికొనుము.

(1) మొదటి కారణము సూర్యుడు.
(2) రెండవది రేకులయిల్లు.
(3) మూడవది స్వకీయకర్మము.

ఇటుల నొకదాని కొకటి తోడై దుఃఖమును కలుగ జేసెను. మొదటి కారణము మాఱి సూర్యునకు బదులు చంద్రుడుండెనేని మిగిలిన రెండుకారణములవలన నతనికి బాధకలుగనేరదు. దీనింబట్టి పై మూడు హేతువులుగలసిననే గాని సుఖమో దుఃఖమో కలుగదని తెలియుచున్నది.

ఒకడీ రహస్య మెఱుంగక ఉష్ణబాధను తొలగించు కొనుటకై దంపుడుబియ్యమునుదెచ్చి కుండతో వండి నూనెకు బదులు నేతిని వాడుచుండెను. అటులొనర్చినను దేహ తాపము తీఱలేదు. అందుచే నొకవైద్యుని జేరి యీ బాధను తొలగింపుమని కోరెను. అతడాహారమునకుతోడుగ రేకులను తీసి గడ్డిని కప్పుమనెను. అటులజేయగా నుష్ణబాధ తొల గెను. మొదటికారణమును మార్చుట కెవ్వరికిని శక్తి లేదు. దుఃఖము పోయి సుఖము కల్గుటకై మిగిలిన రెండుకారణము లను మార్చుకొనవలెను. ఇది మన చేతిలోనిపని. కావున నీరెండే దేశశాంతికి ముఖ్యకారణములు. అందొకటి లోపించి నను సుఖము కలుగజాలదు.

సూర్యుని మార్చుట కెటుల వీలులేదో అటుల పూర్వజన్మకర్మమును తొలగించుట సాధ్యపడదు. వైద్యుల సలహాననుసరించి రేకులను తీసి పూరింటిని నిర్మింపలేదా? అటుల ధర్మశాస్త్రానుసారము గర్భమందున్న శిశువిషయమై సత్కర్మముల జేయుడని తల్లిదండ్రులకు బోధింపవలెను.

ఈ విషయమున శ్రద్ధ బూనక దేశాభివృద్ధికై యెన్ని పనులొనర్చినను అన్నియు నిరర్థకములనుట నిశ్చయము. వైద్యశాస్త్రమును - ధిక్కరించి రేకులింటిని దీయక ఆహారాది కార్యములం దెంత నేర్పరియై నటించినను సుఖము కలుగునా? అట్లే ధర్మశాస్త్రమును తిరస్కరించి బాహ్యదృష్టికి గోచరించు దేశోద్ధరణ కార్యము లొనర్చినను శాంతిచేకూరదు.

ఎవరు దేశాభివృద్ధి నభిలషింతురో వారు కేవలము స్థూలదృష్టికి గనపడు సాధనముల గైకొని యుద్యమముల సాగింపుచున్నారు. ప్రజాక్షేమమునకై చేయదగిన పనులలో మొదటిది మాతృకృతకర్మమనియు, రెండవది స్వయంకృతకర్మమనియు నిదివరకే తెలిసికొంటిమి. ఇక్కాలపు దేశాభిమానుల సాధనములు రెండవదానిలో జేరుచున్నవి. మొదటిదానినివిడచి రెండవదానిని నెరవేర్చుట వివేకము కాదు. దానివలన కార్యసాఫల్యము గలుగదు. సూక్ష్మబుద్ధిగలవారు మొదటిరకములో జేరి దేశాభివృద్ధి యొనర్తురు. ఇది సర్వోత్తమంబగు మార్గము. దీనిని బట్టి విచారింతుమేని గర్భస్థుడైన జీవుని రక్షించుటయే ముఖ్య కర్తవ్యమని తెలియగలదు. కాన మొదటిమార్గమునే

సక్రమముగ నడిపింతుమేని రెండవది సులభమగును. ఈ విషయమును లోకానుభవమున జూడుము.

పదిమందిని బలాఢ్యులుగ జేయదలచి వ్యాయామ శాలను ( తా లిం ఖా నా ) స్థాపించి వారందరికి క్రమ శిక్షణ మొసంగితిమి. తుదకొక్కరో, యిద్దరో కలియుగ భీములైరి. ఇతరులు కేవలమారోగ్యమునుపొందిరి. ప్రయత్నములొక్కటిగనున్నను ఫలములు వేరైనవి. కారణము తెలియునా ? పుట్టుకలో లోపముండెను. అనగా మొదటి నుండి వారియెముకలో గట్టితనము లేదు. అందుచే నెంతశ్రమ పడినను బలము కలుగలేదు.

పుట్టుటకు పూర్వము వారితల్లిదండ్రులు ఆరోగ్యపద్ధతుల గమనించి రసవంతములగు పదార్థముల సేవించియుందురేని, యీజన్మమందొనర్చిన వ్యాయామము అభినవభీములనుగ జేసియుండెడిది.

అటుల జరుగనందున వారికృషి వ్యర్థమయ్యెను. సారాంశమునుజూడ దేశాభివృద్ధికై జేయదగిన పని మాత్ర గర్భసంరక్షణమని స్పష్టమగుచున్నది. ఆసంరక్షణ విధానమునకు మార్గముల దెలిసికొందము.

1. తల్లికి గర్భమగుటకు హేతువు తండ్రి కదా! కావున, ఏవయస్సుగల పురుషుడు ఏయీడుగలస్త్రీని ఏ నియమములకులోబడి పెండ్లాడవలెనో

2. వారిరువురు ఏయేయాహారముల భుజింపవలెనో,

3. ఎట్టిసమయమున కలియవలెనో,

4. గర్భమైనపిమ్మట ప్రసవించువఱకు స్త్రీల నియమములెవ్వియో,

5. శిశువుపుట్టినపిదప ఱెక్కలువచ్చువరకెటుల పోషింపబడవలెనో,

ఇవియన్నియు తల్లిగర్భమును రక్షించుటకు ముఖ్యసాధనములైయున్నవి. వయస్సువచ్చినపిమ్మట ధర్మోపదేశము లొనర్చి బాగుచేయుటకంటె,

1. పితృవీర్యమున జేరుటకుపూర్వము తండ్రులను,

2. తల్లిగర్భమున కేగుటకుపూర్వము తల్లులను,

3. యౌవనము పొందుటకుపూర్వము బాల్యమును- సంస్కరించుట యెంత తెలివియో గమనింపుము. పైమాటిలో సవ్వలెఱింగిన బాల్యదశను గుఱించి స్వానుభవమున జూతము.

జన్మించినది మొదలు పసితనమున చాలినన్ని పాలు- తగినంత చమురు-బిందెలకొలది నీరు-ప్రతినిత్యము శిశువున- కుపయోగింపవలెను. రెండుమూడేండ్లుగడచిన పిమ్మట వలసినంత నెయ్యి పాలు అన్నము మున్నగు రసవంతములగు పదార్థములచే పోషింపవలెను.

వెలుతురు, గాలి, ఎండ మొదలగునవి కలుగునట్లు చూడవలెను. మఱియు సదాచారమును నేర్పవలెను. పై పనులలో నెయ్యవిలోపించినను వయస్సుమీఱిన కొలది మనుజుడు రోగగ్రస్తుడై దుఃఖములపాలగును. యౌవనమందలి సుఖమునకు బాల్యమెటుల కారణమైనదో తెలిసినదిగదా? ఇంతటితో ముగియులేదు. ఈ దశకుపూర్వము

తలిదండ్రుల యాహారవిహారములుకూడా యోగ్యములైయుండవలెను. ఈసంస్కారమున లోపముగలైనేని బాల్యదశ చెడును. తన్మూలమున యౌవనము భంగమై జీవితము వ్యర్థమగును.

"చెట్టై యొంగనిది మ్రానై యొంగునా? పుట్టుకతో బుట్టినబుద్ధులు పుడకలతోఁగానిపోవు. ఎముక ముదిరినచో, నెవరినైనను మెప్పింపలేము. చెట్లపాదును గట్టిచేయక వృక్షముల పెంచజాలము. మంచిమట్టిని సేకరింపని కుమ్మరి గట్టికుండలను చేయగలడా? కాకిబంగారముతో సొమ్ములు చేయుటెట్లు?

ఆలోచింపగ మనకు తెలియనిదిలేదు. స్వవిద్య, స్వవేషము, స్వబుద్ధి, లేకున్నను పరవిద్య, పరవేషము, పరబుద్ధి, కల్గి పగటివేషధారులవలె సర్వజ్ఞుల మనుకొనుచున్నాము. దేశచరిత్రము, భూగోళము గణితము సైన్సు, తెలియకున్నను తెలిసినట్లే నటించుచుందుము. మనదశ యిట్లైనది. నివాసమా! భారతదేశమున, పుట్టినదా! ఋషిగోత్రమున, లేక సూర్యచంద్రులవంశమున, లేక మరుద్గణమున, లేక సత్కులమున. ఏలినదా! సప్తద్వీపయగు వసుంధర. పొందినదా! చక్రవర్తి బిరుదము. ఎక్కినదా హిమాలయ శిఖరోపరిభాగము. వెలిగించినదా! జ్ఞానజ్యోతి. ఇచ్చినదా! అభయహస్తము. ఇట్లెన్నిలేవు.

"అంగడిలోనన్నియున్నవి. అల్లునినోటిలో శనియున్నది" అను సామెత సార్థకమగుచున్నది. దౌర్భాగ్యదేవత భారతీయ హృదయసీమల విహరించుచున్నది.

కామదేవత బ్రహ్మచర్యమును భంగమొనర్చుచున్నది. మాయముసింప జ్ఞానజ్యోతికి ప్రకాశమెక్కడిది ? కొమ్ములు తిరిగిన యోధానయోధులు సైతము సత్యమార్గమును గమనింపక నిరంతర భ్రమణమునకు గుఱియగుచున్నారు. దేశాభివృద్ధికి ప్రథమకారణమగు మాతృగర్భరక్షణ విధానమును గమనింతురేని యెంతయోమంచిది. అందుకై వివిధయత్నము లొనర్పవలెను. అయ్యవి సత్సంతానమునకు కారణములగును. ఈ మార్గమును బోధించు మహావిద్యామెచ్చటగలదో అచ్చట జన్మసాఫల్యమగును.

మహోన్నతమై సర్వసమ్మతమై, యమూల్యమై, యప్రతిహతమై యొప్పునాయుద్యమమే వివాహ సంస్కారమనబడును. జాతినిపుట్టించునదియు నీసంస్కారమే. మాతృగర్భ సంరక్షణము, ఇందే యిమిడియున్నది. కాబట్టి సర్వశక్తు లుపయోగించి దేశోద్ధారకంబగు సత్సంతినిగనుటకై వివాహధర్మమును స్థాపింపవలెను. ఆ ధర్మమును తెలియుటెట్లు? నీవుహిందువుడవేని హిందుమతమే నీకు శరణ్యము. అదిమానవ నిర్మితముకాదు. దైవకృతము. వేదమూలమున నామతము జగత్కర్తచే బోధింపబడెను. దైవప్రేరితమై వేదసమ్మతమై యొప్పుమతమునువిడచి వివాహమొనర్ప మానవునకు తగదు. ఇది మొదలు వివాహమునకు మతముతో సంబంధమేమియని యవివేకియై పలుకకుము. మతముపోయిన మతిపోవును. అంత పతనము సంభవించును. అధోగతిని కోరుట భావ్యమా ? అధునాతన ప్రసంగములు మానుము. సనాతన మతస్థుడవై సనాతనుండవగుము.

అనార్యుడు:

అయ్యా! వివాహము భూలోక సుఖమునకై యేర్పడిన ఒక తంత్రము. అది స్త్రీపురుషు లిరువురికే జరుగుచుండును. మనుజులేకాదు. పశువులుసయితము ఆడది, మగదికలసి యిట్టిసుఖ మనుభవించును. ఈయనుభవము సమస్త జీవ రాశికి సహజము. ఇట్లుండగా దీనిని మతసంబంధముగ నిర్ణయించుటెందుకో తెలియకున్నది. కామ వ్యాపారము మత సంబంధమైనయెడల పశ్వాదులకుగూడ మతముగలదని జెప్పవలెను. ఎందుకన అవియు కామసుఖ మనుభవింపుచున్నవి. అయితే పశువులకు మతములేదు. ఈవిషయ మెల్లరెఱింగినదే. కావున కామసుఖమునకై యేర్పడిన తంత్రము మత సంబంధమగుటతగదు. ఈవిషయమున మీప్రత్యుత్తరమేమి?

ఆర్యుడు:—

మిత్రమా! నీకు మతమన నెద్దియో తెలిసినటుల లేదు. దానిని కేవలము దైవసంబంధమని తలచుచున్నావు. మతమును బోధించిన గ్రంథమెద్దియో నీకు తెలియునా? హిందుమతమునకు వేదము మూలగ్రంథము. నీవనుకొన్నటుల దీనిలో దైవసంబంధ మొక్కటియే యుండవలెను. కాని యటులలేదు. స్త్రీధర్మములు, పురుషధర్మములు, జాతి ధర్మములు, రాజధర్మములు, భృత్యధర్మములు, సత్సంతాన పద్ధతులు, ఆహార విషయములు, ఆరోగ్య విధులు, ఆయుర్వృద్ధి సాధనములు, మున్నగు ప్రాపంచిక విషయము లెన్నియో వివరింపబడియున్నవి.

వేదము కేవలము దైవసంబంధమే యైనయెడల స్త్రీపురుష ధర్మములు, రాజధర్మములు మొదలైనవి అందుండవలసిన పనియేమి?

ఉదాహరణముకై ఈక్రింది మంత్రముల జూడుము.

"ఆనోవీరో జాయతాం" (వేదము)

మాకు వీరపురుషుడు జనించుగాక.

"సజాయతాం వీరతమస్స్వానామ్" (వేదము)

మాకు కలిగినబిడ్డ సంఘములో వీరాగ్రేసరుడై యుండుగాక.

"ఆ తేగర్భో యోనిమేతు పుమాన్ బాణఇవేషుధిమ్" (వేదము)

నా పుత్రుడు అంబులపొదిలోని బాణమువలె నుండుగాక.

"ధనంధాన్యం బహుపుత్రలాభం శతసంవత్సరం దీర్ఘమాయుః" (వేదము)

ధనధాన్యములు, సంతానాభివృద్ధి, దీర్ఘాయుష్యము, మాకు లభించుగాక.

"సప్రథసభాంమేగోపాయ యేచసభ్యాస్సభాసదః తానింద్రియావతఃకురు." (వేదము)

నేను సభాపతినై యుందునుగాక. ఆసభలోని సభ్యులెల్లరు ఇంద్రియపుష్టికలవారై యుందురుగాక.

"శర్గస్య పశూన్ మే గోపాయ
ద్విపాదోయే చతుష్పదః
యేచైకశఫా అశుగాః. (వేదము)

నాకు అనేక గోవులు, గుఱ్ఱములు మొదలగునవి కలుగుగాక. అని యిహలోక సంపదను వేదమెటుల బోధించినదో తెలిసినదా? మఱియు దంపతులగూర్చి వేద సంబంధమును వినుము.

"ప్రజాతంతుం మావ్యవత్సేత్సీః" (ఉపనిషత్)

ఓయీ నీవు స్వర్గసుఖ మపేక్షింతువేని యొంటరిగ నుండకుము. ఒక స్త్రీని తోడుజేసికొని ఆమెయందు సంతతినిగనుము. బిడ్డలు లేనివాడవై యుండకుము.

"ఆరభేథామనుసగ్ంరభేథాం + జాయాపతీసగ్ం
రభేథాం" (వేదము)

ఓ దంపతులారా! మీరిరువురుగలసియే కర్మ లొనర్పుడు. వేరుగ నొక్కపనియైనను జేయకుడు. అపుడే మీకు స్వర్గము లభించును.

"అయజ్ఞోవా ఏషోఽపత్నీకః"

ఓ మనుజుడా! యజ్ఞమొనర్పుము. భార్య లేనియెడల నీకు యజ్ఞమొనర్చుట కధికారము లేదు. ఒక యజ్ఞమే కాదు. ఏవ్రితమైనను ఆమె లేకుండ చేయకుము.

"పరీక్ష్యలోకాన్ కర్మచితాన్ + నగురుమేవాభిగచ్ఛేత్"
(వేదము)

భార్యాసహితుడవై వేదకర్మ లన్నిటిని పూర్తిగావించి తుదకు వైరాగ్యమును బొందుము. అంతవఱకు భార్యను విడువకుము. సర్వవిషయములు తుచ్ఛములని యేనాడు గ్రహింతువో ఆదినమే భార్యనువిడిచి సన్యసింపుము. అని వేదము బోధింపుచున్నది.

ప్రపంచసంబంధ మున్నంతవరకు గృహస్థులై జగ త్సౌఖ్యముల ననుభవింపుమని వేదమెటుల బోధించెనో స్పష్ట మయ్యెనుకదా! స్త్రీ పురుషు లెటుల నడువవలెనో దానిని మాత్రమే వేదము తెలుపలేదు. పెండ్లి చేసికొను విధాన మునుసైతము వివరించెను. ఆమంత్రముల జూడుము.

"గృభ్ణామి తే సుప్రజాస్త్వాయహస్తం"

(వివాహ మంత్రము)

ఓ భార్యా! సత్సంతానముకొఱకు నీ చేతిని పట్టు కొనుచున్నాను. అనగా పెండ్లాడుచున్నాను. ప్రాణములను విడుచువరకు నిన్ను వదలను. అని వేదము, పురుషునిచే బలికించుచున్నది.

దీనింబట్టి వేదమునకు వివాహముతో నిమిత్తము లేదని తెలుపగలమా? మంత్రములు లేకుండ పెండ్లియే లేదు. ఇక మంత్రములకును పెండ్లిండ్లకును సంబంధములేద ని చెప్పుటెట్లు? ఆలోచింపగ మంత్రములు మతసంబంధ ములనుట నిస్సంశయము. నిజముగా స్త్రీపురుషులకు పెండ్లి చేయునది మతమేసుమా!

ఏ పురోహితుడో, ఏ వేదమంత్రములో, ఏ పౌరాణిక శ్లోకములో, లేని వివాహ మెచ్చటనైన కలదా? ఒకవేళ నున్నచో నది వివాహమనబడదు. ఎందుకన మంత్రములు లేకుండ ఆడపశువు, మగపశువు కలియుచున్నది. మంత్రము లతో పనిలేక కేవలము స్త్రీపురుషులుకూడ కలిసినయెడలఅది యును పశుధర్మమేకదా? కావున ఎన్నటికినిదానిని వివాహమన

రాదు. కామము గల్గినపు డొకమగపశువు ఆడపశువుతో జేరుచున్నది. అంతకు పూర్వము ఆ రెంటికిని వివాహమనునది యుండదు. ఏదోయొక దినమున కామసుఖమనుభవించును. అంత సంతతిగలుగును. రెండవమారు మఱియొక బిడ్డను గన వలెనన్న ఆ యాడపశువు మొదటిపశువుతోడనే కలియవలె నను నియమము లేదు. వేఱొక మగదానిని జూచుకొనును. బిడ్డబిడ్డకు క్రొత్తమగడే యన్నట్లున్నది ఈ కథ. సంఘాభి వృద్ధికై పశుజాతిలో నిటుల జరుగుచుండును. ఈ యభివృద్ధి విషయమున ప్రత్యేక నియమము లెవ్వియునుండవు. కావున వావివరుసలును లేవు. చూచితివా! పశుధర్మము. పశువులకును మనుజులకును కామము సమానమా లేక హెచ్చుతగ్గులా? యని విమర్శింతము. ఆ విషయమున భేదమెంతయోగలదు. పశువుల కామము సంవత్సరమునకో, ఆరునెలలకో, మూడు మాసములకో నియతమై ఒక్కసారి వ్యక్తమగును. అంతట మగపశువు ఆడపశువు కలియును. వెంటనే గర్భమేర్పడును. అది గర్భిణిగ నున్న దినములలో నొక్కసారియైనను మగ పశువుతో కలియదు. మొత్తముమీద పశుస్వభావ మిట్లే యున్నది. ఈ నియమమును మానవులు విన్నపుడు ఆశ్చర్య మొందుదురు. ఎందుకన ఎన్నిజన్మములు తపమొనర్చినను కామవిషయమున నియమబద్ధులై యుండలేరు. ఈ దురవస్థకు గారణము వారు చేతులార చేసికొన్న నేరమైయున్నది. అదియెటులనో వినుము. సృష్టిప్రారంభమున స్త్రీలకుగాని పురుషులకుగాని యింతటి కామప్రవృత్తి లేదు. ఆకాలమున స్త్రీలు తమ జీవితములో నొక్కసారియే పురుషుని పొంది

గర్భవతులై బిడ్డల గనుచుండిరి. కొంతకాలమున కది సరి కాదని నిశ్చయించి * స్త్రీలెల్లరు తమకు కావలసినపుడెల్ల పురుషసంబంధము గల్గునట్లు వరమిమ్మని ఇంద్రుని ప్రార్థించిరి.

ఆ వరమువలన స్త్రీలకంతగ నష్టము కలుగకుండెను. అయితే స్త్రీలతో కలసిన పురుషులు దేహబలమును, మనో బలమును పోగొట్టుకొని రోగములపాలై ఆయుర్హీనులగు చుండిరి. ఈ కామము పురుషుల పాలిటికి మృత్యుదేవతయై వెలయుచున్నది. స్త్రీలు పురుషులకు జేసిన మహాపకార మిదియే. పైకథ కల్పితమనియు హిందూమతమందలి లోపము లివియేయనియు కొందఱనవచ్చును.

క్రీస్తు మతములో సైతము ఇదేగతిపట్టినది చూడుము.

దేవుడు "ఆదాము" అను పురుషుని పుట్టించి అతడు నిద్రింపుచుండ అతని ప్రక్కటెముకనుండి యొక స్త్రీని సృజించెను. వారిరువురిని భార్యాభర్తలుగ నొనర్చి ఒక చెట్టును జూపి దాని పండును తినరాదని హెచ్చరించి వెళ్లెను. "సైతాను" అను మాయాదేవి ఆదంపతుల కడకేగి ఆ పండును తినుడని ప్రోత్సహించెను. ఎంతజెప్పినను "ఆదాము" వినలేదు. అతని భార్యయగు "హావ్వ" దేవుని వాక్యము కంటె సైతాను వచనము మంచిదని తలచి తనభర్తను బల వంతపెట్టి దేవుడు నిషేధించిన పండును తినిపించెను. తాను కూడ తినెను. ఆ సంగతి దేవుడెఱింగి,

* ఈవిషయమై రాబోవుగ్రంథములలో వేదశాస్త్రములనుండి ప్రమాణము లొసగబడును.

"మీరిరువురు నాయాజ్ఞల దిరస్కరించితిరి. సైతాను వలలో జిక్కితిరి. ఇది మొదలు మీకు కామమభివృద్ధియై సంతతిని బొంది రోగములపాలై మృత్యుముఖాగ్ని గుండమున బడి చెడిపోవుదురుగాక!"

అనిశపించెను. తురకమతమునగూడ యిదేకథగలదు. ప్రపంచమందెచ్చట జూచినను స్త్రీలు మాయాస్వరూపిణులై నిరంతర కామప్రవృత్తికి మార్గదర్శినులై మానవలోకమున నీతినియమములకు చోటులేకుండ జేసిరి. పశువు లెంతహీనముగనున్నను నియమాతిక్రమణము లేనందున కొంతవఱకవియే మేలని జెప్పవచ్చును. మనుజు లెన్నివిధములనో తెలివిగలవారయ్యు వివేకమంతయు మంటగలిపి కామదాసులై పశువులకంటె హీనులై భ్రష్టులగుచుండిరి. వీరికి కామరాజు దేవుడయ్యెను. భగవంతుని విడిచి భగసేవ జేయుచుండిరి. ఈ ముఱికి గుంటలో పడి పొర్లాడినకొలది జాతికి వికాసము కలుగునా? ఇహలోకమున వేరే యమకూపము లేదు. రాజాధిరాజులు, వేదవేదాంత వేద్యులు, యోగులు, పండితులు సైతము భగభాగ్యభోగసంపన్నులై, ఉభయసామ్రాజ్యసింహాసనచ్యుతులై నీచాతినీచులైవర్తింపుచున్నారు.

ఈభయంకర కృత్యమునుండి తప్పించుకొనుటకు దారిగానక నతివేగమున పరుగిడుచున్న కామరథమును నెమ్మదిగ నడుపుటకును, మానవత్వము పశుత్వముగ మారకుండుటకును, భగధ్యానము క్రమముగ భగవద్ధ్యానముగ మార్చుటకును, కామోత్పత్తి కలుగకుండుటకుపూర్వమే మతసంబంధ

మగు వివాహపద్ధతి నియమింప బడవలసివచ్చెను. ఇందుకై లోకదృష్టాంతము లెన్నియో కలవు.

1. ఒకనాడు బండిపై నెక్కి యొక గ్రామాంతరము జేరదలచితిమి. అందుకై యొక గుఱ్ఱము కావలసియున్నది. చూపుల కందముగనుండి మంచి బలముగల్గి స్వేచ్ఛగ విహరించిన గుఱ్ఱమును దెచ్చి బండికి కట్టినయెడల నది గమ్యస్థానమును జేర్చునా? చేర్చదు. వెంటనే మార్గమును తప్పించి యేగోతియందో పడవేయును. అందువలన ప్రాణములు పోగలవు.

2. ఆంబోతులను అరకగట్టి పొలము దున్నగలమా? లేక బండిని లాగింపగలమా? కండ్లు కావరమెక్కిన పశువులకు మన్నుమిన్ను కనబడదు.

కావుననే బాల్యమునుండి యలవరచుకొనక వానినుపయోగింపరాదు.

ఇక స్త్రీపురుషాదులను గుఱించి మాట్లాడుదము. నూటికి 99 మంది పురుషులు స్త్రీల వ్యామోహమున జిక్కుచుందురు. అదేమిచిత్రమో! స్త్రీయనిన పురుషుని దేహము పొంగుచుండును. ఆమెదగ్గర సూదంటురాయి యున్నదేమో తెలియకున్నది. ఇక పురుషులో యినుపముక్కలవలె మెల్లగ స్త్రీలను సమీపింతురు. ఈకష్టమునుండి తప్పించుకొను పద్ధతి యేసంఘమున కలదో ఆసంఘము పరమపవిత్రమై యభివృద్ధి జెందగలదు. అందుకు మార్గమెద్దియో యాలోచింతము.

మాయాస్వరూపిణియగు నా స్త్రీని బాల్యమునుండి యొకని యధీనమొనర్చి వేషమందును, నడకయందును, నివాసమందును, తగిన కట్టుదిట్టము లేర్పఱచి వానియందు భయభక్తులతో సంచరించునట్లొనర్చి ఆతనిని దైవముగ భావించునట్లు జేయవలెను. స్వేచ్ఛావిహారమునకు చోటియ్య రాదు. మాటిమాటికి పురుషుల కండ్లలో బడనీయరాదు. ఒకవేళ విధిలేక నొకానొక సమయమున పురుషుల దర్శింప వలసినయెడల, లజ్జగలిగి, వేషము, చాతుర్యము గనబడ కుండునటుల నలవాటు చేయించవలెను. ఈపద్ధతుల నభ్య సింపజేసినయెడల కామప్రవృత్తి చాలావఱకు నశించును. అట్టి యభ్యాసమొనర్చుటకై కామోత్పత్తికి పూర్వమే పెండ్లిచేయుట శ్రేయస్కరము.

బాల్యమున స్త్రీలకు వివాహమైనయెడల పతిని దైవ ముగ భావించి భయభక్తులుగల్గి వర్తింపగల స్థితికివత్తురు. పిమ్మట రజస్వలలై కామప్రేరితలైనను కామచిహ్నములగు నడకలు, వేషములు, వయ్యారములు, తమ పురుషులకడ చూపక సిగ్గుపడుచుందురు. అవినయవిధేయతలు మాటి మాటికి పురుషుని కామపాశముల జిక్కనీయక బంధించును. అంత వారిరువురికి శ్రేయస్సుగల్గును. ఇటుల మానవోన్నతి కి బాల్యవివాహము క్షేమకరమై వెలయును.

అటుగాక యౌవనానంతరము వివాహము జేసితిమేని ఆమె తనపురుషుని దైవముగ జూడజాలదు. కేవలము కామ పీడితయై యుంటచే నాకామరోగమునకు ఆతనిని దివ్యౌషధ ముగ భావించి కామదృష్టిచేగల్గిన బంధుత్వమని భ్రమించి

కామకార్యముకొఱకే తన జీవయాత్రను సాగింపుచుండును. ఈమార్గము మానవజాతికి వినాశహేతువని యిదివఱకే తెలిసికొంటిమి. కావున యువతీవివాహము నష్టదాయకము.

వాస్తవమున బాల్యమున జేయబడునదే వివాహ మనబడును. యౌవనమున స్త్రీపురుషు లిద్దరుగలిసి తాము భార్యాభర్తలమని తలచినను వారికి జరిగినది పెండ్లికాదు. వారు సతీపతులునుకారు. ఒకవేళ వివాహతంత్రము మంత్ర పూర్వకముగ జరిగినను బొమ్మలకు పెండ్లిచేయుచు మంత్రములు చదివినమాత్రమున నవి భార్యాభర్తలై యుండనట్లు యువతీ యువక దాంపత్యముకూడా శాస్త్రసంబంధమై మానవధర్మమై యుండదు.

కొండా శంకరయ్యగారి ప్రిమియర్ ముద్రాక్షరశాల, శికింద్రాబాద్.

# హిందూ మత గ్రంథమాలా

## విరాళముల వివరములు

మహారాజాధిరాజపోషకులు రూ. 116-0-0 మొదలుకొని మనసోత్సాహముకొలది.

| | | |
|---|---|---|
| మహారాజపోషకులు | సం॥ 1కి రు | 25-0-0 |
| రాజపోషకులు | ,, | 10-0-0 |
| పోషకులు | ,, | 5-0-0 |
| సహాయకులు | ,, | 3-0-0 |
| అభిమానులు | ,, | 2-0-0 |

## చందా వివరము

సంవత్సరం చందా

| | | | |
|---|---|---|---|
| పోస్టుతో సహా | ,, | 1-2-0 | (బ్రిటిష్) |
| ,, | ,, | 1-4-0 | (నైజాం) |

☞ విరాళ దాతల పేర్లు ద్వితీయ ముద్రణమునుండి ప్రకటింపబడుచుండును.

చిరునామా:

మేనేజరు:—

హిందూ మత గ్రంథమాల

లాలాటెంపిల్ స్ట్రీటు,

శికిందాబాదు (దక్కన్)

---

☞ గ్రంథమాలా సభ్యులుగ నుండదలచినవారు తమ పేరు, పోస్టు, తాలూకా, జిల్లాను విడివిడి అక్షరములతో వ్రాయవలెను.

# రాబోవు గ్రంథములు

షట్చక్రముల కధిపతివి కాదలంచితివా ?

గృహ రాజ్యమును వశపరచుకొని

తక్కిన అయిదు రాజ్యముల నార్జింపుము.

అవి యెవ్వి ?

## ౧ దేహ రాజ్యము     ౨ దేవ రా

## ౩ దేశ రాజ్యము

## ౪ ధర్మరాజ్యము     ౫ మోక్షరాజ్యమ

ఈ రాజ్యము లన్నిటిని పరిపాలించు విధానమును

తేటతెల్లముగ దెలియజేయు

## హిందూ మత గ్రన్థమాలా

కుసుమముల సేకరింపుము.

హిందూ మత గ్రంథమాల.

హిందూమత ప్రచారక ప్రభాకర పండిట్ గారి

యుపన్యాసములు

# Home Rule

# గృహరాజ్యము

4, 5, 6 భాగములు

రెండవ కూర్పు

ఆంధ్ర గ్రంథాలయ ముద్రాక్షరశాల,

బెజవాడ.



వెల రు 0-4-6

# గృహరాజ్యము



## 4 వ భాగము



### 27 వ ప్రశ్న

అనార్యుడు:—

ఆర్య మహాశయా! బాల్యవివాహమే నిజమైన పెండ్లి యనియు, సమర్తాడిన పిమ్మట జరిగిన పెండ్లి, పెండ్లి కాదనియు తెలిపియుంటిరి. ఆ సిద్ధాంతము నిజమైనయెడల స్త్రీలకు వలె పురుషులకు సయితము బాల్యముననే వివాహ మొనర్పవలెను. అనగా వివాహ సమయమున స్త్రీల వయస్సెంత యుండునో పురుషుల వయస్సున్నూ అంతయే యుండవలెను. అటుగాక స్త్రీలకు బాల్యముననూ, పురుషులకు యౌవనముననూ, పెండ్లి సేయుట తగునా? ఈ విషయమై తమ యభిప్రాయ మేమి?

ఆర్యుడు:—

మిత్రమా! స్త్రీ పురుషు లిరువురు సమానులని తలచి యిటుల పల్కియుంటివి. రూపమందును, మనస్సునందును, పను లందును - ఇంతయేల సర్వవిధముల నా రెండు జాతులకు భేద

మెంతయో కలదు. ఇట్లుండుటకు హేతు వేమి? ఈ భేదము లేనియెడల

(1) సృష్టి యనునది జరుగదు. మరియు

(2) అటుల సృష్టింపబడిన జగము వృద్ధిజెందదు.

ఈ రెండు పనులకై రెండు జాతు లేర్పడెను. అవి భిన్న తత్త్వములు కలవియైనగాని పై కార్యములు నడువవు.

ఇక స్త్రీ పురుషు లిరువురు పెండ్లాడు టెందుకో తెలియుదము.

1. బిడ్డలను కనుటకును,

2. అటుల గనినవారిని బెంచుటకును

అని తేలును. పెండ్లివలన నీ రెండుపనులే ఫలితములని తోచినను,

3. దుఃఖ నివృత్తి రూప మగు మోక్షము సయితము లభించు నని ముఖ్యముగ దెలియుచున్నది. కాని యీ విషయము వివేకు లొక్కరే గ్రహింతురు.

దురవగాహ మగు ముక్తివిషయ మటుంచి వివాహము వలన గల్గు సంతతినిగూర్చి ముచ్చటింతము. సంతాన మనగా బిడ్డలు పుట్టుటకదా! లోకానుభవమున

నొక వస్తువుయొక్క పుట్టుకకు రెండు కారణములు గన్పట్టుచున్నవి.

అటులనే స్త్రీపురుషు లిరువురు కలిసి బిడ్డల గనుచుండిరి. లోకమం దెచ్చటనైన రెండు వస్తువులు కలసి మరియొక పదా

ర్థమును బుట్టించునవి యున్న యెడల నా రెంటిని స్త్రీ పురుషు లతో బోల్చవచ్చును. అవి యెవ్వియో చూతము.

1. స్త్రీ పురుషులవలె భూమియు - విత్తనమున్ను - చేరి వృక్షముల గనుచున్నవి.

2. సూర్యుడు - చంద్రుడు - ఈ రెండును కలసి వెన్నె లను పుట్టించుచున్నవి. కేవల మొక చంద్రునివలన వెన్నెల కల్గె నని యెంచకుము. నిజముగా చంద్రునందు కాంతి లేదు. ఆ బింబము మొదట పెంకువలె నల్లగ నుండెను. సూర్య తేజము చంద్రునిపై బడగా నందలి నలుపు పోయి తెల్లదన మేర్పడి వెన్నెల బయలుదేరును. ఇందలి సారాంశమును వినుము. వెన్నెల యనునది జనింపవలె నన్న రెండు వస్తువు లుండె ననియు, అవియే సూర్య చంద్రు లనియు, ఆ రెండును ప్రత్యేకముగ భిన్నజాతు లనియు స్పష్టమైనది. మరియు నిందు గ్రహింపదగిన రహస్య మొకటి కలదు. అది యెద్దియన— సూర్యుడు సాయ మొనర్చె ననియు, చంద్రు డద్దానిని స్వీక రించె ననియు నెరుంగవలెను. ఇదే విధముగ విత్తనముయొక్క సాహాయ్యమును పొంది భూమి వృక్షముల గనుచున్నది. ఇంతవరకు రెండు దృష్టాంతముల జూపితిని. ఇటుల లక్షలకొలది కలవు. తుద కొక యుదాహరణమును జూపి సంశయ విచ్ఛేద మొనర్చుకొనవచ్చును. చెట్లు-వెన్నెల-ఇవి పుట్టినటుల నీజగము సయితము కానొక కాలమున సృజింపబడెను. రెండు కారణ ములు లేనిది యొక వస్తువు జనింపదని యిదివరకు తెలిసి కొంటిమి. జగముయొక్క పుట్టుకకు సయితము రెండు కారణము

లుండి తీరవలెను. అవి వేద వేదాంతములలో తెలుపబడెను. బ్రహ్మము - మాయ- ఇవి రెండును కలిసి జగమును సృజించె నని వేదము చెప్పుచున్నది. అందు మాయ యనునది భూమివలె స్వతస్సిద్ధముగ రాణింపదు. బ్రహ్మముయొక్క సాయముపొంది వన్నె కెక్కును. వివిధలోకముల సృజించి జగజ్జననియై ప్రకాశించిన మాయాదేవి దైవసాహాయ్యము లేనిది కృతకృత్యతం జెంద నేరదు. పై రెండు కారణములలో నొకటి పురుషతత్త్వమనియు రెండవది స్త్రీ తత్త్వమనియు నెరుంగుము. దేవుడు పురుషు డనియు మాయ - స్త్రీ యనియు శాస్త్రమున కలదు. ఇటులనే భూమియు, చంద్రుడును - స్త్రీ జాతిలో చేర్చబడిరి. విత్తనము - సూర్యుడు - ఇవి పురుషజాతిలో గణింపబడెను. ఈ సిద్ధాంతమును హిందువు లొక్కరేకాదు, ఇంగ్లీషువారు సయితమంగీకరించిరి. తమ జన్మభూమిని గురించి My mother land" "నా దేశమాత" యని ఆంగ్లేయులు చెప్పుచుందురు. దేశమును మాతృశబ్దముచే వర్ణించుటంజేసి భూమి స్త్రీలింగముగ వాడబడెను. చంద్రబింబమును ( Moon ) మూన్ అని ఇంగ్లీషులో పిలిచెదరు. మరియు నీ శబ్దమును Femenine gender స్త్రీ లింగముగ వాడెదరు.

చంద్రునికడ కేగి యతడు పురుషుడో,స్త్రీయో చూచినవారు కలరా? లేరు. ఇక నతనిని స్త్రీజాతిలో జేర్చుటకు హేతువేమి? స్వయంప్రకాశములై,స్వతంత్రములై,బలముకలిగి ఇతర వస్తువుల రాణింపజేయునవి పుంలింగము లనియు అస్వతంత్రములై బలహీనములై పరవస్తుసాహాయ్యమున వన్నెకెక్కునవి

స్త్రీలింగములనియు సర్వదేశీయు లంగీకరించిరి. ఇంతకంటె లింగ విభజనమునకు వేరొండు కారణములేదు. విత్తనమువలన భూమియు—సూర్యునివలన చంద్రుడును—రాణించుటం జేసి యవి స్వతంత్రపదార్థములై పుంలింగములుగ వాడబడెను. భూమియు, చంద్రుడున్ను స్వయముగ ప్రకాశింపజాలక పర సాహాయ్య మపేక్షించినందున నవి స్త్రీలింగములుగ నెంచ బడెను. పాజిటివ్ — నెగెటివ్ కరెంటులవలె స్త్రీపురుషు లిరువురు భిన్నధర్మములు కల్గి వర్తించుచుండిరి. ఇట్లుండ వారిరువురు సమానులని వచించుటెట్లో తెలియకున్నది. ఎప్పుడు స్త్రీపురుషులలో సమాన ధర్మములు లేవో అప్పుడు వివాహ విషయమునను సమానత్వము కూడదు. వా రిరువురికి కామో త్పత్తి కల్గు సమయము భిన్నకాలములలో నగుచున్నది. సాధారణముగ స్త్రీలు పండ్రెండేండ్లు దాటినది మొదలు పెద్ద పిల్ల లగుచుందురు. పురుషులకు పదునారేండ్లు వచ్చినగాని పెద్ద తనము రాదు. స్త్రీలు పెద్దపిల్లలైనది మొదలు సంతతిని కను చుందురు. అటుల కనుటకు సాయమొనర్చు పురుషులు ఇరువది వత్సరములు దాటినగాని శక్తి కలిగియుండరు. ఈ రెండు జాతులు సమాన ధర్మములు కలవియైనచో, పదునాలుగేండ్ల స్త్రీని పదునాలుగేండ్ల పురుషుడేల పెండ్లాడకూడదో తెలుపుము. క్రొత్త తలలు గల నవనాగరికులు నయితము పదునాలుగేండ్ల యువతుల కిరువదేండ్ల యువకుల జేర్చుచుందురు. స్త్రీ పురుషులు సమానులని ఘోషించు దేశములలోగూడ పెండ్లివిషయమున స్త్రీ వయస్సుకంటె పురుషవయస్సు హెచ్చుగానున్నది. అచ్చటి

స్త్రీలకు సయితము పురుషులకంటె కామోత్పత్తి ముందుగ గల్గు చున్నది. మరియు నయ్యది యెనిమిదిరెట్లధిక మని శాస్త్రము లందు కలదు. ఇటుల నెన్ని విధముల జూచినను స్త్రీ పురుషులకు సమానత్వము లేదని ప్రకృతిలో జూడగలము. ఈ మాట నిజమో, కాదో యని సంశయింపకుము.

స్త్రీలు పదునాలు గేండ్లకున్ను, పురుషులు పదునెనిమి దేండ్లకున్ను కామవశు లగుచుందురు. ఏది యెట్లున్నను వా రిరువురిలో నా కామబలము సమానమా, లేక హెచ్చుతగ్గులా యని విమర్శింతము. సుఖ మనుభవించు సమయమున బలా బలముల నిర్ణయింపజాలము. పిమ్మట నా వాసన యెవరియందు విశేషముగ వ్యాపించెనో తెలియగల్గిన యెడల నట్టివారిలో కామ బల మధిక మని నిశ్చయింపవచ్చును. ఆ పద్ధతిని గమనింతము.

ఒకే సమయమున స్త్రీ పురుషు లిరువురు కామ సుఖ మనుభవించిరి. వెంటనే పురుషుడు తనివి జెంది యావిషయమును మరచి స్వేచ్ఛగ చరించు చుండెను. స్త్రీ యన్ననో అటుల గాదు. కామవాసనను విడువజాలక తత్ఫలమును కనులార గాంచ దలచి యెన్ని కష్టములనైన నోర్చి గర్భమును ధరించి నెలల కొలది మోసి తుదకు ప్రసవవేదన మనుభవించి శిశువును కనును. ఆ బిడ్డ వ్యాధిగ్రస్తుడైనచో అన్నపానాది సౌఖ్య ముల విడచి పథ్య మొనర్చి కృశించును. ఇన్ని పాట్లు పడుటకు కారణము కామాధిక్యముగాక మరేమి ? చూచితివా ! కామ విషయమున స్త్రీపురుషులలోఁ గల తారతమ్యము. శాస్త్ర మున జెప్పినటుల స్త్రీల కెనిమిదిరెట్లు కామ మధికముగ నుండు

ననుట సత్యము. ఈవిధముగ స్త్రీపురుషులలో భేదమెంతయో గాన్పించును. కావున వివాహవిషయమున గూడ వయస్సొక్కటిగ నుండరాదు. స్త్రీలకు బాల్యముననను, పురుషులకు యౌవనముననను పెండ్లి సేయుట యుక్తము.

అనార్యుడు:—

మహాశయా! యువతులు పెండ్లాడిన యెడల నవి వివాహములు కావని తెలిపితిరి. అయితే క్షత్రియ స్త్రీలు సమర్తాడిన పిమ్మట పెండ్లాడవచ్చునని చెప్పితిరి. అది యెట్లు పొసగును?

ఆర్యుడు—

ఓయీ! నీ ప్రశ్న మెచ్చదగినది. కాని స్త్రీలలో రెండు తెగ లుండె నని మరచితివి. ఆ భేదము ననుసరించి బ్రాహ్మణ వైశ్య శూద్ర జాతులలోని స్త్రీలకును అంతఃపుర నివాసినులగు క్షత్రియాంగనలకును ధర్మములలో వ్యత్యాసము లుండి తీరును. కావున క్షత్రియ స్త్రీలకు యువతీ వివాహములు పనికి వచ్చును.

అనార్యుడు—

మహాత్మా! క్షత్రియాంగనలు తప్ప తదితర స్త్రీలు సమర్తాడిన పిమ్మట పెండ్లాడి రేని యవి వివాహములు కావని నిరూపింపగలరా?

ఆర్యుడు—

మిత్రమా! నిజముగ నవి పెండ్లిండ్లు కావు. వానిని

"Marriages" మ్యారేజస్ అందురు. హిందువులకు మ్యారే జస్ లేవు.

అనార్యుడు—

మహాశయా ! తాము చెప్పినది యర్థములేని మాట. ఎందుకన- నే నాంగ్లవిద్య నభ్యసించినపుడు మ్యారేజి యనగా వివాహ మని చదివియుంటిని. వ్యవహారమున సయిత మటులనే యున్నది.

డిక్షనరీ (నిఘంటువు)లో మ్యారేజి, యనగా వివాహ మని కలదు. ఇట్లుండ మ్యారేజికిని వివాహమునకును సంబంధము లేదనుట న్యాయమా ?

ఆర్యుడు—

ఓయీ ! నీ ప్రశ్న విన సొంపుగ నున్నది. కాని విమర్శించినయెడల నీటిలోనుండు బెండువలె తేలిపోయినది. ఎట్లన శీతోష్ణాది భేదములచే దేశములు భిన్నములై యున్నవి. ఒక్కొక్క దేశమున నొక్కొక్క జాతి ప్రత్యేకలక్షణములు కల్గి ప్రకాశించుచున్నది. ఆ యా జాతులకు దగిన సిద్ధాంతములు, ఆచారములు, ప్రకృతి సిద్ధములై పరస్పర సంబంధము లేనివై యున్నవి. భాషలు సయితము దేశములకు తగినటుల భిన్నములుగ నుండెను. జాతీయ ధర్మము లా యా భాషలలో వివిధ రీతుల వెల్లడింపబడెను. వాక్యములతోగాక, కేవల శబ్దముల చేతనే దేశచరిత్రలు, తత్సాంప్రదాయములు తెలియునటుల నవి నిర్మింపబడినవి. ఈ విషయమును విమర్శించి చూతము.

కాళ్ళు చేతులు కల్గి మాట్లాడగల జీవుని పిలువదలచి యతనిని తురకలు "ఆద్మి" యనియు, హిందువులు "మనుజు" డనియు వాడుచుండిరి.

ఇట్టి పేర్లు గలుగుటకు కారణము తెలిసికొందము. సృష్టి ప్రారంభమున 6000 యేండ్ల క్రిందట నొక తోటలో "ఆదాం" అను నొక పురుషుడు పుట్టె నని తురకలు- క్రైస్తవులు, చెప్పుచుందురు. అతని సంతతికి "ఆదాము యొక్క బిడ్డలు" అను నర్థము వచ్చునటుల నొక నామమును పెట్టిరి. ఆ పదము వినినవెంటనే ఆదాముయొక్క సంతతి జ్ఞప్తికి వచ్చుచుండును. అది యెట్లన ఆదాం సంబంధమైనవాడు ఆద్మి యని పిలువబడెను. ఈ శబ్దముచే నా దేశస్థులు ఆదామునకు పుట్టిరని సులభముగ దెలియగలదు. చూచితివా శబ్దప్రభావము. మొదట ఆదాం జనించెను. అతని ప్రక్కటెముకనుండి యొక స్త్రీ కలిగెను. ఆమెను తన రక్తసంబంధ మని యెంచక నతడు పెండ్లాడి బిడ్డలను కనెను. ఆ బిడ్డలలోని యన్నచెల్లెండ్రు కలిసి కామసుఖ మనుభవించి వంశాభివృద్ధిని చేసిరి. ఈ విధముగ బయలుదేరినజాతి ఆద్మ్మ లనబడిరి.

ఇక హిందూదేశమందలి జను లెటుల వృద్ధిగాంచిరో చూతుము. వీరి మూలపురుషుడు స్వర్లోకవాసి యగు మను బ్రహ్మ. అతని దేహము మన శరీరమువలె మాంసమయమై చర్మముతో గూడియుండక కేవలము తేజోరూపమై యొప్పెను. అతని సంకల్పశక్తిచే హిమాలయ పర్వత ప్రాంతమున దేవికా

నదీతీరమందు వేలకొలది జనులు జంటలు జంటలుగ ననగా భార్యాభర్తలై జనించిరి.

సృష్టి ప్రారంభమున మానవోత్పత్తి యెటుల గల్గెనో రాబోవు గ్రంథములలో తెలుపబడును

ఒక జంటకుబుట్టిన యాడుబిడ్డలను మరియొక జంటకు జనించిన మగవారి కిచ్చి పెండ్లిచేసిరి. వారివలన క్రమక్రమ ముగ ప్రజాభివృద్ధి యయ్యెను.

మనువు అను బ్రహ్మయొక్క సంకల్పమున జనిం చుట జేసి మనుజు లని పిలువబడిరి. భరతఖండమున మానవ జాతి యెటుల నావిర్భవించెనో తెలిసెనా?మనుజు లనగా మనువు యొక్క సంతతి. ఆద్మ్యులనగా ఆదాముయొక్క సంతతి. ఈ రెండుజాతులకు మూలపురుషులు వేరు. ఒకరి కొకరికి సంబంధ మెంతమాత్రము లేదు. ఆ జాతి అన్న చెల్లెండ్రను పెండ్లిచేసి కొని వృద్ధియైనది. ఈ జాతి యా సిద్ధాంతము నంగీకరింప దయ్యె. ఇటుల సాంప్రదాయములు, ఆచారములు, సిద్ధాంత ములు, ధర్మములు, భావములు, వేరువేరై యుండెను. ఇట్లుండ ఆద్మియనగా మనుజు డని చెప్పుట యెంత మౌఢ్యమో చూడుము.

ఒక మహమ్మదీయుని జేరి నీ వంశముయొక్క మూల పురుషుడు మనుబ్రహ్మకాదా యని యడిగినచో నత డంగీక రించడు. హిందువునికడ కేగి నీ మూలపురుషుడు ఆదాము కాదా యని ప్రశ్నించిన నతడు సమ్మతింపడు.ఇక నతడు మనుజుడెట్లు

గును ? ఇతడు ఆద్మి యెట్లగును? అట్టి సందర్భమున ఆద్మి యని నను మనుజు డనినను అర్థ మొక్కటే యగునా ? ఈ శబ్దములు వివిధ దేశస్థుల భిన్న చరిత్రలను బోధించుచుండ నీ రహస్య మెరుంగక ఆద్మియను పదమునకు మనుజుడని యర్థ మొనర్చుట యెట్టి వింత ? ఒక భాషయందున్న కొన్ని శబ్దములకు వేరొక భాషలో సరియైన పదముల జూపగల్గుట యసంభవ మని యెరుంగుము.

సంస్కృతభాషలో ధర్మశబ్ద మొకటికలదు. వేదమున చెప్పబడిన సిద్ధాంతమునకును, పుణ్యమునకును, వస్తు స్వభావ మునకును, ఒక జాతియొక్క వృత్తికిని, ఒక యుద్యోగియొక్క పనికిని, ప్రపంచస్థితికిని, ఇట్లెన్నియో యర్థములు ధర్మశబ్దమం దిమిడి యున్నవి. ఈ శబ్దమునకు ఇంగ్లీషులో "డ్యూటీ" యను పదమును ప్రయోగింతురు. నిజముగా ధర్మమందున్న భావము డ్యూటీలో లేదు. అయినను విధిలేక ధర్మమును డ్యూటీ యని పిలుచుచుందురు. "పతివ్రత"యను శబ్దమునకు ఇంగ్లీషులో తగిన పదమే లేదు. ఎందుకన నా జాతిలో పాతివ్రత్య ధర్మ మనునది యొక మహిమగా జూడబడదు.

ఇటుల శబ్ద జాలమును విమర్శించిన కొలది యొక భాష లోని సాంప్రదాయమునకు వేరొక భాషలోని సాంప్రదాయము సరితూగ దని స్పష్ట మగుచున్నది. కావున నే వివాహ శబ్దమందున్న భావము,మ్యారేజి యను పదమున లేకపోయెను. ఎట్టి ధర్మములతో వివాహ మేర్పడెనో అట్టి ధర్మములు మ్యారేజిలో లేవని తాత్పర్యము:

అనార్యుడు—

మహాత్మా! స్త్రీ పురుషు లొకగృహమున జేరి కామ సుఖ మనుభవించుచు జీవయాత్ర గడుపుటకై యేర్పచుకొనిన నిబంధనమే వివాహ మనబడును. ఇతర దేశస్థులలోగాని, హిందువులలోగాని యిదేవిధముగ వివాహబంధ మేర్పడెను. ఇట్లుండ నిక వివాహమునకును, మ్యారేజికిని భేదముండె ననుట యెట్లు?

ఆర్యుడు—

మిత్రమా! హిందూవివాహము కేవలము కామ నివారణార్థ మేర్పడె నని తలచుచుంటివా? ముమ్మాటికి కాదు.

శ్లో॥ ఆత్మార్థం భోజనం యస్య । సుఖార్థం యస్య మైథునం
వృత్త్యర్థం యస్యచాధీతం । నిష్ఫలం తస్య జీవితం.

ఎవడు తన కడుపు నింపుకొన నెంచి భుజించునో, కామ సుఖ మనుభవింపదలచి భార్యను పొందునో జీవనార్థమై విద్య నభ్యసించునో అతని జన్మ నిరర్థక మని శాస్త్రము తెలుపు చున్నది.

అయితే యిక వివాహ మెందుకని శంక కల్గును.

శ్లో॥ ఋణాని త్రీణ్యపాకృత్య
మనో మోక్షే నివేశయేత్
(మనుస్మృతి)

దేవఋణము, ఋషి ఋణము, పితృఋణము, ఈ మూటిని దీర్చినగాని మోక్షప్రయత్నము సేయరాదు. అందుకై పెండ్లాడవలెను. అది యెటులనో వినుము.

యజ్ఞేన దేవేభ్యః
ప్రజయా పితృభ్యః } (కృష్ణయజుర్వేదం)

యజ్ఞము లొనర్చి దేవఋణమును, సంతతిని గని పితృఋణమును దీర్చవలెను. భార్యయుండిన గాని యజ్ఞము చేయుటకును, సంతతి గనుటకును వీలు లేదు. కనుక వివాహపద్ధతి కామ సుఖముకై యేర్పడిన దని తలపరాదు. అందు కామసుఖ మున్నను ధర్మబద్ధమై కట్టుదిట్టములతో నొప్పును.

శ్లో॥ ధర్మావిరుద్ధః కామోస్మి.

(భగవద్గీత)

ధర్మమునకు విరోధము లేని కామము దోషయుక్తముగ నుండ దని భగవానుడు వచించెను. అందువలన హిందూ వివాహములో కామ ముండినను అది ప్రాణము లేని దేహము వలె చచ్చినదై యున్నది. అట్టి కామముచే గల్గిన సంతతి దైవబుద్ధి కలదై ముక్తి ప్రయత్న మొనర్చును. అట్టి బిడ్డలను కనిన తల్లి పతివ్రత యన బడును.

భర్త బ్రతికియున్నపు డెటుల యోగ్య యగు స్త్రీ, పరపురుషు నపేక్షింపదో అటులనే మగడు చనినను వేరొకని పెండ్లాడక బ్రహ్మచర్యమును బూని తుద కెపుడో మరణించి పరలోకమం దుండు పతితో జీవితము గడపి మరల భూలోక

మున జనించి యతనినే పెండ్లాడి యిటుల ముక్తి పర్యంతము కాలయాపన మొనర్పగల పతివ్రతల సిద్ధపరచుట కేర్పడినదే వివాహ మనబడును. పై ధర్మములు హిందూ వివాహమునగాక మ్యారేజిలో కలవా? భర్త మరణించిన వెంటనే వేరొకని పెండ్లాడుట కనుమతించినది మ్యారేజి యనబడును. అట్టి మ్యారేజికిని, వివాహమునకును సంబంధముండెనో, లేదో నీవె యోచింపుము.

అనార్యుడు—

మహాశయా! మ్యారేజిలో కంటె వివాహమున ధర్మ బంధ మతిశయమై యుండుగాక. అట్టి ధర్మమును నమ్మి వర్తించి మరణానంతరము పరలోకమున కేగి యచట తమభర్తల గలసి సుఖించి మరల జన్మించినపుడు వారినే పెండ్లాడి యిటుల ప్రతి జన్మమున తమ తమ పూర్వభర్తలఁజేరుచు తుదకు మోక్ష మనుభవింపజేయుటకు యువతీ వివాహములు సాధనములై యుండవా?

ఆర్యుడు—

ఓయీ! అవి యెన్నటికి సాధనములు గావు. ఎందుకన సమర్తాడినది మొదలు స్త్రీలకు కామోత్పత్తి కలుగుచుండును. వెంటనే పురుషులపై నాశ యేర్పడి కామేచ్ఛను దీర్పగల వారిని పెండ్లాడుదురు. ఆ పెండ్లి కామభోగమున కొక దివ్యౌషధ మని భావింతురు. ఏ వివాహమునకు కామము బునియాదియై యుండెనో తన్మూలమున గలిగెడి ఫలము నయితము కామరూపమై విలసిల్లును. ఎట్టి విత్తనమో అట్టి

ఫలమేకదా ! ఇటుల కామాభివృద్ధి యైనకొలది ముక్తి దూర మగును. రోగశాంతికై తెచ్చుకొనిన మందు వ్యాధిని పోగొట్ట దేని దానినే తినుచుందురా ? వేరొకమందు గైకొందురు. అటులనే కామశాంతికై వలచిన భర్త యా విషయమున నసమర్థుడయ్యేనేని- తన మనసునకు నచ్చడేని యతనిని విడువక కనిపెట్టుకొని యుండరు. వేరొకని పెండ్లాడి తీరెదరు. ఈ మాటలు కల్పితములని తలంపకుము. లోకానుభవ మిట్లున్నది. ఏదేశమున యువతీ వివాహములు కల వని మురియుచుంటివో అచ్చటి యనుభవములే ప్రత్యక్షనిదర్శనములు. బాల్యమున పెండ్లియైన యెడల తగినభర్త లభింపడనియు వయసు వచ్చిన పిమ్మట యోగ్యుని వరింపవచ్చుననియు తలచి విదేశస్త్రీలు నడివయసులో పెండ్లాడుచుండిరి. తత్ఫల మెవ్విధముగ పరిణమించెనో తెలియుము. తగినవానిని పరీక్షించి పెండ్లాడి కాపుర మొనర్చిన పిమ్మట నచ్చనందున విడనాడ దలచి యా బంధము ను తెంపుటకు కోర్టు (అదాలత్) కెక్కుచుండిరి. ఈ దుర్గతికి హేతువు యువతీ వివాహము లని యెరుంగుము. అటుల కాదేని

" Your children and my chilldren are quarreling with our children "

అను సామెత పుట్టుటకు కారణమేమి ? ఒక మగడు తన భార్యనుజూచి "నీ బిడ్డలు, నా బిడ్డలు, మన బిడ్డలతో పోట్లాడుచుండిరి" అనె నట.

అది యెట్లు సంభవమో తెలిసెనా ? ఒక యువతీ మణి యొక పురుషరత్నమును పెండ్లాడి బిడ్డలు జనించిన

పిమ్మట నతనిని విడిచి వేరొకని జేపట్టెను. ఇక అతని కథ వినుము. ఒక మోహనాంగి యతనిని పెండ్లాడి బిడ్డలను కని యా శిశువుల విడచి వేరొకని జేరెను. అంత నా పుత్రులను రక్షించుకొనుచు కామలోలుడై పై యువతీమణిని చేబట్టెను. ఆమెయు తన మొదటి మగనివలన కన్నబిడ్డల వెంట నిడుకొని యితనిని పరించెను. వీ రిరువురు కలిసినందున మరల బిడ్డలు కలిగిరి. ఈపిల్లలను మన పిల్లలని యతడు వర్ణించెను. ఇట్టి యవకతవకపు కథలు విదేశములలో లెక్కకు మించియున్నవి. ఈ యాచారము నడి యీడుగల యాడువారి పెండ్లిండ్లవలన గలెను.

కావున యువతీ వివాహముల వలన పాతివ్రత్యధర్మ మడుగంటుటయు, భర్తతోబాటు పరలోకమున వసించు భాగ్యము లేకుండుటయు, రాబోవు జన్మమున పూర్వ భర్తను పెండ్లాడ నేరకి ముక్తిమార్గమును విడచుటయు సుప్రసిద్ధము.

అనార్యుడు—

మహాత్మా! తాము చెప్పినది సరికావచ్చును. కాని భర్త మరణించెనేని యిక నా కన్యయొక్క గతియేమి?

ఆర్యుడు—

ఓయీ! పూర్వకాలమున బాలవితంతువులు మనదేశమున లేకుండిరి. శ్రీరాముని రాజ్యకాలమున వితంతువు లసలే లేరు. ఇంతయేల! మన తాత ముత్తాతల కాలమున స్త్రీలకు బాల్యమున వైధవ్యము కలుగ లేదు. విదేశీయులు మనదేశ మాక్రమించినది మొదలు వర్ణాశ్రమరక్షణము లేక, ధర్మ

దూరులమైతిమి. సదాచార సంపత్తి, స్వీయభాషాభ్యాసము, స్వధర్మానుష్ఠానము, క్రమముగ నశించి విదేశాచారము లలవడి యాయుర్విహీనుల మగుచుంటిమి. అందువలన బాలవితంతువుల సంఖ్య పెరుగుచుండెను. ఈ రహస్యమును గమనించి స్వమత ప్రచార మొనర్చుటకును, స్వకుల వృత్తుల స్వీకరించుటకును మొదలిడవలెను. అంత పురుషు లాయుష్మంతు లగుచుందురు. ఇక బాలవితంతువు లుండరు.

పై పని నెఱవేరులోపల దేశమం దున్న వితంతువుల కష్టముల దొలగించుటకు నుపాయము రాబోవు గ్రంథమున జూడనగును.

అనార్యుడు—

అయ్యా! తాము చెప్పినది చిత్రముగ నున్నది. దేవు డొక్కసారియే ఆయుష్యమును లిఖించు నని వినియుంటిని. దానిని పెంచుటకుగాని తగ్గించుటకుగాని సాధ్యమా? ఒకవేళ తపస్సంపన్ను లగు మహానీయు లా పనిని జేసిన జేయవచ్చును. మన యాచారములవలన నాయుర్వృద్ధి కలుగు నని నమ్ము టెట్లు?

ఆర్యుడు—

మిత్రమా! ఆత్మబల మెరుంగ నందున నిటుల బల్కితివి. పశువులకును, మనుజులకును గల భేద మిచటనే యున్నది. మనుజుడు మనోబలము కలవాడు. మానసిక శక్తి యతని సొత్తు. మనస్సునకు సాధ్యము కాని పని లేదు. ఎయ్యది తలచిన నద్దానిని నెరవేర్ప గల శక్తి మనస్సునం దున్నది. మనోబలమును వృద్ధిజేయ గల సాధనములు వేలకొలది కలవు. అటుల నాత్మశక్తిని పెంపొందించి యెన్నియో మహత్కార్యము

లొనర్చిన పురుషపుంగవులు కలరు. బాల్యదశలో మన స్తత్త్వము బహు పవిత్రమై యుండును. అందుచే మానసిక శక్తి యెటుల సంకల్పించిన నటుల చేయ గలదు. అయితే బాలబాలికలు తమ జీవితమును సద్వినియోగ మొనర్పవలె నని తలచరు. అపుడు తలి దండ్రులు పెత్తనము వహించి వారి బుద్ధిబలమును వృద్ధిచేయగల మార్గము లన్వేషింపవలెను. బాల్యమున మానసిక శక్తి శుద్ధమై యుండు ననుటకు ప్రమాణ మెద్దియో తెలిసికొందము. లాటరీ వేయునపుడు బాల బాలికలచే చీట్లనెత్తించుచుందుము. తలచిన పని నెరవేరునో లేదో యని సంశయము కలిగినపుడు పిల్లలను బిలచి పండా, పచ్చియా, యని యడుగుచుందుము. వేళ్ళను జూపి యిష్టము వచ్చిన దానిని పట్టుకొను మని యడిగి ఫలాఫలములు గుర్తించుచుందుము. ఇట్టి శక్తి పసిబిడ్డలం దుండుటకు కారణమేమి? మనకింటె తెలివికలవారా? కాదు. తపస్సంపన్నులా! అదియు శూన్యమే. ఇక నా మహిమ యెట్లు వచ్చెను? ఎవరి హృదయములు జగద్వ్యవహార నిమగ్నములై యుండవో, కుతంత్రము లెరుంగవో, సంసార తాపత్రయమున జిక్కవో, అవి శుద్ధములై యుండును. అట్టి నిష్కల్మష బుద్ధితో నెటుల సంకల్పించిన నటుల కార్యసిద్ధి కాగలదు. కనుకనే కొందరు మంత్రవేత్తలు బాల బాలికల చేతులకు అంజనము వేసి వారి వలన ననేక విషయముల గ్రహింతురు. మెస్మరిజం మున్నగు విద్య లభ్యసించినవారు వానిని ప్రదర్శింపదలచి బాల బాలికలపై ప్రయోగింతురు.

"బాలకుల దీవెనలు బ్రహ్మదీవెనలు" అని దసరా పద్యములు బయలుదేరెను.

"బాలవాక్యములు రిత్తపోవునా" యను సామెత కూడ కలదు. ఈ మర్మ మెరింగిన భారతీయులు స్త్రీలకు బాల్యమున పెండ్లిచేసెదరు. పరిశుద్ధహృదయ లైన యా బాలికలకు పతిని దైవముగ భావింపు డని బోధింతురు. బొట్టుపెట్టుకొనునపుడు, సొమ్ములు ధరించునపుడు, పువ్వులు ముడుచుకొనునపుడు, ఇంతయేల ప్రతికార్యమున భర్తయొక్క యాయుష్యము వృద్ధియగు భావన లుదయించునటుల నేర్పుదురు. పెండ్లియైనది మొదలు పతిని దీర్ఘాయుష్మంతునిగ జేయుటకు నోముల బట్టించుచుందురు.

1. "ఉదయ కుంకుమనోము" అని యొక వ్రతముకలదు. దాని నొక వత్సర మాచరింపవలెను. ప్రతిదినము దంతధావనాది కృత్యము లొనర్చి కుంకుమను గైకొని యొక ముత్తైదువ కడకేగి బొట్టుపెట్టవలెను. ఇటుల సంవత్సర మాచరించి తుదకు ఉద్యాపనము చేయుచో నామెకు కుంకుమ లోపింపదు. అనగా కుంకుమను దానమొనర్చి నందున మొగమున కుంకుమ పెట్టుకొను భాగ్యము కొదవ పడదు. ఇక వైధవ్యమునకు చోటెక్కడిది?

2. "చిట్టి బొట్టు నోము" అని మరియొక వ్రతము కలదు. పెండ్లాడిన కన్య యొక వత్సరమో, లేక నైదేండ్లో ప్రతి దినము స్నానమొనర్చి గంధాక్షతలు గైకొని 5 గురు ముత్తైదువులకు బొట్టుపెట్టుచు నీవ్రతమును పూర్తిగావింతురు. గంధాక్షతలు దాన మొనర్చినందున జీవించువరకు గంధధారణ

మొనర్చుకొను దశ నశించదు. అనగా వైధవ్యము ప్రాప్తించదు.

3. "అలంకారపునోము" ఇది మరియొక వ్రతము. సాయంకాలమున నొక ముత్తైదువను గంధపుష్పాదులచే నలంకరించుచు నొక వత్సరము నడుపవలెను. పుష్పదాన మొనర్చినందున తలలో పువ్వులు పెట్టుకొను దశ తొలగనేరదు. అనగా వైధవ్యమురాదు.

4. "శ్రావణ మంగళవారపు నోము." దీనిని పెండ్లియైనది మొదలు ప్రతి శ్రావణ మాసమున నైదేండ్లు జరుపవలెను. ఇందలి కథలో చనిపోయిన భర్త జీవించెనని కలదు. కనుక పతియొక్క యాయుష్యమునకు లోపముండదు.

5. "సావిత్రీ గౌరీవ్రతము." ఇది తొమ్మిదేండ్లు జరుగవలెను. పాతివ్రత్య మహిమచే సావిత్రీదేవి చనిపోయిన పతిని బ్రతికించుకొని నటుల నీ కథలో కలదు. ఈ వ్రతము వలన భర్త దీర్ఘాయుష్మంతు డగును.

6. "మూగగౌరీ వ్రతము" కార్తిక మాసమున రాత్రులలో నక్షత్రము లుదయించిన వెంటనే మౌనవ్రత మవలంబించి పెదవులు మూసికొని 5 నక్షత్రములు లెక్కించి 5 గురు ముత్తైదువులకు బొట్టుపెట్ట వలెను. రెండవయేట అదేనెలలో 10 నక్షత్రముల గణించి పదుగురు ముత్తైదువులకును, మూడవయేట 15 నక్షత్రముల లెక్కించి 15గురు స్త్రీలకును బొట్టుపెట్టుచుండ వలెను. ఇందువలన నైదువతనము వృద్ధి యగును.

7. "మాఘగౌరీవ్రతము" ఇందు మాఘమాసమున నై దేండ్లు గౌరీదేవిని పూజించుచుండవలెను. భర్తను సంపాదించుటలోగాని, అతనిని చిరంజీవునిగ నొనర్చుటలోగాని ప్రతి జన్మమున నతనినే పెండ్లాడుటయందుగాని, గౌరీ దేవికంటె శ్రేష్ఠురా లెచ్చటను లేదు. అందువలన నామెను పూజించి పైలాభముల పొందుచుందురు. రుక్మిణీదేవి శ్రీ కృష్ణుని భర్తగా వరించి యతనిని పెండ్లాడదలచినపుడు గౌరీదేవిని పూజించినటుల వినియుంటిమి. పెండ్లియం దంకురారోపణము జరుగు సమయమున పుట్టింటివారు తమ కన్యలకు గౌరీ పూజ చేయింతురు.

ఇట్టి వ్రతము లింక నెన్నియేని కలవు. పసితనమునుండి బాలికలు తమ పతుల నాయుష్మంతులుగ నొనర్చుటకు భగీరథ యత్నములు గావింతురు.

"దీర్ఘాయు రస్తు మే పతి ర్జీవాతు శరద శ్శతం"
(వివాహ మంత్రము)

తనపతి దీర్ఘాయువును పొంది వర్ధిల్లవలెనని పెండ్లి కాలమున కన్య అగ్నిహోత్రుని ధ్యానించుచున్నది.

బాల్య మం దెట్టి యభ్యాస మొనర్చిన నట్టి యలవాటు యౌవనమున సయితము బలపడి కార్య సిద్ధికి తోడ్పడును.

అనార్యుడు—

మహాత్మా! ఈ నోముల వలన నాయుర్వృద్ధియగుట నిజమేని యటుల నోచినవారి భర్తలు మరణింపరా? అయితే

యిక్కాలపు కన్యలు పెండ్లాడినది మొదలు పై నోములు పట్టు చుండిరే! వారిలో నెందరో నితంతువు లగుటకు హేతువేమి?

ఆర్యుడు—

మిత్రమా! ఒక కార్యము నెరవేరుట కొక్క కారణము చాలదు. తుదకు రెండు కారణములైనను కలియనిది కార్య సిద్ధి కలుగదు. ఈ విషయమును మరచి పై విధముగ బ్రశ్నించితివి. ఒకడు ధనవంతుడగుటకై నెలకు నూరు రూప్యములు సంపాదించుచుండెను. నిజముగా ధనవంతుడగుట కిది ముఖ్య కారణ మని మనమెరుగుదుము. కాని యతని భార్య యా పైక మంతయు ఖర్చుపెట్టుచుండెను. వచ్చిన దంతయు వ్యయమగు చుండ నిక భాగ్యవంతుడగుట యెట్లో తెలియును. మితముగ ఖర్చుపెట్టి ప్రతి మాసమున కొంత మిగుల్చుచుండు నెడల లక్షాధికారి కాగలడు.

1. బాగుగ సంపాదించుటయు
2. రాబడి యెంత యుండిన నంత ఖర్చుపెట్టక నందు కొంత మిగుల్చు చుండుటయు

నిటుల రెండు కారణములు ధనవంతుడగుటకు సాధనములై యున్నవి. అట్లే పురుషు లాయుష్మంతు లగుటకై స్త్రీలయత్నము లెంత విరివిగ జరిగినను పురుషప్రయత్నము నయితము తోడ్పడుట యవసరము. పురుషు డాయుష్మంతుడగుట కెన్ని విధముల కృషిసల్పినను అతనిభార్య ఆయుర్హీన కార్యము లొనర్చెనేని యతని యాయువు క్షీణింపక తప్పదు.

పురుషు డాయువును పోగొట్టుకొనుచుండినను స్త్రీ తన మనో బలముచే నతని యాయుష్మంతునిగ జేయదలచెనేని, అట్టి ఫలము విశేష పరిశ్రమచేగాని సిద్ధించదు. అటుల జేయుట యెల్లరకు వలనుపడదు. కావున స్త్రీపురుషు లిరువురు కలిసి పురుషుని యాయుర్వృద్ధికై యత్నించుచుండవలెను.

అనార్యుడు—

అయ్యా! పాతివ్రత్యము స్త్రీలపాలిట ఘోరకృత్యముగ నున్నది. ఈ ధర్మము వారి నణగద్రొక్కుట కేర్పడిన దనుట సత్యము. కాని యెడల వివాహమం దింత భారముండుటకు హేతువేమి!

ఆర్యుడు—

మిత్రమా! నీ గుండె మృదువైనది. అటులుండుట మంచిదే కాని దేశోపకార మభిలషించునెడల, జాలిపడుటయే ముఖ్యసూత్రమని యెంచకు. ప్రభులక్షణము లెరుంగనివారు ధర్మమునకును, జాలికిని, గల భేదమును తూచలేరు. ఈ యవివేకమువలన దేశమును బూడిదపాలు చేయుదురు. జాలి చెందుట, సుగుణలక్షణమైనను అదియెల్ల వేళల నుపకార మొనర్పజాలదు. ఎంతకఠినముగ నున్నను ధర్మము జగత్కల్యాణ మొనగూర్చునని నమ్ముము. దేశ క్షేమముకై మిలిటరీ డిపార్టుమెంటు (రక్షణసైన్యము) కలదు. అందలి మనుజులు సర్వకాల సర్వావస్థలలో లోకులతోబాటు గ్రామములలో తిరుగరాదు. భార్యా పుత్రాది బంధువర్గము కలిగి సుఖింప వీలులేదు. పట్టణములందు జరుగు విందులలో పాల్గొనకూడదు. సినీమాలు

నాటకములు, పురాణ కాలక్షేపములు, హరికథలు,సర్కసులు మొదలగు వానికడ కేగి యందలి సుఖ మనుభవింపరాదు. ఉపన్యాసములకు బోయి వివిధవిషయములు తెలిసికొనకూడదు. ఇంతయేల ? వారికి లోకజ్ఞాన ముండకూడదు. ఈ విధముగ జీవితాంతమువరకు కాలము గడుపవలసియుందురు. ఇంతకంటె పరమ దుఃఖము వేరొండు లేదని తోచుచున్నది. ఇటుల కష్టపెట్టి బాధించుట తగునా యని జాలితో మాట్లాడి లాభమేమి? ఆ దృష్టితో జూచినపు డది ఘోర పాపముగనే యుండును. కాని రాజ్య సంరక్షణ విధానమును గమనించినపు డది దోష యుక్తముగ నుండదు. ఆ శిక్షణము జగత్కల్యాణ హేతువగునని ధర్మవిదులకు దోచును. ధర్మమున కొంత కాఠిన్యమగుపడినను అది దేశహితమగును. జాలియం దెంతయోగ్యత గోచరించినను అది లోకకంటకమై యొప్పును. పోస్టల్ డిపార్టుమెంటు, రైల్వే డిపార్టుమెంటు కలవు. అందు జేరిన యుద్యోగస్థుల గతులు తెలియునా? గ్రామములలో లేక పట్టణములలో జరుగు కాలక్షేపములయందు పాల్గొన వీలు లేదు. వారి దేహములు జైలునందువలె బంధింపబడును. నైట్ డ్యూటీలవలన ప్రకృతి విరుద్ధమై యొప్పు జాగరణమును రాత్రులందు జరుపుచుండవలెను. పోలీసు డిపార్టుమెంటుకూడా ప్రజలలో కలిసి మెలసి సుఖింప వీలులేదు. జైలునందుగల యుద్యోగస్థుల స్థితియు నింతియే. ఈ విధముగ గొంద రుద్యోగస్థులు సుఖమును విడిచినగాని లోకమునకు హితముకలుగదు. దేశ రాజ్యమున నెటుల సుఖత్యాగ మొనరించు ప్రజలు కొంద

రుండవలెనో అటులనే గృహరాజ్యమున సయితము దుఃఖమును సహించుచు రుండితీరవలెను. వారే పతివ్రతాశిరోమణులు. మిలిటరీ డిపార్టుమెంటుకు దుఃఖ ముండె నని మన దృష్టిలో గోచరించినను నిజముగా నది దుఃఖమే యైనయెడల వారు బ్రతుకజాలరు. తమదే నిజమైన సుఖమనియు, ప్రజ లనుభ వించునది దుఃఖమనియు మిలిటరీ తలచుచుండును. ఉద్యో గస్థులు తాము బానిసల మని తలచి రైతులను జూచి సంత సింతురు. రైతులు ఎండ వానల కోర్వజాలక కుర్చీలపై గూర్చొని తెల్లకాకితమును నలుపుచేసి బ్రతుకు గుమస్తాలను జూచి యానందించుచుందురు. వర్తకులు గాలి వెలుతురులేని దుకాణములలో మ్రగ్గుచు నుద్యోగస్థులు సౌఖ్యవంతులని భ్రమించుచుందురు. వర్తకులు స్వతంత్రులనియు వేలకొలది ధనము గణించి సుఖించుచుండిరనియు ఉద్యోగాంతమున తమ భార్యాపుత్రుల గతులు దురవగాహములనియు తలచి యుద్యో గస్థులు వ్యాపారమును గొనియాడుచుందురు. ఎల్లపుడు గూర్చొని జీవించువారు నటుయిటు దిరిగి జీవించువారిని జూచి సంతసింతురు. నిరంతర దేశాటన మొనర్చువారు యింటియం దుండి బ్రతుకువారిని జూచి మెచ్చుకొనుచుందురు. బుద్ధి బలముగలవారిని జూచి దేహబలము గలవారు సంతసింతురు. అజీర్ణ వ్యాధి పీడితులై నిద్రాసుఖ మెరుంగక కమ్మని తిండి తినలేనివారు దేహబలము గలవారిని జూచి ఆనందించుచుం దురు. పల్లెటూరు పరమ సౌఖ్యమని పట్టణవాసి యనుకొనును. పట్టణమున సుఖముకలదని గ్రామస్థులు తలతురు. ఉష్ణదేశ

స్థులు శీత దేశమును కొనియాడుదురు. శీతల దేశస్థులు ఉష్ణదేశ మును మెచ్చుకొందురు. దొంగలకు రాత్రి మంచిది. దొరలకు పగలు మేలు. ఈ యనుభవమునుబట్టి సత్యమరయుట దుర్లభము. ప్రతివృత్తిలో గొంత దుఃఖము మరికొంత సుఖముండెను. ఒక వృత్తిలో నుండువాడు రెండవవృత్తిలోని దుఃఖభాగమును జూచి నిరసించును.

కావున బుద్ధిమంతులు వృత్తులను నిందింపజాలరు. ఎవని కులవృత్తి వానికి గొప్పదిగ నుండును. ఇతరు లద్దానిని గ్రహింపక నిందింతురు. అవివేకులగు పురుషులు తమవృత్తి యందుండు హైన్యమును మరచి స్త్రీలవృత్తి నీచమని తలతురు. ఎవరిమటుకు వారు తమ మొగమును చూడజాలరు. ఈ సూత్రము ననుసరించి స్త్రీల కొసంగబడిన గౌరవముల గ్రహింప లేక, జాలిజెంది చింతింతురు. ఒంటికంటి చూపు యోగ్యమా! "Both sides of the question" అను నటుల రెండు వైపుల జూడక విషయనిర్ణయ మొనర్పదగదు. ఈ దురవస్థ పాశ్చాత్య వాసనా దూషిత చిత్తచాంచల్యముచే గల్గెను. అట్టివారు స్వవేష భాషాచారములా! యెరుంగరు. విదేశసాంప్రదాయములా! అసలే తెలియరు. ఉభయభ్రష్ట స్థితి వారి సొత్తుగా నున్నది. ఇక మనశ్శుద్ధి యెక్కడిది? ఇట్టివారా! హైందవ స్త్రీల పాతివ్రత్య ధర్మము నెక్కిరించుట!

సోదరా! వారి యుపన్యాసములు విని చిత్తచాంచల్య మును పొందకుము. బుద్ధిమంతుడవు కమ్ము. దేశము నుద్ధ రింపుము.

వివాహామం దింత భారముండెనా? యని యడుగకుము. ఆ శబ్దమందే యట్టిభావ మున్నది.

"విశేషేణ ఉహ్యాతే అనేన ఇతి వివాహః"

వివాహమనునది విశేషముగ మోయునట్టి స్వభావము కలదని తాత్పర్యము. వి అనగా విశేషమనియు, వాహః అనగా వహించునదనియు నర్థమగుచున్నది. వహించుట యనగా మోయుట యని యెరుంగుము. ఇక వివాహమున భారము లేకుండు టెట్లు? జీవుని సంస్కరించుటకు వేదమున పదునారు కర్మలు విధింపబడెను. వానినే షోడశకర్మ లందురు. అందు వివాహ మొకకర్మ. కర్మలలో విశేషభారమైనది వివాహ మొక్కటే. ఎందుకన వేదధర్మముల ననుష్ఠించు జనులు జన్మించుటకు వివాహమే మూలము. ఏ యే విధుల ననుసరించి పెండ్లిండ్లు జరిగిన మంచి బిడ్డలు కల్గుదురో వారి నేయే రీతుల బెంచిన ధర్మమార్గమున చరింతురో ఆ యా మార్గములతో నొప్పు వివాహము భారమైనదిగాక సులభమైయుండునా! సర్వ విజ్ఞాన సంపన్నుడగు మానవుని జన్మము కుక్క గొడుగుల వలె పెంట దిబ్బలలో పెరుగు నని తలంపకుము.

పరమ పవిత్రమై ఆరోగ్య ప్రదమై దీర్ఘాయుష్య హేతువై దేశ సౌభాగ్య మూలమై యొప్పు వివాహము సర్వభార భూయిష్ఠముగాక సులభముగ నుండ దని యెంచుము.

అనార్యుడు —

మహాశయా! యువతీ వివాహములు నష్టదాయకము లని సృష్టిరహస్యమున జూపగలరా!

ఆర్యుడు—

ఓయీ ! నీ ప్రశ్న బహు యోగ్యమైనది. హిందు మతము విశ్వసూత్రమున కనుకూలమై ప్రకృతి బద్ధమై యల రారుచున్నది. వినుము. వేదమున సమర్తాడిన స్త్రీకి పుష్పవతి యని పేరు పెట్టబడెను. అట్టి నామము వచ్చుటకు కారణము తెలియునా ? సంస్కృతశబ్దములలోని యర్థము స్వతస్సిద్ధమై సృష్టిమర్మమును వెల్లడించుచుండును.

సమర్తాడిన దనగా పుష్పించెనని భావము. అందువలన పుష్పవతి యని పిలువబడెను. స్త్రీలు పుష్పింతురా ? యని సంశయము కలుగవచ్చును. అయితే చెట్లు పుష్పించునని నీకు తెలిసి యుండును. మంచిది. అవి పుష్పించు టెందుకు ? ఫలించు టకు కాదా ? అటు పిమ్మట నేమి జరుగును? పండిన పంట మరల మొలకలెత్తి వృక్షజాతిని వృద్ధిచేయును. అట్లే స్త్రీలు సమర్తాడి బిడ్డలను కనుచుందురు. ఇది మాత్రము పంటకాదా ! చెట్లు ఫలించినటుల స్త్రీలును ఫలించు చుండిరి. ఫలించుటకు పూర్వము పుష్పించుట యెట్లో అట్లే సంతానోత్పత్తికి పూర్వము స్త్రీలు పుష్పించు చుండిరి.

బిడ్డ క్రొత్తగా యీడేరి నపుడు సమర్తాడె ననియు, రజస్వలయైన దనియు, పెద్దపిల్ల యయ్యె ననియు, సాధారణ ముగ జెప్పుచుందురు. అయితే శాస్త్రవేత్తలు సమర్తయైన బిడ్డను పుష్పవతి యయ్యె నని వచింతురు. పెండ్లిండ్లు పుష్పవతు లకా! లేక పసిబిడ్డలకా ? యని ప్రశ్నించి చూతము. ఇందుకు సమాధాన మొసంగు టెట్లు? పుష్పించిన వృక్షములనే యడుగు

దము. పెద్ద కొమ్మలుకల్గి వృద్ధియగు వృక్షములు కొన్నికలవు. కొమ్మలు లేక త్రాళ్ళవలె ప్రాకునవి మరికొన్ని యుండెను. ఇటుల వృక్షములలో రెండు తెగలున్నవి. కొమ్మలులేని వానికి తీగె లనిపేరు. వేదభాషలో వానిని లతలని పిలుతురు. అవి యితర వృక్షములవలె నెదుగవు. పందిరినిగాని కొమ్మలున్న వృక్షములగాని యాశ్రయించి పెరుగును. చెట్లపైకి ప్రాకిన పిమ్మట నచట పుష్పించును. అంత ఫలించి ధన్యత జెందును. ఇది జగత్ప్రారమ్మై యున్నది.

మనుజులలో సయితము స్త్రీలనియు పురుషులనియు రెండు జాతులు కలవు. స్త్రీలు లతలవలె ఫలించుటకు అనగా బిడ్డలను కనుటకు పురుషుల నాశ్రయింతురు. అందువలన లత లతో పోల్చబడిరి. లతలవంటి జాతియగుటచే స్త్రీలకు లతాంగు లని పేరు కల్గెను.

లతాస్వభావము తెలిసెనేని లతాంగుల ధర్మము సయి తము తెలియగలదు. అవి పుట్టినది మొదలు లేతగా నున్నపు డొక చెట్టు నల్లుకొని యందలి కొమ్మల ననుసరించి వంకలుగ దిరుగుచు వృక్షముపై కెగబ్రాకి యచట పుష్పించి ఫలించును. దీనింబట్టి లతాంగులు సయితము లేతగా నున్నపుడు అనగా చిన్నతనమున భర్త నాశ్రయించి పెరుగుచు నతని యాధి పత్యమున పుష్పించి ఫలించవలె నని స్పష్ట మగుచున్నది. పుష్పించిన పిమ్మట తీగెలను చెట్ల కంటగట్టువా రుండరు.

ఎందుకనగ నవి పెనవేసుకొని పెరుగవు. చెట్టుదారి వేరు, తీగెదారి వేరై "ఎవరికి వారే యమునాతీరే" యన్నట్లగును.

ఈ సిద్ధాంతమునుబట్టి లతాంగియు పుష్పించినపిమ్మట నొకని పెండ్లాడరాదు. ఒకవేళ పెండ్లాడినను గాఢమైనప్రేమ కలుగదు. మరియు వారి దేహములు, మనస్సులు, కలిసి మెలసి సంసార యాత్రను నడుపజాలవు. తాత్కాలికప్రేమ కలిగినను కొలది కాలమునకు ద్వేషము లంకురించి వివాహ బంధమును తెగింపును. యువతీ వివాహములుగల దేశములలో నీవిషయము ప్రత్యక్షమైయున్నది. అచ్చటి స్త్రీలు ప్రథమభర్తల విడనాడి క్రొత్తవారిని చేబట్టుచుండిరి.

కావున యువతీ వివాహములు గృహకల్లోలములకు మూలములై దుస్సంతానకారణములై దేశనాశన సాధనము లగుచున్నవి.

రాబోవు గ్రంథములలో విదేశములందలి యువతీ వివాహములవలన కలిగిన నష్టములు వివరింపబడును.



# గృహరాజ్యము



## 5 వ భాగము



అనార్యుడు:—

మహాశయా! ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డలకు పెండ్లి సేయుట విలాసముకా! లేక ముచ్చటగ కాపుర మొనర్చుటకా! సంసారముకొరకైనచో బాల్యమున ప్రేమభావము లంకురించు నని వచింపగలరా? లేనియెడల నిక పెండ్లి యెందుకు? అవసరము లేనపుడు వస్తువులతో పని యేమి?

ఆర్యుడు:—

మిత్రమా! అవసరము లేనపుడు వస్తువుల నుపయోగింప రనుట సత్యము. కాని ఎప్పటికైనను అవసర మని తోచెనేని ముందుగ నాయా వస్తువుల నార్జింపకుందురా?

(1) ఒక యిల్లు కాలుచుండె ననుకొనుము. అపుడు చేయవలసిన దేమి? చల్లార్పవలెను. త్వరగ నార్పుటకు నీటి యింజను అవసరము. అందుకై వెంటనే బయలుదేరి మదరాసుకో, బొంబాయికో వెళ్ళవలెనా? లేక యెప్పటికైన నట్టి బాధ కల్గు నని యెంచి ముందుగ దానిని తెప్పించుకొనుట మంచిదా?

(2) ఒక దేశముపై శత్రురాజులు దండెత్తి వచ్చిరి. దానిం జూచి యా దేశపురాజు సైనికులను, యుద్ధ సామగ్రిని క్రొత్తగ సిద్ధపరచునా ? లేక యెప్పటికో యుద్ధము వచ్చు నని తెలిసి ముందుగ సమకూర్చుకొనునా ?

(3) ఆకలి యైన దనుకొనుము. దానిని దీర్చుకొన నవసర మేర్పడినపుడు చేయవలసిన దేమి ? వెంటనే అన్నము తినుట మంచిది. అయితే అది యెట్లు దొరకును. ఎక్కడికో వెళ్ళి యెవరో వండిన యన్నమును తిందుమా ? అది బుద్ధిమంతులకు దగదు. ఒకానొకప్పు డాపద్ధర్మముగ దినవచ్చును. కాని నిత్య మటుల జేయరాదు. ఆకలి యగునని తెలిసి యెట్టి యాహార మవసరమో దానిని ముందుగ వండించుకొనవలెను. గౌరవ కుటుంబములలో నేటికిని పై విధముగ జరుగుచున్నది. అందు వలన నారోగ్యము, ఆయుష్యము, దేహపుష్టి, మనోబలము మొదలగు లాభములు కలుగును. అటుల జేయక నాకలి యైన వెంటనే తిండికై వెదకి యే పూటకూటింటికో వెళ్ళి కడుపు మంట చల్లార్చుకొనినయెడల తాత్కాలిక శాంతి చేకూరినను ఆరోగ్యప్రదమై యుండదు.

(4) ఒకనికి నలుబదేండ్లు వచ్చినను చదువు రానందున కష్టజీవియై కాలము గడుపుచుండెను. విద్వాంసుల సంపాదన మును, వారి గౌరవమును గాంచి యెటులనైన విద్య నార్జింప దలచెను. కావున క్రొత్తగా ఓనమాలు దిద్దవలెనా ? లేక విద్యవలన కలుగు లాభ మెట్టిదో యెరుగని బాల్యదశనుండి తలి దండ్రుల వలన నక్షరాభ్యాసమును పొందవలెనా ?

(5) ఆకలియైనపుడు కడుపు నింపుకొనుటకు భుజింపవలె నని పసిపిల్ల లెరుగరు. ఇతరు లన్నము పెట్టినను తినవలె నని తోచదు. తినుట యవసర మని తెలిసినపుడే బిడ్డలు భుజింపవలెనా ?

అటుల దెలియకున్నను యోగక్షేమము లెరింగిన తలిదండ్రులు అన్నపానాదు లొసంగవలెనో లేదో తెలియును. ఈ యనుభవముల దిలకించినకొలది యెవని కేయే వస్తువు లవసరములో అపు డా యా వస్తువుల నార్జించుటకంటె ముందుగనే సమకూర్చుకొనుట యోగ్యము కాదా ?

పశువులకును, మనుజులకును భేద మిచటనే కలదు. ఆకలియైనపుడు జంతువులు తిండికై వెదకును. ముందుగ గడ్డిని సేకరించుకొన నెరుగవు. మరియు కామోత్పత్తి కల్గినపుడు పురుషపశువుకై తపించును. అంతియేకాని ముందుగ నొకదానిని చేపట్టి యుంచుకొనవు. పశుధర్మ మిట్లుండును. మనుజులన్ననో అటుల కాదు. ఆకలి కాకున్నను ఎప్పటికో అన్నమవసర మని యెంచి ముందుగ నా పదార్థముల సేకరింతురు. ఇటులనే కామ ముదయించుటకు పూర్వము తచ్ఛాంతికై పెండ్లాడుదురు. లేనియెడల కామాంధతచే యోగ్యు లగు పురుషులు లభించరని యెరుగుదురు.

“ కామాతురాణాం న భయం న లజ్జా ”

యనునటుల కామము సిగ్గు బిడియముల విడిపించును. కావున వంశరక్షకుం డగు భర్తను సంపాదింపలేదు.

అనార్యుడు:—

అయ్యా! ఇల్లు కాలుచున్నదని పోల్చి యీ విషయ మును స్త్రీల కంటగట్టితిరి. అది న్యాయముగ లేదు. ఎందుకన ఇంటికి నిప్పంటుకొనిన యెడల వెంటనే దగ్ధ మగును. మరు నాడు ఇంటి రూపమే యుండదు. కావున నిల్లు దగ్ధ మగుటకు పూర్వము తద్రక్షణమునకై నీటియంత్రమును దెచ్చి యుంచ వలెను. స్త్రీలవిషయ మట్టుల గాదు. సమర్తాడిన పిమ్మట వారి హృదయములలో కామాగ్ని రగుల్కొన్నను అంతమాత్రమున మరణింపరు. అందువలన ముందుగ పతిని నిర్ణయింప బని లేదు. కామ ముదయించిన పిమ్మట తగినవానికై వెదకి తుద కెపుడో యొకని వరింపవచ్చును. ఇక యువతీవివాహముల వలన నష్ట మేమి?

ఆర్యుడు—

ఓయీ నీకు మనుజు డన నెవడో తెలియకున్నది.

In the world there is nothing great but **man**. In man there is nothing great but **mind**.

లోకమున సర్వజీవులలో మనుజు డధికుడు. అతనిలో మనస్సు శ్రేష్ఠ మైనది అని యొక పాశ్చాత్యపండితుడు నుడివెను.

శ్లో॥ "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః."

మనుజుల బంధమోక్షములకు మనస్సే కారణ మని శాస్త్రమున కలదు.

కావున మనోబలము మానవత్వమును రక్షించు నని

యెఱుగుము. నిప్పు నందుండు వేడిమి నశించెనేని యెటుల నా పదార్థము నామరూపములు గోల్పోయి కళావిహీనమై బొగ్గుగా మారునో అటులనే మనోబలము చెడినయెడల మనుజుడు మానవత్వమునుండి విడివడి ద్విపాదపశు వగును. కావున మన స్సెంత శుద్ధముగ నుండిన నంత బలముకల్లదై మనుజుని దేవ తుల్యునిగ జేయు నని యెరుంగుము. అది చలించెనేని మాలి న్యము జెంది దుర్బలంబై యధఃపతన మొనర్చును. స్త్రీలపై పురుషులకు, పురుషులపై స్త్రీలకు గల కామేచ్ఛకంటె మనో దౌర్బల్య మొసగు సాధనము వేరొండులేదు. ఆ కామము అగ్నితో పోల్చెదరు. కావున నది కామాగ్నియని పిలువ బడెను. నిప్పువలె నది దగ్ధ మొనర్చుటలో వెనుకంజ వేయదు. స్థూలదేహమునకు వేడి కలిగించి సూక్ష్మదేహమును జెరచును. ఎపుడు మానసిక దేహము భ్రష్ట మయ్యెనో అపుడు మానవుడు బ్రతికియు చచ్చినవానివలె నుండును. జీవచ్ఛవ మను బిరుద మిదియే సుమా! మనసులో కామాగ్ని యనియు, జ్ఞానాగ్ని యనియు రెండగ్నికణములు వెడలును.

(1) కామాగ్ని యుదయించెనేని సద్భావములు, సత్సాంగత్యము, సదాచారము మున్నగు సుగుణ పుంజములు నశించును.

(2) జ్ఞానాగ్ని జనించునెడ దుస్సంకల్పములు, దురా చారములు, దుస్సాంగత్యము, దుఃఖరాశి మొదలగునవి మాయమగును.

పెండ్లి యగుటకు పూర్వము స్త్రీ—సమర్తాడిన యెడల

కామాగ్ని రగుల్కొని మన స్తత్వమును చెరచి పెడదారి తీయును. అంత మానవత్వము నశించి రాక్షసత్వ మేర్పడును. అందువలన శాంతి యుండదు. ఇంతకంటె కామాగ్నిచే గలుగు నష్టము వేరొండు లేదు. నిప్పు రగుల్కొని యిల్లును తగుల బెట్టినటుల కామాగ్ని వెడలి స్త్రీల హృదయముల దగ్ధ మొనర్చును. ఈ ఘోర విపత్తునుండి తప్పించుకొనుట కే బాల్య వివాహము లేర్పడెను.

"పశువులకు తింటే బలము, మనుజులకు ఉంటే బలము" అను సామెత నెరుంగవా ? సమర్తాడుటకు పూర్వము భర్త నియమింపబడెనేని యత డెంత దూరమం దున్నను తలచుకొని కొంత వరకు తృప్తిబడును. ఒక భర్త కల డనియు, నతని విడచి మరియొకవిధముగ చరింప రాదనియు బుద్ధి చెప్పుకొనును. ప్రతిక్షణమున నతడు జ్ఞప్తికి వచ్చుచుండును. అందువలన దుర్వృత్తికి చోటు దొరకదు. సాధారణముగ నూటికి తొంబది తొమ్మిది భాగము లిట్లేజరుగును. ఈ యాచారమునకుతోడుగ ధర్మరాజ్యమే యున్నచో సంఘము సత్సంతతి బడయగలదు.

బాల్య వివాహముల వలన నిట్టి మహత్తరప్రయోజనము కలదు. పెండ్లికి పూర్వమే సమర్తాడిన యెడల కామాగ్ని ప్రజ్వలించి

"అతడుకాడే యితడుకాడే
ఆత డీతడు ఈతడే"

యని పాట బాడుచు పరిపరి విధముల రుచి జూచి తుద కెవనినో మోహించును. దుర్భరంబై, దుర్నీతి కరమై, దుస్సం

తాన హేతువై యొప్పు నీ యువతీ వివాహముల మన్నించు టకు మానసీయులు సిద్ధపడరు.

అనార్యుడు:—

మహాశయా! ఒక స్త్రీకి బాల్యమున పెండ్లియయ్యెను. వెంటనే భర్త మరణించె ననుకొనుడు. అంత వైధవ్య మేర్పడదా!

ప్రకృతి కనికరము కలదికాదు. పాప మా బిడ్డ సమర్తాడెను. అత్తవారింట్లో భర్త యున్న యెడల పై సామెత ననుసరించి యతని స్మరించుచు నింద్రియ నిగ్రహము పొంది యుండెడిది. కాని, యతడు మరణించినందున నట్టి యవకాశము కలుగదయ్యె. ఇక కామశాంతికి మార్గ మెద్ది? స్త్రీలకు విధవా వివాహము లున్న యెడల పై దోషము తొలగవచ్చును. కాని శాస్త్రములలో రెండవ పెండ్లి లేదని తాము సెలవిచ్చితిరి. ఇక బాలవిధవల గతియేమి?

ఆర్యుడు:—

మిత్రమా! వైధవ్యము కలిగినది మొదలు కామో ద్రేక మేర్పడకుండుటకు ప్రబలయత్నములు గావింపబడెను. ఆపద్ధతులలో నాహారనియమము ముఖ్యమైనది. ఉప్పు, పులుపు, కారము మొదలగు కామోద్రేక వస్తువులు భుజింపరా దని శాస్త్ర మాజ్ఞాపించెను. ఇట్టి నియమము లెన్నియో, కామ ధ్వంసమున కేర్పడెను. వాని ననుసరించి వర్తించు వితంతువులు సమర్తాడినను కామబాధకు లోనుగారు. ఉద్రేకము

లేనపుడు ధర్మమును విడచి వేరొకని పెండ్లాడ వలె ననిగాని, వ్యభిచరింపవలె ననిగాని బుద్ధి పుట్టదు.

కావున విధవలకు పునర్వివాహములతో బనిలేదు.

అనార్యుడు—

అయ్యా! ఎంతయో పుణ్యమునగాని, మానవ జన్మము లభింపదు. పశుపక్ష్యాదుల శరీరములకంటె మనుజ దేహములు సుఖవంతములుగ సృజింపబడెను. అట్టి యానందమును భంగ మొనర్చునియమములు ఘోరములుకావా? ఇంతకంటె మృత్యువు వేరొండు కలదే? ఏనాడు మతశృంఖలములనుండి విడివడుదుమో యాదినమే సుదినము. స్త్రీలు బహిరంగముగ చరింపరాదనియు, వితంతువులు పెండ్లాడకూడ దనియు భర్తవలన కామసుఖము తీరనపుడు పరపురుషుల బొందరా దనియు మున్నగు నియమములు రాక్షస ధర్మములు కావా?

ఆర్యుడు—

మిత్రమా! నీవు చెప్పినది యొక దృష్టితో నిజముగనే తోచును. కాని దూరదృష్టి కల్గి విమర్శించునెడ సర్వాబద్ధమగును. ఎందుకన మానవదేహము కేవల జగత్సుఖముకై జనింప లేదు. పరలోకసౌఖ్య మనుభవించుటకును, మరియు నిరతిశయానందమును, అనగా ముక్తి నొందుటకును జన్మించెను. ఇహలోక సుఖమునకు స్వస్తిచెప్పిన (తగ్గించిన) గాని, పరసౌఖ్య మలవడదు. విషయభోగముల ననుభవింపు డని యింద్రియములకు స్వేచ్ఛ యొసగినయెడల ఆరోగ్య మంత మొందుటయేగాక

ఆయుష్యమును కుంగిపోవును. ఇంద్రియ సుఖములే పరమావధి యని తలచిన పశువుల గతులు చూడుము.

మనుజులకువలె జంతువులకు జ్ఞానేంద్రియములు కలవు. వాని మూలమున నవి సుఖ మనుభవించును. అయితే ఒక రకమైన పశువున కెద్దియో యొక యింద్రియ మత్యంత సుఖప్రదంబై యుండును.

1. శ్రోత్రేంద్రియము (చెవి)చే లేడికెంతయో సుఖ మబ్బును.

2. త్వగింద్రియము (చర్మము)చే ఏనుగు సంతసించును.

3. నేత్రేంద్రియము (కన్ను)చే మిడుత యానందించును.

4. ఘ్రాణేంద్రియము (ముక్కు)చే తుమ్మెద సుఖించును.

5. జిహ్వేంద్రియము (నాలుక) వలన చేప మోద మొందును.

ఇటుల నొక్కొక్క యింద్రియ మొక్కొక్క జంతువును దుఃఖముల పాలుజేయును. అది యెటులనో తెలియునా? వినుము.

1. సంగీతధ్వని వినుటలో జింకలు తమ చెవుల నిక్కరబొడుచుకొనును. పాములుకూడ తదేక నిష్ఠతో వినుచుండును. అందుకై మనుజులు పాటలుపాడి ధ్వనివశమున నవి తన్మయములై యుండ వానిని బట్టుకొని బంధింతురు. జైలువంటి యీ బంధమునకు హేతు వేమి?

శ్రోత్రేంద్రియ సుఖాపేక్షయే కదా !

2. ఎటులనో యేనుగును వశమొనర్చుకొని తన్మార్గమున ననేక మదగజంబుల (ఏనుగుల) లోబరచుకొన నొకడు తలచెను. అందుకై ముందుగ నా యేనుగునకు కొన్నిమాటలు నేర్పి యడవికి బంపును. ఏనుగులలో నొకటి కొకటి తమ శరీరముల రాచుకొనిన యెడల వానికి విశేష సుఖము కల్గును. అందువలన నెన్నియో యడవి యేనుగులు చర్మసుఖ మపేక్షించి యీ యేనుగును రుద్దుకొనును. వెంటనే యది వాని యన్నిటితో కలిసి మచ్చిక జేసికొని యజమానునకు వశమొనర్చును. అరణ్యమున స్వేచ్ఛగ విహరించు మదగజంబుల కెట్టి గతి పట్టెనో తెలిసెనా ! ఇందుకు కారణము త్వగింద్రియ సుఖాపేక్షయే కదా !

3. నిప్పును జూచినపుడు మిడుతల కెంతయో యానంద మొదవును. ఆ సమయమున రెండవ విషయము తోచదు. అందుకై యగ్నిలో దుమికి సుఖింపదలచును. కాని మరణించును. ఈ దుర్గతికి కారణము నేత్రేంద్రియసుఖము కాదా !

4. పువ్వులం దున్న గంధమును వాసన చూచుటకు తుమ్మెదల కెక్కువ ప్రేమ కలదు. అందువలన పుష్పముల కడ కేగి గంధ మాఘ్రాణించును. ఇట్లొనర్చుచు నొక కమలముననో, లేక నాగమల్లెయందో చేరి యందలి వాసనను పీల్చుచుండును. ఇంతలో రాత్రి కాగా నా పుష్పములు ముకుళించును. వెంటనే లేచి పోవుటకు యత్నించి దారి గానక

తెల్లవారు వరకు వివిధ బాధల ననుభవించును. ఈ కష్టము లకు కారణము ఘ్రాణేంద్రియ (ముక్కుయొక్క) సుఖము కాదా!

5. చేపలకు తిండియందు రుచి యెక్కువ. అందుకై గాలమున జిక్కిన ఎరను జూచి మ్రింగదలచును. వెంటనే యినుపముల్లు గ్రుచ్చుకొని మరణించును.

ఇంద్రియములను నమ్మిన పశ్వాదుల గతి యిట్లైనది. ఇక మనుజులకో ఒకే యింద్రియము కాదు. అయిదును ముఖ్య ములే. అనగా నొకయింద్రియముచే నెక్కుడుసుఖము వేరొక దానిచే, స్వల్పసుఖము ఇటుల మానవజాతిలో లేదు. ద్రవ్య నష్టమగుటయే గాక, నిద్రాభంగమై రోగజనకమై యుండె నని తెలిసియు, క్రొత్తసీనులతో నాకసమునుండి దిగివచ్చెనని విని సినీ మాలకు వెళ్ళ నేత్రేంద్రియము నర్పింతురు. అందలి పాటలు వినసొంపుగ నున్నవని యెంచి చెవుల నొప్పగింతురు. క్రొత్త రకపుతిండి దొరకెనేని రుచికరముగ నుండె నని యెంచి మరల మరల తిని యానందించి తుదకు రోగములపాలై మరణింతురు.

ఇంతటితో తేలెనా? లేదు. వీని నన్నిటిని మించిన కామేంద్రియసుఖ మొకటి కలదు. అది రాజాధిరాజువలె నున్నది. పశ్వాదుల కీ సుఖ మున్నను అవి ఋతుప్రకారము ఏడాది కొకసారియో, రెండుమారులో కలియుచుండును.

"మనుజుడన్ననో కామదాసుడు." ఈ దాస్యమున మోస ముండదు. జీతభత్యములు లేనికొలువన నిదియే. ఋతు కాలమనక, పగలు రాత్రియనుభేద మెంచక, భోజనముకన్న

నెక్కువగ ప్రతిదినము కామసౌఖ్య మనుభవించును. అశక్తుల కా విషయమున వైరాగ్య ముండునేమో కాని తదితరులకు విరక్తియను మాటయే శూన్యము,

సారాంశమును వినుము. కోర్కెల తగ్గించు నెడల సుఖము కల్గును. ఎందుకన, నిజముగ సుఖ మనునది జగత్పదార్థ ములలో లేదు. అయితే యొక వస్తువు ననుభవించునపుడు సుఖము కల్గినట్లుండును. దానిని జూచి బుద్ధిలేని జీవుడు సుఖ మొసగునవి విషయములు, లేక వస్తువులు అని భ్రమించు చుండును. అయితే సుఖము ఆత్మధర్మ మని యెరుగడు. నిజ ముగా ఆనందరాశి ఆత్మయందే కలదు. మనసు చలించునపు డయ్యది యనుభవమునకు రాదు. నీరు కదలునపు డందలి వస్తువులు గోచరించునా ? అట్లే మనసు కదలినపు డందున్న యానందము స్పృహకు రాదు. అందువలన దుఃఖ ముండును. ఎపుడు మనసున కొకపని పెట్టుదుమో అపు డది యా కార్య మున మునుగును. ఇక చలించుటకు చోటుండదు. తినునపుడు గాని, వినునపుడుగాని, యదివర కలవాటుపడిన విషయములైన యెడల స్వాభావసిద్ధముగ పట్టుదల గల్గియుండును. అపుడు మనస్సు ఏకాగ్రితం జెంది వెంటనే లోనున్న యానంద మనుభవించును. జీవు డా సుఖము ననుభవించుచు "అహో! ఈ పండు ఎంత రుచికరము, ఈ పాట ఎంత వినసొంపు, ఇది యెక్కువ సుఖప్రదముగ నున్నది" యని వర్ణించుచుండును. చూచితివా ! యత డెటుల మోసపోయెనో. ఈ రహస్య మెరిం

గినవారు వెయ్యి కొక్కరునులేరు. కావున నీ విషయమున సంశయము కలదేని వినుము.

సమాధినిష్ఠాగరిష్ఠు లుండి రని నీ వెరింగి యుందువు. వత్సరములకొలది జగద్విషయముల విడిచి బాహ్యేంద్రియము లగు త్వక్చక్షు శ్రోత్ర జిహ్వా ఘ్రాణము లను-అంతరింద్రియ మగు మనస్సును- ఆత్మలో లయ మొనర్తురు. అప్పుడు తిను టయు, వినుటయు, మొదలగు విషయము లుండవు. నిజముగా సుఖ మనునది తినుటయందు, వినుటలోను ఉన్న యెడల అట్టి తినుటను, వినుటను మానిన యోగిపుంగవునకు సుఖ మెక్కడిది? అయితే సుఖము లేదందుమా! సమాధి యందున్నపుడు మహానంద భరితుడై యుండెను. సుఖమే లేనియెడల బహు కాల మెక్కరీతిగ నొకతావున నుండ నేరడు. కావున నింద్రి యములతోడను, విషయములతోను,పని లేకయే కేవల మాత్మ యందే రమించి సుఖింపవచ్చు నని తెలియుచున్నది. ఇది సత్య మార్గము. సుఖమునకు బాట యిదియే. ఈ రహస్య మును గని యాచరించుటకే మతము లనేక మార్గముల జూపి క్రమముగ నీ దశకు తెచ్చుటకు యత్నించుచున్నవి. ముక్తి నభిలషించువారి కిదియే త్రోవ.

ఒకమారు జగచ్చరిత్ర గమనింపుము అప్పుడీ విష యము బోధపడును.

ఇంగ్లాండు, ఫ్రాన్సు, మున్నగు దేశములు సుఖము కొరకు జన్మించితిమని తలచెను. అందుకై బైబులునందు విధింప బడిన ధర్మముల మంట గలిపి స్వేచ్ఛగ విహరించెను. మనుజుడు

విషయ భోగముల ననుసరించి సుఖించుటకు జనించె ననుట సత్య మేని పాశ్చాత్యుల భోగదశ బహుకాలము నిల్చియుండెడిది. ఒక శతాబ్ద మైనను నడచినదో లేదో, కనులార గోచరించు నా దేశములు శ్మశాన భూము లగుచున్నవి. ఒక చెంప గొట్టిన రెండవ చెంపను జూపు మని బోధించిన క్రీస్తుగారి మతము పాశ్చాత్య దేశములనుండి యెగిరిపోయినది. అటుల కాదేని, శతృవుల నయితము ప్రేమింపవలసిన క్రైస్తవులు తమ మిత్రులపై దాడి వెడలి మోసగించు టెందుకో యోచిం పుము. నేడు భూనభోంతరాళముల దద్దరిల్ల జేయు ప్రపంచ యుద్ధమునకు హేతు వేమి ? మితిమీరిన సుఖేచ్ఛయే కాదా ! ఏసునాథుని యుపదేశముల ధిక్కరించియిట్లైరి. ? దైవరాజ్యా క్రమణమును విడచి యిహలోక రాజ్యముల గాంక్షించుటం జేసి యీ గతి పట్టినది. కావున

విషయ భోగముల త్యజించుటయో, లేక, తగ్గించు టయో నిజమైన సుఖకారణం బని నిశ్చయింపుము. విశేష సుఖానుభవముల కాటప ట్టగు నింద్రియము లుండుటచేతనే మానుజు డధఃపతితు డగుచుండెను. ఇందుకు విరుగు డున్నచో నీ జాతి కొంతకాలము జీవింపగలదు. అదియే, జ్ఞాన మనబడును. అది లభించుటకు మతము సాధనమై వెలయుచున్నది. అట్టి దానిని నిరసించువారు కల రని వచించుటకు సిగ్గగుచున్నది.

మతమును లేవనెత్తి సర్వసుఖప్రదం బగు స్వాతంత్ర్య మును మంట్ఠ కలిపి రని వాదించువా రుండిరి. ఎందరో ఇటుల బయలుదేరుట శోచనీయము. ఇట్టి యుద్యమము మొల

కెత్తుటకు కారణముగూడా కలదు. ఏమన మతస్థులైనవారు మతసూత్రమును మరచి కేవల బాహ్యాచారములకు ప్రాముఖ్యతంజూపి మతమందున్న ప్రాణశక్తిని కదలించిరి. కేవలము శవాకారమై యుండు మతము నూరేగించుచుండిరి. కళావిహీనమై యున్న దైవవిగ్రహమును బూజించిన నెంత లాభమో ప్రాణముల గోల్పోయిన మతమును గౌరవించుటయు నంతియే యనియెరుంగుము. దేశోద్ధారకులగు పురుషులు మతమందలి లోపముల సవరించుటకు బూనునెడల బాగుండెడిది. అది తెలియక మతసిద్ధాంతములనే రూపుమాప యత్నించువారు కొందరును, అసలు మతమే కూడ దనువారు మరికొందరును లేచిరి. ఈ సమయమున మతాభిమానులు జ్ఞాననేత్రముల దెరచి వేదశాస్త్రముల ప్రమాణముగ గైకొని తద్విరుద్ధములగు దురాచారముల ఖండింప నతివేగముగ యత్నింపవలెను. కర్మమో, గ్రహచారమో కాని వారికి బుద్ధి పుట్టకుండెను. శాస్త్రీయమైన సంస్కార మనినను గిట్టదు. అంధపరంపరా ప్రవాహమున మునుగుటయే వీరి అలవాటు. గంత కట్టిన యెద్దులవలె గుడ్డిగా నడచుచుందురు. ఈ యిరువురు తమలోపముల నే నాడు సరిజేయగలరో ఆ దినమే భారతదేశ సౌభాగ్యమునకు బునియాది. సోదరా! బాగుగ వినుము. మత మొక్కటే స్వాతంత్ర్యభంగ మొనర్చునది కాదు. రాజ్యము, వైద్యము, విద్య, ఉద్యోగము, మున్నగువానిలో స్వాతంత్ర్య ముండెనా? ఉన్నచో సరే. లేనియెడల వానిని విడుతురా? చూతము.

1. మతము నెగురగొట్టినపిమ్మట చేయవలసిన దేమిటి?

సుఖసంపాదనముకదా! అది యెటుల కల్గును? రాజ్యముచే లభించు నని కొందరందురు. స్వరాజ్య ముండు దేశములలో ప్రజలకు దుఃఖములు లేవా? ఉరిశిక్షలు, జైలుబాధలు, ఉద్యోగములనుండి డిస్‌మిస్సులు, పరీక్షలలో తప్పిపోవుటలు, ఎంత చదివినను నిరుద్యోగ సమస్యలు మొదలగు బాధలు లేకుండెనా? పైవారికి క్రిందివారు లోబడరా! అపుడు స్వాతంత్ర్య మేమయ్యెను. రాజ్యమున్నయెడల నందు శాసనము లుండవా? అవి మానవ నిర్మితములు కావా? వాని నంగీకరింపనివా రెందరుండరు. వారి గతియేమి? శిక్షకు పాత్రులగుటయేకదా! ఇక స్వాతంత్ర్య మెక్కడిది? కొందరేర్పరచిన చట్టములకు మిగిలినవారు లోబడవలసిన పనియేమి? దీనింబట్టి రాజ్యమందును, స్వాతంత్ర్య భంగకరము లగు పను లున్నవనక తప్పదు.

(2) రాజ్యవిషయ మటుంచి యారోగ్య పద్ధతుల గమనింతము. నూటికి తొంబదితొమ్మిదిమంది రోగగ్రస్తులై యుందురు. అందుకు హేతు వేమి?

ఏయే యింద్రియము లేయే విషయముల గోరుచున్నవో వాని నాయా యింద్రియముల కర్పించుటచే రోగములు కలుగును. ఆ బాధనుండి తప్పించుకొనుటకు వైద్యమును శరణు జొచ్చెదరు. అందలి శాసనములు వినుము. "ఓయీ! నీ యిష్టము వచ్చినట్లు తినకుము. ఎయ్యది ఎక్కువ రుచిని కలిగించునో దాని నధికముగ వాడకుము. కాల నియమమును పాటించి కార్యముల జేయుము. శరీరతత్వము

ననుసరించి యాహారపదార్థముల నిర్ణయించుకొనుము. స్త్రీలతో విశేషముగ సంగమించకుము. అని యెన్నియో విధముల స్వేచ్ఛా విహారమును బంధింపుచున్నవి. ఇక స్వాతంత్ర్య మెక్కడనో తెలుపుము.

(3) మనుజులకు విద్య యవసర మని యెల్ల రంగీక రింతురు. అది లేనిచో సౌఖ్య ముండ దని వారి సిద్ధాంతము. అందులకై బాలురను పాఠశాలకు బంపుదురు. అయితే పిల్లలు సహజముగ నాడుకొనుచుందురు. అటుల సంచరించినగాని తృప్తియుండదు. బడిలో చదువుకొనుట జైలు వంటిదిగ నుండును. స్వేచ్ఛగా నటు నిటు తిరుగు బాలురను బండ కొయ్యవంటి బడియందుంచి చదువు చెప్పుట దుఃఖకరము కాదా! ఈ నియమములు మానవజాతికి స్వభావ విరుద్ధము లని యెవ రెరుంగరు. ఇటుల పసిపిల్లలను బాధించి విద్యను వ్యాపింప జేయు టెందుకు! ఇక ముం దెప్పుడో లాభముండు నని కదా! ప్రస్తుత మెంత దుఃఖ ముండునో అందు రాబోవు కాలమున సుఖము కలుగు నని తెలియుము. ఇక స్వాతంత్ర్య మెక్కడ?

(4) నౌకర్లు తమ యజమానులకు లోబడి స్వేచ్ఛా హీనులై చరించుచుండిరి. సుఖము, సుఖము, అని కలవరించు వారు పూర్ణముగ సుఖభోక్త లగుచుండిరా ? లేదు. దేహాభి మానరహితుడై ఇల్లు వాకిలి విడిచిన యొక మహాత్ముడు సంపూర్ణ సుఖియై యుండగలడు. తదితరు లెల్లరకు సుఖము లేదు. ఎనుబది లక్షల జాతిభేదములు గల పశుపక్ష్యాది జీవ రాసులు కొంతవరకు స్వాతంత్ర్య మనుభవింపగ లవు. ఎందుకన

వానికి పై యధికారు లుండరు. రాజకీయముగ గాని, వైద్య రూపమున గాని, మతనియమములచేగాని శిక్షించువారు లేరు. మానవ సాంగత్యమును బొందిన పశ్వాదులకు వారి ధర్మముల ననుసరించి కొంతవరకు స్వాతంత్ర్యభంగము కలుగ వచ్చును. అంతియే కాని, స్వతస్సిద్ధముగ నరణ్యముల జరించు జంతువుల కెంతమాత్రము బానిసత్వము లేదు. దాంపత్య సుఖమనుభవింప వలె నన్న నెట్టి నిర్బంధము లుండవు. తల్లి తన కొడుకుతో తండ్రి తన కూతురుతో, చరించి సుఖింపవచ్చును. కోరినటుల సుఖింప దలచుచో శాసనము లెవ్వియు పశువుల బంధింపలేవు. ఎందుకన, నాజాతి స్వేచ్ఛగ విహరించుటకే జనించెను. మనుజులొక్కరే స్వాతంత్ర్య హీనులు. అధికారుల శాసనములు, వైద్యనియమములు, యజమానుని యాజ్ఞలు, ఉపాధ్యాయుల నిర్బంధములు, మున్నగు వానివలన దాసానుదాసులై వర్తింపుచుందురు. ఈ దాస్యము లన్నియు నిష్టము లయ్యెనా? ఇక మతదాస్యమునుండి మాత్రము విముక్తి కావలెనా? ఇది యెట్టి వెర్రి.

మత మనునది నిన్న మొన్న వచ్చిన దైనచో పైవాదమునకు గొంత బల ముండవచ్చును. సృష్ట్యాదినుండి నేటివరకు దేశముల రక్షించిన దీ మతమే. నేడు ప్రపంచమం దన్నిఖండముల బాలించుచున్న క్రైస్తవ రాజ్యమునకు బునాది యెద్ది? ఏనాడో క్రీస్తుగారు చంపబడినపుడు వారి శిష్యులు వేసిన పన్నాగమేకదా నేటికి తాండవించుచున్నది. తమ గురువుగారిని చంపిన ప్రభుత్వ మిక ప్రపంచమున నుండరా దనియు

క్రైస్తవ మతస్థుడే ప్రభువై రాజ్యపాలన మొనర్పవలెననియు ప్రతిజ్ఞబూని క్రమముగ సైన్యముల సిద్ధపరచి యామతా వేశ బలముచే పూర్వరాజ్యమును మసిజేసి క్రైస్తవుని సింహాస నమునం దుంచిరి. అది మొదలు నేటివరకు వారు రాజ్య మేలు చుండిరి. మహమ్మదీయ రాజ్యము సయితము యిటులనే స్థాపింప బడెను. బౌద్ధరాజ్యముకూడ బుద్ధమతప్రాబల్యముచే నెల కొల్పబడెను.

మతము ప్రకృతి విరుద్ధమైనచో హిందూదేశమున 195 కోట్ల వత్సరములనుండి జీవింపగలదా? పాశ్చాత్య దేశములలో 6000 వత్సరములనుండి మతము రాణించుచుండెనే.

హిందూదేశము 195 కోట్ల వత్సరముల క్రిందట పుట్టెనని రాబోవు గ్రంథములలో వివరింపబడును.

రాజ్యములు సంఘములు తారుమా రగుచున్నను మత ములు మారెనా? ఒకానొకసమయమున మతముయొక్క బాహ్యచిహ్నములు మారినను అందలి మూలసూత్రములు సర్వవ్యాపకములై యుండవా?

ఈ నడుమ రష్యాదేశమున నూతనరాజ్యాంగ మేర్పడి నను మతప్రకారము భగవద్ధ్యానము సేయకూడ దని శాసింప గల్గిరా!

క్రైస్తవదేవాలయములు, మహమ్మదీయుల మసీదులు ఏ పాఠశాలలక్రిందనో ఫ్యాక్టరీలకొరకో వినియోగింపబడినను అవి బాహ్యమునకు మారువేషమును ధరించి హృదయమంది రములలో దైవధ్యానమునకు చోటిచ్చి పూర్వముకంటె

నూతనోత్సాహమున దైవధ్యానమును నడిపించు చుండలేదా. కనుక నే ఆ దేశమున ప్రజలందు వికాసము హెచ్చుచుండెను.

ప్రాణములేని దేహము ప్రభువు లేని రాజ్యము ఎటుల నిరర్థకములో అటులనే మతము లేని మానవసంఘము నిష్ప్రయోజన మని యెరుంగుము. నియమబద్ధతలేని జీవయాత్ర తాత్కాలికముగ సుఖప్రదమై గోచరించినను అయ్యది పరిణామకాలమున వినాశహేతు వని వివేకులు గ్రహింతురు.

కావున మతముపై దాడివెడలకుము. ప్రతి యుద్యమమున కొన్ని కష్టము లున్నవి. స్వరాజ్యసిద్ధికై యేర్పడిన కాంగ్రెసునందు కష్టములు లేవా! అది నియమబద్ధమై యుండక స్వేచ్ఛామయమై యున్నదా! ఎన్ని కఠినపరీక్షలకు లోనై కాంగ్రెసులో జేరవలెనో తెలియుము. దారిద్ర్యము ననుభవించి, ప్రాణముల బరిత్యజించి, యుద్యోగముల నిరసించి, లాటీ దెబ్బలచే అంగవైకల్యముం బొంది, జైలునందుండి భార్యా పుత్రాదుల విసర్జించి ప్రతి క్షణమున మృత్యుముఖాగ్నిగుండమున నాహుతి యగుటకు సిద్ధపడినగాని యా యుద్యమమున జేర రాదు. ఇక స్వాతంత్ర్య మెక్కడనో యూహింపుము. ఆ స్వరాజ్యము వీరి తరములోనే వచ్చు నని ప్రమాణము కలదా? ఈ లోపల నెందరు మరణించ లేదు. ఇక మరెందరు స్వర్గపురి చేరరు. అప్పటికైనను వచ్చునో రాదో గట్టిగ జెప్పజాలము. మొత్తముమీద వీరి బిడ్డలకో, మనుమలకో, మునిమనుమలకో రావచ్చును. ఒకవేళ యిప్పుడే వచ్చునేమో యెవ రెరుంగుదురు. ఇంతకును సారాంశ మేమి?

ఎందుకై యొక యుద్యమమున జేరితిమో అది సిద్ధించు లోపల సుఖ మని గాని, స్వాతంత్ర్య మనిగాని యనుభవింప నెంచరాదు. దుఃఖమునకు- దాస్యమునకు- లోనై కష్టముల కోర్చి నియమబద్ధుడై చరింపవలెను. పిమ్మట నెపుడో యొక జన్మమున కోర్కెలు తీరగలవు.

ఇక మత మనునది బయలు దేరిన దెందుకో తెలిసి కొందము.

ఆత్మరాజ్యమున కని తెలియుము. అనగా నర్థ మేమి ?

నిత్యానందము, చిరంజీవిత్వము, సర్వజ్ఞత్వము, సంపూర్ణ స్వాతంత్ర్యము, నిరోగత్వము

ఇవియే మోక్షరాజ్య మందలి సుఖములు. దీనినే ఆత్మ సామ్రాజ్య మందురు. ఇహలోక రాజ్యమును సాధించుట కెన్ని కష్టము లనుభవించవలెనో! అంతకంటె నధిక బాధలు పరలోక రాజ్యాక్రమణముకై యుండవా ? స్వరాజ్యసిద్ధి కలిగిననాడు కాంగ్రెసుతో నెటుల పని యుండదో, ఆ యగ్ని పరీక్షలతో నిమిత్తము లేకుండునో అటులనే మోక్ష మబ్బిన నాడు మతనియమముల ధిక్కరింపవచ్చును. అంతవరకు మతమును నిరసింపకుము. మతిలేనినాడు మతము శూన్య మగును. మతి లేకపోవుట యెపుడు ?

(1) మతి చెడినయెడల పిచ్చి యెత్తును. అపుడు మత నియమము లుండవు.

(2) భగవద్ధ్యానమువలన మనస్సు క్రమముగ నాత్మలో లీన మగును.

అపుడు మత నియమములతో పని లేదు. నీ కట్టిదశ ప్రాప్తిం చెనా? ధన్యుడవు. మతమే కాదు. రాజ్యము, వైద్యము' ఉద్యోగము మొదలగున వన్నియు ననవసరము. అట్టి ముక్తి మార్గము తెలియ దేని మతము విడువకుము. విడుతువా పిచ్చి వాడ వని తేలును. ముక్తులైనవారు సయితము పిచ్చివారివలె నటింతురు.

"బాలోన్మత్త పిశాచవత్"

అని ముక్తిలక్షణమున గలదు. ఉన్మత్తులన పిచ్చివారే సుమా! చూచితివా! మతావశ్యకత! అందు నియమము లేకుండు టెట్లో తెలుపుము. అట్టి మతములో వితంతువులకు పునర్వివాహము విధింపబడ లేదు. ఈ నియమము బాధాకర మైనను భరింపవలెను.

ఇందు కొక దృష్టాంతమును వినుము?

ఒకనికి వివాహమై గర్భాధానము కాకుండెను. ఎందు కన నతనిభార్య సమర్తాడ లేదు. ఇట్లుండ నతనికి ప్రతిదినము స్వప్నమున వీర్యనష్ట మగుచుండెను. అందువలన బుద్ధిమాంద్య మేర్పడి సోమరితన మధిక మయ్యెను. చికిత్సకై వైద్యుల నడు గగా సరియైన మందులే దనియు భార్య సంసారమునకు వచ్చే నేని రోగము నశించుననియు తెల్పిరి. అంతవరకు తన గతి యేమని మరల ప్రశ్నించెను. భార్య వచ్చువరకు ఎవతెనో యొక స్త్రీని చూచుకొను మని ప్రత్యుత్తర మిచ్చిరి. అతడటు లొనర్చి రోగమును పోగొట్టుకొనెను. వైద్యులిచ్చిన సలహాలవల్ల నతని కష్టము తొలగెననుట సత్యము. కావున పరోపకార

మొనర్చిరని తలచి యీ వైద్యుల శ్లాఘింతుమా! అటుల నెన్నటికి నంగీకరింపము. ఇందుకు కారణము లేకపో లేదు.

ఒక కష్టమును తొలగించుట మానవ ధర్మము కాదు. ఆ పద్ధతి నీతివంతమై, ధర్మబద్ధముగ నుండవలెను.

ఒకని కుపకారము జరిగినను అది పరుల కపకారముగా నున్నయెడల వివేకు లా పద్ధతిని మన్నింపరు. సర్వశ్రేయస్కరమై యొప్పునదే నిజమైన ధర్మము. వీర్యనష్టముగల పురుషుడు పరస్త్రీని జెరచినగాని యతఁ డారోగ్యమును పొందడయ్యె. ఆ పద్ధతి క్షేమకరమైనను వ్యభిచార మొనర్చుటగొప్ప నేరమగును. కావున నొకరికి మేలొనగూర్చ పనులైనను శాస్త్రదూషితము లగునేని వానిని బుద్ధిమంతులు మెచ్చరు. విధవాస్త్రీలకు పునర్వివాహములు కూడవని శాస్త్రములు తెలిపినందున వారికి మేలొనర్చుటకు తిరిగి పెండ్లిసేయుడని బోధించు పద్ధతి పై వైద్యుల సలహావలె నీతిలేని దగుచున్నది. వైద్యశాస్త్రమున సంపూర్ణపరిజ్ఞ లేనందున వ్యభిచరింపు మని బోధించిన వైద్యులవలె వితంతువుల బాధలణగుటకు వివాహము లొనర్పుడని సంఘసంస్కారులు తెల్పుదురు. స్ఖలనజాడ్యము గలవారిని వ్యభిచరింపుమని చెప్పుటకంటె మార్గాంతరము లేదా!

(1) శరీరతత్వ మెరింగి దివ్యౌషధముల నొసంగ వచ్చును.

(2) దానికి తోడుగా దంపుడుబియ్యముతో నన్నము వండించవలెను.

(3) అదియు కుండయందే వండుట మంచిది.

(4) స్నానపానాదులకు నదీజలము నుపయోగింప నగును.

(5) అత్యల్పముగ ఉప్పు, కారము, పులుసు తినుచుండ వలెను.

(6) మంచిగాలి వెలుతురు గల ప్రదేశములలో చరించు చుండవలెను.

(7) సత్సాంగత్య మొనర్చుటమేలు.

(8) విరేచన బద్ధము లేకుండ జూచుకొనవలెను.

(9) మితాహారియై యుండుట ముఖ్యము. యోగిపుంగవులీజాడ్యమునకు మరియొక చికిత్స గావింతురు. షట్కర్మలనిగలవు. వాని నభ్యసించిన యెడల చిత్తచాంచల్యము, స్ఖలనజాడ్యము, మొదలగునవి పోవునని వారి యుపదేశములలో నుండెను.

ఇట్టి పద్ధతు లెన్నియో యలరారుచుండ వానిని లెక్కింపక వ్యభిచరింపుమని బోధించు టెంత యవివేకమో గ్రహింపుము. వితంతువులను సక్రమమార్గమందుంచ జాలక నెవనికో యొకని కంటగట్టిన బాగుండు ననుటయు నటులనే యుండును.

అనార్యుడు—

సమర్తాడిన పిమ్మట స్త్రీలకు కామాగ్ని పొడసూపు ననియు, ఆలోపల పెండ్లాడని యెడల వ్యభిచరింతు రనియు, అందువలన దుస్సంతతి గలుగు ననియు, దేహములు రోగముల పాలగు ననియు సెలవిచ్చితిరి. అందుగొంత సత్య ముండ

వచ్చును. కాని గురుకులముల నిర్మించి బాల్యము నుండి స్త్రీలను విద్యావతులుగ నొనర్చిన యెడల దుర్నీతికి పాల్పడరు. ఇక దోష మేమి?

ఆర్యుడు —

ఓయీ! కామాంధత యనుమాట వినియుందువు. అనగా కామము గ్రుడ్డిది. (Love is blind) అని యాంగ్ల భాషలో నొక సామెత గలదు. దీని భావమేమి? కామము గల్గినపుడు స్త్రీగాని, పురుషుడుగాని, జ్ఞాననేత్రమును పోగొట్టుకొని అజ్ఞానాంధకారమున మునుగుచుండు నని యర్థము. సాధారణముగ నెట్టి జ్ఞానమైనను కామమునకు లొంగవలసిన దే. ఎట్లన ఆకలముల దినుచు నరణ్యములో తప మొనర్చు విశ్వామిత్రాదిమహామునులునై తము కామదాసులైరి. ఇట్లుండ చిన్నతనమునుండి నెయ్యి, పాలు, పెరుగు మున్నగువాని నిష్టము వచ్చినటుల మెక్కుచుండు యువతులు కామాగ్ని జ్వాలలకు తాళగలరా! విద్యవచ్చిన మాత్రమున కామమును జయింపగల రనుట ప్రకృతి విరుద్ధము. తెలియనివారికి తెలుపవచ్చును గాని, తెలిసి తెలియని తెలివిగలవారికి తెలియజెప్పుట తెలియకున్నది.

రావణుడు, దుర్యోధనుడు, హిరణ్యాకశిపుడు, శిశుపాలుడు, కంసుడు, కీచకుడు మున్నగు ప్రముఖులు, విద్యావిహీనులు కారు. అయినను వారి విద్య కామాగ్ని నణపగలైనా? పాండిత్యము కామమును జయింపగలదని యొకవేళ వాదమున నంగీకరించినను అదెంతవఱకు సాధ్యమో గమనింతము. గురు

కులముల నిర్మించి ముందుగ స్త్రీల కెల్లరకు విద్యాభ్యాస మొనర్పవలెను. ఈ ప్రభుత్వము పురుషులకే విద్య జెప్పింపలేని దురవస్థలో నున్నపుడు స్త్రీ లెల్లరిని విద్యావతులుగ నొనర్ప గల్గదా! అటులజేసిన నాడుకదా, సమర్తాడిన పిమ్మట పెండ్లి చేయవలె నని పట్టుబట్టుట.

అనార్యుడు—

మహాత్మా! ఎల్లరకు విద్యలేకున్నను కొందరైనను విద్యావతులు లేకపోలేదు. అట్టివారికి సమర్తాడిన పిమ్మట పెండ్లి సేయుట కభ్యంతర మేమి!

ఆర్యుడు—

మిత్రమా! సమర్తాడిన పిమ్మటనే విద్యావతులకు పెండ్లిచేయుదురుగాక. అటు లొనర్చుకొను వారిని వలదని బంధించు రాజశాసనములు లేవే. అట్లుండ విద్యలేని బాలికలకు సైతము సమర్తాడిన పిమ్మట పెండ్లిచేయవలె నని శాసనము లొనర్చి రేమి. అటుల బలవంత పెట్టికదా "శారదాబిల్లును" ప్రవేశపెట్టిరి. ఇది యెంత యజ్ఞాన విలసితమో చూడుము.

అనార్యుడు—

అయ్యా! శారదాబిల్లులో, లోపము లున్నమాట సత్యము. స్త్రీ లెల్లరు విద్యావతు లైనచో నీడు వచ్చిన స్త్రీలకు వివాహము లొనర్పవచ్చును. ఏనాటి కైనను స్వరాజ్యము సిద్ధింపక పోదు. అపుడు స్త్రీ లెల్లరకు నిర్బంధవిద్య ప్రారంభ మగును. అంతట విద్యావతు లయ్యెదరు. అప్పటి కైనను యువతీ వివాహములు ప్రఖ్యాతి గాంచవా?

ఆర్యుడు—

మిత్రమా ! నా భావము నీ కర్థమైనటుల లేదు. అడవులలో కందమూలముల దిని జీవించు మహర్షులు సైతము ఏకాంతమున్న స్త్రీలను జూచి కామపీడితు లైరని తెల్పియుంటిని. దానిని మఱచితివి. ఒకింత కాలము వాదముకై యంగీకరించిన విషయమును ప్రమాణ మనుకొని విద్యావతులు దుష్ప్రవర్తన మొనర్తు రని నిశ్చయించితివి. ఇది వెర్రితనము. ఇంత యేల విద్య యున్నను, లేకున్నను ఘోషా పద్ధతి గల యంతఃపుర నివాసినులకు దప్ప తదితర స్త్రీలకు బాల్య వివాహములే శ్రేయోదాయకములు.

అనార్యుడు—

ఆర్యమహాశయా ! పురుషుల కంటె స్త్రీలకు కామ మెక్కు వగుటచే దానిని తగ్గించుటకు బాల్య వివాహములు ముఖ్యము లని చెప్పితిరి. మరియు నా వివాహములవలన భర్త యెడల భయభక్తులు కలుగు ననియు, తనూ్మలమున కామోద్రేకము తగ్గు ననియు సెలవిచ్చితిరి.

ఇన్నిటికి మూలసూత్ర మేమి ! స్త్రీ—తన పతిని దైవముగ భావింప వలె నని తేలుచున్నది. ఇది నిజమైనయెడల పురుషులు స్త్రీల నణగద్రొక్కుటకై ధర్మశాస్త్రములు కల్పించిరని స్పష్టమగు చున్నది.

జగత్కర్త యగు భగవాను డెన్నిలోకములనో సృజించి సర్వశక్తుడై యుండ నట్టి మహాత్మునితో నొక పురుషుని సరి పోల్చి వానిని దైవముగ భావింపు మనుట నేరము కాదా !

ఆర్యుడు—

నాయనా ! నీ ప్రశ్న జ్ఞాన శూన్యముగ నున్నది. స్త్రీల నణగద్రొక్కుట సత్యమేని దేవాలయములలో పురుషు డొనర్చు పను లెవ్వి ? దేవుని ప్రార్థించుటయేకదా ? తానే దేవుడైనయెడల తన్ను రక్షింపు మని యింకొకని ధ్యానించు టెందుకు ! దీనింబట్టి యతడు దేవు డనబడడు. వానికిని వేరే దేవు డుండెను. ఆ మహాత్ముడు సర్వవ్యాపకుం డని ప్రతి హిందువునకును దెలియును. అయినను అతనిని విగ్రహ రూప మున పూజించుచున్నాడు. అటుగాక గుడిలోని రాయి నిజ మైన దేవు డని తలచెనేని దానిని పూజించుటంబట్టి యా రాతికి తాను దాసుడైనట్లగును. అపుడు పురుషు లెల్లరు రాళ్ళచే నణగ ద్రొక్కబడి రని స్పష్టమగును. ఇట్టి దురవస్థను తెచ్చి పెట్టుకొనిన దెవరు ! పురుషులే కదా !

స్త్రీల నొక్కరినే యణగద్రొక్కుటకు యత్నించినచో నందు కొంత సత్య ముండవచ్చును. తాముకూడా రాళ్ళచే నణగ ద్రొక్కించుకొనిరి. విమర్శింపగా నిం దేద్దియో యొక రహస్య ముండును. అంతియేకాని నీ వనుకొన్నట్లు స్త్రీలపై కఠినచర్యలను వహించి రని తలప రాదు. దేవుడు సర్వాంత ర్యామి యని యెరింగియు నాతని ధ్యానించుటకు త్రోవ లేక జగత్స్వరూపమును జూచి యా మహాత్ముని జ్ఞప్తికిం దెచ్చు కొని భజించుచున్నారు.

భయంకరారణ్యములు మహ త్తరమగు పర్వతాగ్రములు తరంగములచే నల్లకల్లోల మగు సముద్రములు, సూర్యచంద్ర

నక్షత్రాది జ్యోతిర్గణములు, మున్నగువానిని దర్శించినపుడే భగవానుడు జ్ఞప్తికి వచ్చుననుట సత్యము. నిరాకారు డగు పరమేశ్వరుని స్మరింపవలె ననిన, నేత్రగోచరంబగు సాకార రూపములకంటె వేరొండు త్రోవ లేదు.

ఆసముద్రములు, పర్వతములు, అరణ్యములు, ప్రతిచోటున లభించునా! కావుననే యేదో యొక జగద్వస్తువును గుర్తించి దైవధ్యానమొనర్చునట్టి పద్ధతి పూర్వులు నిర్ణయించిరి. ఆ విధానమే విగ్రహారాధన మనబడును. మరియొక యుదాహరణము వినుము. నీ వొక గురువుకడ బాల్యమున జదివియుందువు. అతనిని జూచినపుడు నమస్కరించి యుంటివి. కొంతకాలమున కతడు మరణించెను. గురుదర్శనముకై వెళ్ళితి వనుకొనుము. ఆ శవము, నొక కుర్చీపై కూర్చుండబెట్టి ఫొటో తీయుచుండగా చూచితివి. స్కూలులో నమస్కరించినటుల నా శవమునకు దండమిడుదువా? అటుల జేయవు. కారణమేమి? అతనిలో నున్న యాత్మ లేచిపోయెను. అయితే నీవు నమస్కరించున దెవరికి? ఆత్మకా? లేక శరీరమునకా? ఆత్మకేకదా! అతడు జీవించియున్నపుడు నీ వొనర్చు నమస్కార మెవరికి. అదియు నాత్మకే. అయితే అతనియాత్మను గౌరవింపవలసియుండ దానిని పూజింపక శరీరమునకు నమస్కరించిన దెందుకు? దేహము నకు గాక ఆత్మకేయని చెప్పెదవా? అయితే దేహమును జూచినపుడు నమస్కరించు టెందుకని ప్రశ్నింతును. అపుడేమనెదవు? ఆత్మ యేపదార్థము (దేహము)న వ్యాపించెనో ఆ రూపమును జూచి యందున్న నిరాకారమును పూజించితి

నందువు. మంచిది, నీ మాటపై నీవు నిలువుము. అపుడు పురుషులకు విగ్రహారాధనము, స్త్రీలకు పతిసేవయు, నెందుకో తెలియును. అజ్ఞాను లీ రహస్యమును గుర్తింప జాలరు. ఎట్లన ! శిష్యుడు గురువుయొక్క యాత్మకు నమస్కరింపుచున్నను బాహ్యమునకు గోచరించునది దేహపూజ వలె నుంటచే నా శిష్యుని అవివేకిగా తలచి చర్మపూజాధురంధరు డని హేళన మొనర్తురు. శిష్యునియొక్కయాత్మ గురువుగారి యాత్మతో సంబంధించియున్నను దానిని లోకము గ్రహింపజాలదు. గురువుయొక్క విగ్రహమును ధ్యానించుచున్నాడని భ్రమింతురు. ఇట్టి యజ్ఞాన మంకురించుట జగత్స్వభావమై యున్నది. ఏమన, జగత్తు సయితము భ్రమమూలకము. భ్రమనశించినగాని ముక్తి కలుగదు. శతకోటి జన్మ సుకృతమునగాని యీ యజ్ఞాన మంతరించదు. ఆ నాటి భ్రమయే నీవంటివారి నావరించి నేడు విగ్రహారాధనము దూష్యమని పల్కించుచున్నది.

విగ్రహారాధన సిద్ధాంతము ననుసరించి స్త్రీల నుద్ధరించుటకు పురుషులు విగ్రహము లైరి. పురుషుల బాగుచేయుటకు శిలలు విగ్రహములయ్యెను. గృహమందలి పురుషవిగ్రహములుగాని, గుడిలోని శిలావిగ్రహములుగాని, వాస్తవమున దైవరూపములుగావు. అయితే యిక పూజించు టెందుకని సందియము కలుగును. గురువుయొక్క శరీరము ఆత్మ గాకున్నను అది యెటుల ఆత్మపూజకు సాధనమైనదో అటులనే

స్త్రీలవిషయమున పురుషపూజయు పురుషుల విషయమున శిలాపూజయు ఆత్మపూజయై యలరారుచున్నది.

అనగా నిరాకారధ్యానమునకు సాకారపూజయే ముఖ్య సాధన మనుట స్పష్టము. సాకారమును విడచి నిరాకారమును ధ్యానింప వచ్చునని నిశ్చయించినయెడల మన మిత్రుఁ డగు శిష్యుడు గురువుగారి యాత్మకు నమస్కరింప దలచి తా నెచ్చట తిరుగుచున్నను అతని దేహమును జూడకయే నమస్కరింప వచ్చును. ఒకపుడు గురువును దర్శించెనేని యతని దేహమునకు నమస్కరించుట జడపూజ యగునని తలచి దండ మిడక యుండవచ్చును. గురువుగా రది గాంచి పెద్దలను జూచి నపుడు నమస్కరింప వలె నని బోధింపగా

"అయ్యా! వాస్తవమున పూజింపవలసినది నిరాకార స్వరూప మగు తమ యాత్మకా! లేక దేహమునకా! ఆత్మకే గనుక నే నపుడపుడు తమ యాత్మను పూజింపుచుంటిని. ఇపు డీ దేహమునకు నమస్కరింపవలె ననిన మనసు రాకున్నది"

అని ప్రత్యుత్తర మొసంగును. వెంటనే శిక్షింపబడుట తప్ప ఫలితము వేరొండు కలుగదు. అట్లే విగ్రహారాధన మొనర్పక కేవల నిరాకారపూజ గావించువా రెల్లరు పరలోక సౌఖ్య మొందక అనేక కష్టముల ననుభవింపవలసి యుందురు. ప్రపంచాతీతులై యొప్పు వివేకులు కేవల మాత్మ పూజచే ధన్యులు కావచ్చును తదితరు లెల్లరు విధిగ విగ్రహారాధన మొనర్ప వలెను. కావున స్త్రీలు నిరాకారబ్రహ్మను నమస్క-

రింపదలచి తమ భర్తయొక్క శరీరమును సాధనముగ నేర్ప ఱచుకొని యతని మూలమున నిరాకార తత్త్వమును పూజించు చున్నారు. అట్లే పురుషులు సర్వాంతర్యామి యగు పరమేశ్వ రుని భజింప దలచి రాళ్ళను సాధనములుగ గైకొని అందుండు భగవత్తత్త్వమును భజింపుచున్నారు.

హైందవ విజ్ఞానమును గ్రహింపజాలక "స్త్రీల నణగ ద్రొక్కుటకై పురుషులు దేవతారూపు లై"రని ప్రగల్భ ములు పలుకకుము.

అనార్యుడు—

అయ్యా! స్త్రీలుగాని, పురుషులుగాని సర్వవ్యాపి యగు దేవుని మనస్సులో ధ్యానింపవలెనని నుడివితిరి. అది బాగుగనే యున్నది. పురుషు డెటుల శిలావిగ్రహమును సాధనముగా గైకొని దైవధ్యాన మొనర్చుచుండెనో అటులనే స్త్రీలు గూడ రాతివిగ్రహముల పూజింపవచ్చునే. చర్మధారు లగు పురుషుల భజింప నేల.

ఆర్యుడు—

మిత్రమా! అవుడపుడు స్త్రీలు సయితము విగ్రహ ముల పూజించుచుందురు. అయినను ప్రధానపూజ పతి సేవయై యున్నది. ఏమన! పురుషులకంటె స్త్రీలయందు మనోబలము తక్కువ. పురుషుల మనస్సు కఠినమైనది. స్త్రీలచిత్తము మృదువైనది. ఒకపని యొనర్చి తత్ఫల మపేక్షించుటలో పురుషులకంటె స్త్రీలు అత్యాతురత జూపుచుందురు. ఆశయు పురుషులకన్న స్త్రీలకు మెండు. ఫలము లభింపదేని విశేషముగ

దుఃఖింతురు. ఫలప్రదాతలు ప్రత్యక్షముగ లేకుందురేని తహతహ లాడుచు కుంగిపోవుదురు. విగ్రహముల యెదుట కూర్చొని దైవమును ధ్యానింపుచు ఓ పరాత్పరా! ధనమును అన్నమును, వస్త్రములను, ఆభరణములను, గృహములను ప్రసాదింపుము అని ప్రార్థించి వెంటనే యవి లభించెనో, లేదో యని వెదకుచుందురు. ఆ విగ్రహము పిడికెడన్నమైనను తెచ్చి పెట్టనందున క్రమముగా దైవభక్తిని విడతురు. ఈ కష్టము నుండి విడిబడుటకై పతిరూపమున దైవధ్యానము నిర్ణయింపబడెను. "ఓ దైవమా! నాకు ధన మొసంగుము" అని ప్రార్థించినయెడల పతివలన కొంతధన మబ్బును. ఇట్లే వస్త్రాభరణాదులు సైత మతనిమూలమున లభించును. మనోబలము సన్నగిలినపుడతడు దైవమువలె తోడ్పడి యుత్సాహవాక్యముల బోధించును. ఇన్ని పనులను రాళ్లు చేయజాలవు. శిలావిగ్రహములకంటె పురుష విగ్రహములు మేలౌన గూర్చుచుండ వారిని విడచి ప్రాణములేని రాతి బొమ్మలను భజించుటెందుకో తెలియకున్నది.

అనార్యుడు—

మహాశయా! భర్తృరూపమును సాధనముగ గైకొని దైవధ్యాన మొనర్పవలె నంటిరి. ఆ విధానము స్త్రీల పాలిటికి క్షేమ మగుగాక. భర్త యున్నచో సరే! అతడు మరణించెనేని యిక ధ్యాన మొనర్చుటకు సాధన మేది? వేరొకని వరించి యతని మూలమున భజింపవలె నన్న పునర్వివాహములు లేవంటిరి. ఇక వారి గతి యేమి!

ఆర్యుడు—

నాయనా! మనకు గోచరించు సంశయము లన్నిటిని హిందూమతము నివారింపగలదు. వేద సిద్ధాంతములపై ప్రశ్న వేసి జయింపగల ధీరు డీ ప్రపంచమున లేడు. ఏమన! హిందూ మతము ప్రభుమతమై యున్నది. దాని నాశ్రయించిన వారికి సాధ్యముగాని పనియుండదు. రెండవ దేవునివలె జగత్సృష్టిని సైతము జేయుటకు శక్తి గల్గును. విశ్వామిత్రుడు నూతన స్వర్గమును నిర్మింపలేదా! వసిష్ఠమహర్షి నిరాయుధుడై శత్రువులతో యుద్ధ మొనర్పలేదా! సీతామహాదేవి యగ్నిప్రవేశ మొనర్చి జీవింపలేదా! మార్కండేయులు అల్పాయుష్మంతుడయ్యు చిరంజీవియై యుండలేదా! అనసూయ త్రిమూర్తులను సైతము బాలురుగ నొనర్పలేదా. ఇంతయేల? జగద్విషయమున సయితము విమానాదియంత్రనిర్మాణ మొనర్చినది హిందువులుకారా! చంచలచిత్తులై యున్నంతవరకు హిందూ ధర్మములు బోధపడకపోవచ్చును. మతము లన్నిటిలో హిందూ మతము సర్వోత్కృష్ట మైన దని తలంతు వేని దానికి బునాది వివాహ ధర్మమని యెఱుంగుము. పునాది గట్టిగ నుండనిచో గృహ మెట్లు కూలునో - అటులే వివాహ పద్ధతులు ధర్మబద్ధములై యుండనిచో హైందవ జాతి నశించును. వివాహమునకు పాత్రిలు స్త్రీ పురుషు లిరువురే సుమా. వారిలో స్త్రీ ప్రధానపాత్రియై యున్నది. ఆమెను తపస్సంపన్నుడగు మునిపుంగవునితో సమానముగ నొనర్చుటకై హిందూ మతము యత్నించుచున్నది. అందుకు సాధనము పాతి

వ్రత్యధర్మ మని నిరూపించినది. పతివ్రతలైన హిందూ స్త్రీల యొక్క మహిమలు ఒకానొక సమయమున దేవునిసైతము మఱపింప గలవు. ఈ విధ మగు దృష్టితో స్త్రీ ధర్మముల జూచినపుడే అయ్యవి యెటుల నిర్మింప బడినవో బోధపడును. అంతవఱకు స్త్రీధర్మములు విమర్శనార్హములు కావు. పతివ్రత భర్తను చిరకాలము జీవింప జేయుటకై వ్రతము పూనుచున్నది. అతడు జీవించియుండగనే తాను మరణింప నెంచుచున్నది. మంగళ సూత్రమును గట్టిగ నుంచు కొని సుమంగలి యని ప్రఖ్యాతి గాంచుచున్నది. భర్త బహు కాలము జీవించి యున్నపుడే యామె సుమంగళి యగును. సౌమాంగల్యమును రక్షించు కొనుటకంటె హైందవ స్త్రీలకు వేరొండు ధర్మము లేదు. అందుకై విశ్వప్రయత్నము లొనర్తురు. పూర్వకాలపు హిందువు లీధర్మమును కాపాడుటకై ధర్మరాజ్య మును స్థాపించిరి. కోటికొక స్త్రీ, దౌర్భాగ్య వశమున వైధ వ్యము పొందినను దానికి కారణము పూర్వజన్మకృత మహా పాపమని నిశ్చయించు కొనును. పాపపరిహారమునకై బ్రహ్మ చర్యమును బూని జీవితాంతమువరకు భగవద్ధ్యాన నిమ గ్నయై కాలము గడపును. అసలు దుర్భరంబగు వైధవ్యము కలుగుటకు హేతువేమి! పురుషుడు, చిర కాలము జీవింపకుండు టయేకదా. ఇక్కాలమున పురుషు లెక్కువగ మరణించుటయు వితంతువుల సంఖ్యపెరుగుటయు కడుంగడు శోచనీయము. ఇందుకు కారణము స్త్రీ పురుషు లిరువురు మతధర్మములమంట గల్పుటయే యని యెఱుంగుము. రోగ మెచ్చటనో యెఱుం

గక వేరొకచోట చికిత్సజేయు వైద్యులవలె బయలుదేర నగు నా? మన తాత ముత్తాతలు నూరేండ్లు జీవించియుండ మనమల్ప కాలము బ్రతికి స్త్రీలకు వైధవ్యము నంటగట్టు టెందుకో తెలిసి కొనుము. ఈ నేర మొనర్చినదిగాక దీనికి తోడుగ వారిని మరల పెండ్లాడు డను టెంత యవివేకమో గ్రహింపుము. భగవంతుని రూపము గోచరింపకున్నను జగత్కుటుంబ మం దొకపదార్థమును జూచి దైవధ్యాన మొనర్చుచుంటిమా లేదా? అటులనే భర్తృరూపము కానరానున్నను అతని వంశమును దర్శించుచు నతని రూపమును జ్ఞప్తికిం దెచ్చు కొనుచు తనకాలమున దైవధ్యాన మొనర్చి తరింప వచ్చును. అంతియే గాని పునర్వివాహము లొనర్చుకొనరాదు.

# గృహరాజ్యము



## 6 వ భాగము



అనార్యుడు:—

మహాశయా! పురుషుడు దీర్ఘాయుష్మంతుడై యుండిన గాని స్త్రీలకు మాంగల్య సిద్ధి కలుగదు. అయితే అతడు దీర్ఘాయువును పొందుటెట్లు? మనోబలముచే నాయుష్యమును బెంచ వచ్చునని చెప్పినను అది అంతగా నమ్మదగినదిగ లేదు. ఉన్నచో నది యెటులనో తెలుపుడు.

ఆర్యుడు—మిత్రమా! మనకు తెలియని విషయముల దెలియ దలచినపుడు

"అతీంద్రియార్థ విజ్ఞానే ప్రమాణంశ్రుతి రేవహి॥"

వేదమే ప్రమాణమై యున్నది. దేవుడు, స్వర్గము, నరకము, మోక్షము ఇవి కలవని నీకెట్లు తెలిసెను. వేదమును నమ్మినపుడే కదా. అందేమి చెప్పబడెనో చూడుము.

"శతం జీవేమ శరద స్సపీరాః" (మంత్రము)

"మేము నూరువత్సరములు జీవింతుముగాక" యని ధ్యానించునటుల వేదము హెచ్చరించుచున్నది. ఆయుష్య

మెంత యుండిన నన్ని దినములే బ్రతుకుట సత్యమేని యీ ప్రార్థనతో పనియేమి ? కావున నాయుర్వృద్ధి జేసికొనవచ్చు నని స్పష్టమగుచున్నది.

మార్కండేయునకు పదునారేండ్లు వయస్సు లిఖింపబడి నను తపః ప్రభావమున చిరంజీవు డయ్యెనని వినియుండవా ? సత్యవంతు డను రాజు స్వల్పాయువు కలవాడయ్యు నతని భార్య యగు సావిత్రివలన దీర్ఘాయువును పొందలేదా ? మరణకాలము ప్రాప్తించకమునుపే అకాల మృత్యువును పొందినవారులేరా ? రాత్రికాలమున పెరుగు తినినయెడల నాయువు క్షీణించు ననియు పాలు త్రాగినపు డాయువు పెరుగుననియు వైద్య శాస్త్రమున లేదా ?

ఇంతకును మత రహస్యము లెరుంగని కొరత దేశమును పీల్చి పిప్పిచేయుచున్నది.

"Half knowledge is dangerous" స్వల్పజ్ఞానము అపాయకరమనుట నిక్కము. దేవున కనంతు డను పేరు కలదు. అతని ప్రజ్ఞయు ననంతముగ నుండును. వేదములు నయితము "అనంతా వై వేదాః"(కృష్ణయజుర్వేదం)అనంతములుగ నున్నవి. శాస్త్రము లన్ననో

"అనంతశాస్త్రం బహు వేదితవ్యం"

అనంతములు. ఇట్లుండ నం దెచ్చటనో యొక మూల కొన్ని శ్లోకముల జూచి సంశయించి వేద మతమును నిరసింప నగునా ? అది దైవ బోధిత మగుటచే సర్వజ్ఞత్వమును కలిగి యున్నదని యెరుంగుము. నీకు సంశయము కలుగవచ్చును.

కాని నీ మతము సంశయముల పుట్ట యని యెంచకు. నీమతమున సంశయమున్నటుల దోచెనేని వెంటనే యీ క్రింది విధముగ నాలోచింపుము.

"నేను హిందువుడను. లోకమున క్రైస్తవులు మహమ్మదీయులు బౌద్ధులు పారసీకులు మున్నగు వా రెందరో కలరు. వారికి మాత్రము మతము లేదా! వారి వేదములలోని విషయములన్నియు యుక్తి యుక్తములై స్వతస్సిద్ధములై యున్నవా? లేకున్నను వారు తమ మతముల నిందించుకొని భ్రష్టులగుట లేదే. ఈ దౌర్భాగ్యబుద్ధి నాకేల దాపురించెను. ఛీ. ఛీ. నేను దేశ ద్రోహిని. ఎందుకన నా తల్లి వ్యభిచరించెననియు నేను మాత్రము పరిశుద్ధుడ ననియు జెప్పిన నెట్లుండును? నామటుకు నేను సంతసించినను ప్రజలు నన్ను విశ్వసింతురా ?

అతనితల్లి వ్యభిచరించినయెడల నా గర్భమునుండి పుట్టిన నితడు "కులటాపుత్రుడు కాదా" యని ప్రశ్నింతురు. సూర్యునిపై నుమ్మివేసిన నది నాపైననే పడును. సర్వవిజ్ఞాన సంపన్నమైన నా మతము సూర్యభగవానునివలె నగ్రస్థాన మలంకరించెను. శాస్త్రజ్ఞుల నడిగి సందియము దీర్చుకొందును'' అని తర్కించుచుండవలెను. ప్రకృతము బ్రహ్మలిఖిత మగు నాయువును వృద్ధిపరచుటెట్లో తెలిసికొందము.

ఇరువదేండ్లు జీవించునటుల బ్రహ్మ లిఖితము కలదనుకొనుము. అట్టివా డధికముగ బ్రతుకుటెట్లో చూతము. సూర్యభగవానుడు తూర్పున నుదయించి క్రమముగా పడమటకు బోయి యచట నస్తమించి మరల మొదటితావునకు వచ్చును.

ఈ లోపలికాలమున కొక దిన మనిపేరు. జగద్వ్యవహారమున దిన ప్రమాణ మిటులున్నది. ఆపద్ధతి ననుసరించి యిన్నియేండ్లు బ్రతికితి మని తలంతుము. అయితే దేవు డేర్పరచిన యాయుష్యమునకును మనము తలంచు జీవితపరిమితికిని భేదముండెను. ఈ రహస్య మెరుంగనివా రెందరో కలరు. ఆభేద మెట్టిదో వినుము.

ఇరువ దేండ్లు జీవింపుడని మన నొసట వ్రాయబడినను ఆ పరిమితి మన మనుకొనినటుల లేదు. ఎందుకన - మనము వ్యవహరించు దినమునకును దేవునియుద్దేశ్యము ననుసరించిన దినమునకును వ్యత్యాసముండెను. అదియెట్లన-ముక్కు గుండావచ్చుచు పోవుచుండు గాలి 21600 పర్యాయములు నడిచెనేని అదియొక దినమని దేవునియుద్దేశ్యము. అట్టివి ముప్పదియైనయెడల నొక నెలయగును. ఆ నెలలు 12 గడచిన నొక వత్సరమగును. ఈ యేండ్లు ఇరువది యగువరకు జీవించునటుల దైవనిర్మాణ మేర్పడెను. మన దృష్టిలో సూర్యోదయము మొదలు మరల సూర్యోదయము వరకు నొకదినముగా నుండినను ఆలోపల సరిగా 21600 సార్లు గాలి నడచినకదా మానవ నిర్ణీతదినమునకును, దైవనిర్మిత దినమునకును సరిపోవును. ఇట్లెన్నడును జరుగదు. ఇక నాయుష్యము పెంచదలచినయెడల జేయదగిన పనియెద్ది ?

గాలిని వెలుపలకు విడువక కడుపునందే నిలుపునట్టి యభ్యాసమును అనగా ప్రాణాయామమును చేయవలెను. నిత్యమిటుల గాలిని బిగపట్టు చుండునెడల గొంతకాలమునకు శ్వాస

లను తన యిష్టము వచ్చినట్లెల్ల నడిపించు తెలివికల్గును. అంత ప్రతిదినము 21600 శ్వాసలు నడిపించుటకు బదులు ఏ పది వేల ఎనిమిదినూర్లో యగునట్లొనర్పవలెను. ఈ విధము రెండు రోజులు గడపుచో నప్పటికి 21600 శ్వాసలగును. మానవ వ్యవహారమందుండు రెండురోజులు దైవోద్దేశ్య ప్రకారమైన 21600 శ్వాసలుగల యొక్కదినమునకు సరిపోవును. ఈ విధముగ రెండేండ్లు శ్వాసలను బంధించుచుంటిమేని దైవనిర్మితంబగు నొక వత్సరమగును. ఒక యేడు జీవింపుమని దేవుడాజ్ఞాపింప దానినే రెండేండ్లుగా మార్చుకొననవకాశమేర్పడెను. కావున నిరువదేండ్లు బ్రహ్మలిఖితముండినను నలుబదేండ్లు బ్రతుకవచ్చును. అటులనే బ్రహ్మలిఖితమునకు భంగముకలుగకుండ నెన్నియేండ్లైనను జీవింపగలము. ఈ పద్ధతికి సరిపోవునటుల మరియొక విధముగ నాయువును బెంచవచ్చును. ఒక గురువుకడజేరి యుపన్యాసములో, హరికథలో, యుపదేశములో విన్నచుండునెడల మన ప్రయత్నములేకయే శ్వాసలవేగము సహజముగ తగ్గుచుండును. ఒకపుడు శ్వాసలు బంధింపబడుటయు తటస్థించును. అందువలన నాయుర్వృద్ధి కలుగును. కనుకనే పెద్దలను సేవించుటచే దీర్ఘాయువు లభించునని శాస్త్రములు వచించెను.

కుతంత్రము లొనర్చి పరుల బాధించినప్పుడో, వ్యభిచారవృత్తి బూనినపుడో, భయంకర కార్యము నొనర్చినపుడో, గుండె కొట్టునని యెరుంగుదుము. అపుడు శ్వాస లధికమగును. అట్టి రోజులలో 21600 నడుచుటకు బదులు రెట్టింపు జరుగ

వచ్చును. ఆకారణమున పై కృత్యములు సలుపువారు అర్ధా యుష్మంతులై చనెదరు.

ఈ విధముగ చేతులార ప్రాణముల గోల్పోయి, తమ భార్యలకు వైధవ్యము నంటగట్టి దుఃఖముల పాలుచేసెదరు. దుష్కృత్యము లన్నిటిలో స్త్రీసాంగత్యము మొదటిది. దాని వలననధికముగ శ్వాసలునడిచినట్లు మరియొకవిధముగ కలుగవు. విశ్వప్రయత్న మొనర్చి భార్యా సంగమము సయితము బహు నియమితముగ జరిపినగాని పురుషులకు ఆయుర్దాయముదక్కదు. నెలకొక్కసారియో రెండుసార్లో భార్యను పొందుటకు శాస్త్ర మవకాశ మొసంగెను. ఒకప్పుడొక నెలలో వీలు కలుగనే కలుగదు. భార్య గర్భిణిగా నున్నపుడు సంయోగము కూడదు. ఇట్టి నియమముల బాటింపక సంచరించు పురుషులను ముక్కు తాళ్ళు వేసి పట్టుటకు వారి భార్యలే యర్హులు. అటుల జేయలేని తమ గొయ్యి తాము త్రవ్వుకొనిన వారగుదురు. స్వేచ్ఛగ చరించు నీకాలమున విధవల సంఖ్య పెరుగుటకు కారణమిదియే.స్త్రీలకైనను తెలివియుండిన బాగుండును. పురుషు లకు బుద్ధి చెప్పిన నెంత మంచిది. కాని వారటుల జేయరు. వేషభాషలచే కులుకుచుండు పూబోణుల జూచి మోహించని పురుషు లుందురా! వంకరపాపటలు - పైపైకి బోవు రెవికలు - వయ్యారపు నడకలు - మిసిమిసి చూపులు - పురుషు లను వలలో వేసికొనుటకు మార్గములు కావా. ఈ యంద గత్తెలకు లోబడి నీతి నియమముల జెరచుకొనిన పురుషాధ ములకొక మగతనము కలదా. అయ్యో! మగతనమనగా

మాటిమాటికి స్త్రీని తృప్తిపరచుటయా! ఎంత దుర్గతి కల్గెను. ధీరుడన నెవడు? స్త్రీల నాశించి బ్రతుకువాడుకాడు. భార్యను చూచుసరికె పతివ్రతా స్వరూపిణిగా సిద్ధపరచిన మేటి యెవడో వాడే పురుషపుంగవుడు. తా నెటుల సొగసుగత్తెను జూచి యువ్విళ్ళూరుచుండునో అటుల నితరుడు తనధర్మపత్నినిజూచి యాశపడుననియెంచి శ్రోత్రియవేషమున నుంచగల దిట్టయే నిజమైన భర్త. పరమపురుషుని చూచినపు డెవ్వనిసతి బులాకీ చేతను నడిపాపటిచేతను మోచేతివరకుండు రెవికచేతను - నిండు వస్త్రముచేతను - హృదయపారిశుద్ధ్యముచేతను - తల్లిగా తోచబడునో ఆమెయొక్క పతియే సద్గృహస్థు.

సోదరా! నీ వెప్పటికైన నటుల జేయుము. నీవు నీ భార్యయందు జనించి వంశోద్ధారకుడ వయ్యెదవు. నీవు పెండ్లాడిన దెందుకు? నీవంటి పుత్రుని బడయుటకు. అది యెపుడు సిద్ధించును? స్త్రీ లోలుడవు కానపుడు. అంత నీశ్వరుడు వ్రాసిన వ్రాతను నయితము పెంచగల్గుదువు. నీ భార్య సుమంగలియై వర్ధిల్లును.

అనార్యుడు—

జాతకముల ననుసరించి స్త్రీ పురుషులకు పెండ్లి చేసిన యెడల వారి మనసులు కలిసి మెలసి వర్తించునని చెప్పితిరి. అయితే అటుల బరీక్షించు నెడల వారల కైకమత్యము కుదురు ననుట సత్యమేని బాల్య వివాహముల నే చేయవలసిన నిర్బంధ మేమి? యువతులైన పిమ్మట వివాహ మొనర్చినను తమ

భ ర్తలతో ననుకూలముగ నుండగలరు. ఇక యువతీ వివాహ ములవలన నష్టమేమి ?

ఆర్యుడు—

సోదరా ! ఒకనాడు వధూవరులు పెండ్లినాడు ఊరేగు చుండిరి. పల్లకీపై నుండు బొంగును చూచి యొకడాశ్చర్యమొంది. తన స్నేహితునిబిలచి "మిత్రమా! యీ బొంగు(వెదురు)మన కుపయోగించునటుల నిన్నివంకరులుగ తిరిగినదే. దానికి జ్ఞానము కలదా" యని ప్రశ్నించెను. అంత నాత డీ క్రింది విధముగ ప్రత్యుత్తర మొసంగెను.

"ఓయీ ! నీవు వెర్రివాడవు. మనుజులు తమ కవసర మని తలచి దానిని వంచిరి. ఇతర వృక్షముల వంచినను అటుల వంగవు. ఏమన, ఎటుల వంచిన నటులవంగునట్టి స్వభావమొక బొంగునకే కలదు. ఇది స్వభావసిద్ధము. కావున పల్లకికి తగి నటుల దానిని వంచి"రని చెప్పెను. ఈమర్మమెరిగి యా వెర్రివా డడవికేగి బొంగులున్న చోట నిలిచి యెటులనో కష్టించి యొకదానిని వంచుటకు యత్నించెను. అటుల నెన్నియో వెదురుగడలను క్రిందికి లాగియు నిష్ఫలు డయ్యెను. అంత తన మిత్రుని జేరి వెదురునందు స్వభావ సిద్ధముగ వంగునట్టి గుణ ముండుట నిజమేని యెన్ని బొంగులను వంచినను పల్లకి యొక్క బొంగువలె వంగకుండుటకు హేతువేమి ? యని యడిగెను. అంత నా యమాయకుని జూచి "ఓయీ! ప్రకృతి యందొక స్వభావ మున్నను అది ప్రకాశించుటకు మరికొన్ని ప్రకృతిధర్మములు సాయపడవలెను. అటుల తోడ్పడుటయు

నొక నియమమే యని యెరుంగుము. ఇందు కొక దృష్టాంత మొసంగెదను.

ఎండకాలమున సూర్యతాపము భరింపరానిదై యుండు నని మైసూరు దేశస్థునితో నొక గుంటూరువాసి యనెను. కాని యతడంగీకరింపడయ్యె. ఏమన, ఎండకాలమున వారి దేశమున వేడి లేదు. అయితే సూర్యుడు లేడా? ఉండెను. కాని యతని గుణము గుంటూరులో నొకవిధముగను మైసూరులో వేరొక రీతిగనుండునా? ఉండదు. ఇక రెండు దేశములలో నెండలు హెచ్చుతగ్గు లుండు హేతువేమి? గుంటూరునందలి ప్రకృతికిని, మైసూరులోని ప్రకృతికిని భేదముండెను. సూర్యతత్వము పై రెండు దేశములలో, నొక్కటిగ వ్యాపించినను సమాన ప్రకాశము కలదై యుండకుండెను. ఎందుకన, గుంటూరుకంటె మైసూరు ఎత్తైన భూమి. అట్టిచోటున సూర్యరశ్మి తన వేడిమిని ప్రదర్శింప జాలదు. కావున నొక వస్తువుయొక్క గుణము ప్రకాశించుటకు సయితము ఇతర సంపత్తి తోడ్పడవలె నని తెలియుచున్నది.

మరియొక యుదాహరణము వినుము. రాత్రి చీకటి యుండునని యొక డనెను. దానిని విని యొక యమాయకుడు సత్యము తెలియ దలచెను. పౌర్ణమినాడు పరీక్షించెను. కాని చీకటి లేకుండెను. రాత్రి చీకటిగనుండుట స్వభావ మైనను చంద్రుడు లేనపుడే యటుల గోచరించునని యత డెరుగడు.

సూర్యునకు స్వతస్సిద్ధ మగు వేడి యుండినను మెరక భూములు లేనపుడే తన వేడిమిని జూపగల డనియు రాత్రికి చీకటిగానుండు స్వభావముండినను చంద్రుడు లేనపుడే తనశక్తిని

జూపగలదనియు, బొంగుకు వంగునట్టి గుణమున్నను అదిలేతగా నున్నపుడే వంచబడు ననియు నెరుంగుము. కావున జాతకముల లోని గ్రిహములకు మైత్రి యున్నను ఆ స్నేహాము వ్యక్త మగుటకై తగిన పరిస్థితు లుండవలె నని తెలియుచున్నది. కనుక సమర్తాడక మునుపే అనగా లేతగా నున్నపుడే — స్త్రీలకు వివాహా మొనర్పవలె నని నిశ్చయింపుము.

అనార్యుడు—

మహాత్మా! స్త్రీలు పురుషులకు లోబడి యుండవలె నని తలచి బాల్య వివాహాముల సమర్థించిన ట్లున్నది. అందుకే చిన్నతనమునుండి పతియొక్క యాహారాదుల నభ్యసింపవలె నని విధించితిరి. అది న్యాయముగ లేదు. ఎందుకన—నితరు లకు లోబడు వారు సైతము తమ బాల్యము నుండి యజ మానులకడ జీవింపరైరి.

వినుము. ఒక డుద్యోగ మపేక్షించి యెటులనో యొక యధికారి నాశ్రియించి యతని కడ నౌకరికి కుదిరెను. అప్ప టికి ఇరువది లేక ముప్పది యేండ్లు వయసు వచ్చెను. అయి నను యజమానుని భావముల ననుసరించి వర్తించు చుండ లేదా? అటు లెందరో జీవితాంతము వరకు లోబడి నడుచు చుండిరి.

బాల్యమునుండి స్త్రీలోకనికడ పెరిగినగాని యతని భావ ములు పట్టుబడ వనరాదు. ఎందుకన నిరువదేండ్లుదాటి యీాడు ముదిరినవా రితరులకడ నౌకరి జేయుచున్నారు. ఇట్లుండ యువతులు సయితము పెండ్లాడి భర్తల ననుసరించి వర్తింపలేరా?

ఆర్యుడు-

మిత్రిమా ! నీ బుద్ధి మెచ్చతగినది. కాని యింకను సూక్ష్మముగ నాలోచింపుము. ఒకనికడ నౌకరికి కుదిరినను అతని సంబంధము సర్వసమర్పణరూపమై యుండదు. నియమింపబడిన కొన్నిపనులనే చేయవలసి యుండును. ఆ కార్యముల ముగించి యతనిని వదలి స్వేచ్ఛగ విహరింపవచ్చును. అతనితో మనసు కలియదేని నౌకరి మానుకొనుటకు సిద్ధపడును.

హైందవ స్త్రీలు అట్టి నౌకర్లవలె లేరు. యజమానుని కడ నుండదలచిన యెడల నతని నెదిరించి మాట్లాడుటకు నౌకర్లకు శక్తియుండదు. స్త్రీ లన్ననో అటులకాదు. పతి సమీపమున నుండదలచియు సమయము వచ్చేనేని యతనితో సమానముగ మాట్లాడగలరు. ఒకానొకప్పుడు వైరభావమును గూడ ప్రదర్శింపగలరు. ఒకపుడు పతిని ప్రభువుగను, దేవునిగను, పూజించుటయేగాక మరియొక సమయమున కీలుబొమ్మవలె నాడింతురు. సేవకుడు యజమానుని విడిచినటుల స్త్రీలు తమ భర్తల త్యజింపరు. పునర్జన్మమున నైతె మతనినే వరింతురు.

ఈబంధమును దృఢముగ నిలుపవలె నన్న నెన్ని నియమము లుండవలెనో యోచింపుము. అధికారి భుజించు పదార్థములనే సేవకుడు తినవలెనని నియమములేదు. మరియు నతని యాచారముల ననుష్ఠింప బనిలేదు. స్త్రీలవిషయ మటులకాదు. భర్త కెయ్యది యిష్టమో దానినే భుజింపవలెను. మరియు నతని పద్ధతు లభ్యసింపవలెను.

*(భార్యాభర్తల ప్రకృతులు వేరై యుండ నొకరివలె రెండవవారు భుజించుటెట్లో రాబోవు గ్రంథములలో జూడ నగును.)

ఈ పద్ధతి బాల్యవివాహముల వలనగాని సిద్ధింపదు. మరియొక దృష్టాంతము చూతుము. ఒకనికై యావజ్జీవితమును ధారవోయ దలచు స్త్రీగాని-పురుషుడుగాని బాల్యముననే యతనికి దత్తముకావలెను. అనగా దాన మొనర్పబడవలెను. కన్యాదానమును చూచుచున్నాము కాని, పురుషదానము కలదా యని సంశయింపకుము. ఒకవంశమున బిడ్డలు లేనియెడల నొకని పెంచుకొందురు. దీనినే దత్తత యను చుందుము. అతడు జీవితాంతమువరకు ధారవోయబడెను. అనగా దానముచేయబడెను. ఇది పురుషదానము కాదా? ఆ కుటుంబములో నెన్ని బాధలు కల్గినను ఆవంశమునుండి విడిబడడు. అటుల జేయదలచినను శాస్త్ర మంగీకరింపదు. అట్టి దత్తత బాల్యముననే జరుగునని నీ వెరుంగుదువు. ఎందుకన ఎముక ముదిరినచో నితరుల భావముల ననుసరించి వర్తింపజాలడు.

మరియొక రహస్యము కలదు. పెంపుడు బిడ్డలు తమ యధీన మగుటకై తలిదండ్రు లేమి చేయుదురో తెలియునా? ఏడెనిమిదేండ్ల యీడుగలవారిని పెంచుకొనుటకంటె నొకటి రెండేండ్ల వయసులోనే తమ యింట నుంచుకొనుట మేలని తలచి యటుల నొనర్తురు. ఈ యనుభవముచే నేర్పడగిన పాత మెద్దియో యోచింపుము. ఒకరి మనసు వేరొకరితో బూర్ణముగ గలియవలె నన్న బాల్యమే యుక్తమైనదని తెలియు

చున్నది. కావున పురుషదానమువలె కన్యాదానము సైతము చిన్నతనమున జరుగుటయే ప్రశస్తము.

అనార్యుడు—

అయ్యా! బాల్య వివాహములు శ్రేష్ఠము లైనను అందొక నష్టముకలదు. ఏమన—గర్భాధానమునకు పూర్వము గాని అటుపై నొకటి రెండేండ్లలోగాని భర్త మరణించిన యెడల వైధవ్య మేర్పడును.

ఇకవారి యౌవనము అడవిగాసిన వెన్నెలవలె నగును. అందువలన యువతీ వివాహములు మేలు కాదా ?

ఆర్యుడు—

ఓయీ! యువతియైన పిమ్మట పెండ్లాడినను ఒకటి రెండేండ్లలో భర్త మరణింపవచ్చును.అపుడు వారి గతి యేమి? కామమును జయించుట దుర్లభ మని యెంచి అడవిగాసిన వెన్నెలను పోల్చితివి. మంచిది.

యువతీ వివాహముల కనుజ్ఞ యున్నయెడల తగిన పురుషుడు లభింపలేదని తలచి పెండ్లికై త్వరపడరు. ఇటుల ముప్పదేండ్ల వరకు వివాహములు జరుగవు. అంతవరకు వారి యౌవనమునకు గతి యెద్దియో తెలుపుము. కామమును జయించగలరని యందువా? అయితే బాల వితంతువులు సైతము అటుల నుండగలరు.మరియు నీవు నుడివినదానిలో నొక లోపమున్నది. ఏమన - యువతులు ఉప్పు, పులుసు, కారముల దినుచు కామ జయమును పొందగలరనుట నమ్మతగదు. నడియీడుగల వితంతువులు వైధవ్య ధర్మము ననుసరించి చప్పిడి భుజించుచు

బ్రహ్మచర్య ధర్మమును వర్తింతురేని కామమును సులభముగ జయింపగలరు. తోట్టివైద్యమున నిపుణులగు యువతీమణులుగాని యువకులుగాని, ఉప్పుకారముల వర్జించుటంజేసి కామజయము సులభమని తెలుపు చున్నటుల వినుచున్నాము. ఆహార నియమ మున్నచో జితేంద్రియత్వము కష్టమైనదికాదు. ఈ కీలక మెరుంగనందున సంఘ సంస్కారప్రియులు విధవలగతి యేమని యడుగుచున్నారు. ఇనుపపెట్టెను తెరచుటకు గడ్డపార లుండినను ప్రయోజనములేదు. పెద్దపెద్ద ఇనుపఖడ్డీలచే తలుపును తెరువజాలక యీ పెట్టెను బ్రద్దలుగొట్టవచ్చునా ?

వితంతు వివాహపద్ధతి పై విధముగ నున్నది. చిన్ని తాళపుచెవి యుండెనేని యినుపపెట్టెను సులభముగ దీయ గలము. కామమును జయించుటకూడ నింతలోనున్నది.

అనార్యుడు—

మహాశయా ! అడవులలో కందమూలముల దినిన మునిపుంగవులు సయితము కామమును జయింపలేరని యిది వరకు తెల్పితిరి. ఇపుడు చప్పిడి తినుటచే కామజయము సులభ మగునని నుడివితిరి. ఇందు నిజమెద్ది ?

ఆర్యుడు—

ఓయీ ! నీవు తలచినటుల మునీశ్వరులు కామలోలురై యుండలేదు. వేలకొలది వత్సరములు జితేంద్రియులై తప మొనర్చిరి.

వారి జీవితాంతములో మొత్తమున నొకనాడు పొరపాటున కామోద్రేకము కల్గెను. దానిని నిత్యానైవేద్య మన

దగిన మన కామలోలతకు పోల్చకుము. పురుషజన్మ మెత్తి నందుకు వేలకొలది వత్సరములు జీవించిన కాలములో నొక నాడు జరిగిన నేరమును దృష్టాంతముగ గైకొనదగదు.

అనార్యుడు—

మహాశయా ! ఇక్కాలపు వితంతువులు స్వధర్మమును గుర్తించినటుల లేదు. కావున పరిశుద్ధలై యుండగలరా ?

ఆర్యుడు-

సోదరా ! ఏవ్యక్తియైనను ధర్మము నతిక్రమించి నడిచె నేని సంఘస్థు లెల్లరు కలిసి సభలొనర్చి తగిన కట్టు దిట్టము లొనర్పవలెను. ఈపని మన దేశమున జరుగలేదు. ఇది మహా పాతకమనవచ్చును. ఇట్టి యధమాధములు జనించుటచేత నే దేశమున కీ గతి పట్టినది. ధర్మబద్ధమగు సంస్కరణ మొనర్పని జాతి బ్రతికియు, జచ్చియు నొక్కటే. భారత దేశమున సంఘ సంస్కరణము జరుగవలెనన్న ప్రథమమున వితంతువుల ఘోష తప్పించవలసి యున్నది. అందుకై ఆశ్రమములు స్థాపించుట ముఖ్యము. నూరుపనులు విడిచి యీ పనిచేయదగినది.

అందు సాత్వికాహార పద్ధతులు, సత్కాలక్షేపములు జరుగుచుండవలెను. ప్రతిగ్రామమున నొకచోట నీయాశ్రమము నెలకొల్పబడిన నెంతయో మేలుకల్గును. ఆ యాశ్రమములో పురుషు లుండరాదు. అంతే వితంతువులఘోష తొలగును.

అనార్యుడు—

మహాశయా ! చిన్నతనమున పెండ్లిచేసిన యెడల భర్తల యాహార వ్యవహారముల నభ్యసింప వచ్చునని నుడివితిరి.

అది నిజమే కావచ్చును. కాని పెండ్లి యైనది మొదలు కాపు రమునకు బోవు వరకు పుట్టింట నుందురే! ఇక పతియొక్క భావముల గ్రహించుటకును—అతని యాచార వ్యవహార ముల నలవర్చు కొనుటకును—ఏ లెక్కడ ?

ఆర్యుడు—

మిత్రమా! గర్భాధాన మగువరకు బిడ్డను భర్తగా రింటికి పంప వలదని శాస్త్రమున లేదు. అయిదు రోజులు జరుగు పెండ్లి సయితము పుట్టింట జేయుడని కలదా ? కన్యను జలపూర్వకముగ దాన మొసగి అగ్ని ప్రతిష్ఠాపనము—మంగళ సూత్రధారణము—తలంబ్రాలు—పూర్తి గావించి వెంటనే అదే రోజున అనగా ప్రథమదివసముననే—అగ్నితో గూడ తన బిడ్డను అత్తవా రింటికి బంపవలె నని కలదు. మిగిలిన నాల్గు రోజుల కలాపము భర్తగా రింట జరుపవలె నని విధింప బడెను. అటు పిమ్మట భర్తృ గృహమున వసింపుచు నతని యాచారాదుల నభ్యసింప వలెను. పురుషు డెటుల బాల్య మున గురుకులమునకు బోయి యచట గురు శుశ్రూష చేయునో—అటుల నెనిమిదవ వత్సరము మొదలు రజస్వల యగు లోపల నొకని పెండ్లాడి యతని కడ వసించునటుల శాస్త్రము తెలిపెను. పురుషులకు వడుగు ఎటులనో స్త్రీలకు వివాహ మట్టిదని యెరుంగుము. కావున పురుషులయొక్క ఉప నయనసమయమే స్త్రీలకున్ను ఉపనయన కాల మగుచున్నదిం.

శ్లో॥ "స్త్రీణా ముపనయనస్థానే వివాహో మను రబ్రవీత్."

స్త్రీలకు వివాహరూపమున నుపనయన మొనర్పుడని మనువు వచించెను.

ఈ విధముగ నుపనయన మొనర్చి పతికులమునకు బంపుచో నతని భావముల ననుసరించి వ ర్తింపగలదు.

అనార్యుడు—

మహాశయా! తాము చెప్పినది కల్పితముగ దోచుచున్నది. మొ త్తముమీాద స్త్రీలకు వడుగు చేయవలెనని తెలియుచున్నది. అటులగావించి గురుకులమునకు బంపుట యుచితము. అచట విద్య నభ్యసించి యౌవనము వచ్చిన వెంటనే తగిన పతిని పెండ్లాడవలెను. ఇది కాదనుట యెట్లు?

ఆర్యుడు—

ఓయీ! నీ బుద్ధి మెచ్చదగినది. ఎంత తెలివియున్నను ప్రమాణబద్ధుడవై యుండవలెను, కనుక శాస్త్రవచనమును వినుము.

శ్లో॥ పతిసేవా గురౌవాసో గృహార్థోఽగ్నిపరిక్రియా.

మనుస్మృతి.

(1) పతిసేవా = పతిని ,సేవించుటయే, గురౌవాసః = గురువుగారి వద్ద నివసించుట యనియు

(2) గృహార్థః = గృహకార్య నిర్వాహణమే, అగ్నిపరిక్రియా = అగ్నిపూజ యనియు మనుధర్మశాస్త్రమున గలదు. ఈ ప్రమాణమును విడిచి 1. బాల్యమున గురుకులవాసమనియు 2. యౌవనమున పతికులవాస మనియు నిటుల విడదీయుటకు నీవెవరవు.

అనార్యుడు—

అయ్యా! వివాహము ౫ దినములు జరుగునని యెల్ల రెరింగిన విషయమే. తాము సెలవిచ్చినటుల మొదటిదినము పుట్టింటను, మిగిలిన నాల్గురోజులు అత్తవారింటను జరుగవలె నని శాస్త్రప్రమాణముల జూపెదరా?

ఆర్యుడు—

మిత్రమా! శాస్త్రబద్ధుడవై యడుగుట సంతోష కరము. వివాహమంత్రములు వేదములలో కలవు. కాని యేయే సమయములలో నే యే మంత్రము లుచ్చరింపనగునో, ఎట్టి తంత్రము నడుపవలెనో ఆ వివరము వేదములలో దొర కదు. మంత్రముల గనిపెట్టిన మహర్షులు వాని నెటుల నుప యోగించిరో ఆ పద్ధతులను ఆపస్తంబుడు - బోధాయనుడు - ఆశ్వలాయనుడు, మున్నగు వారు సూత్రరూపమున వెల్లడించిరి. అందు మనదేశమున నాపస్తంబసూత్రము మిక్కలి వ్యాపించి యున్నది. దానిని గమనించినయెడల వివాహకలాపమంతయు వరుసగా తుదివరకు దెలియగలదు. అపుడు పుట్టింట జరుగు విధు లెవ్వియో యత్తవారింట నడుచు కలాప మెద్దియో తేట పడును.

వివాహ ప్రారంభమున వధూవరుల నడుమ తెర వేయ బడును. ఆ సమయమున కన్యాదానము చేయుదురు. అంత వరకు పెండ్లికొడుకు—పెండ్లికూతురు—ఒకరి నొకరు చూచు కొనరు. ఒకానొక మంత్రముచే తెర తీయబడును. వెంటనే వరుడు వధువును దర్శించును. ఇదే భార్యాభర్తల మొదటి

చూపు. దీనినే సుముహూ ర్త మందురు. ఇక నాప స్తంబ సూత్రి మెటుల నడుచుచున్నదో చూడుము.

సూత్రిము—తత స్సుముహూ ర్తే స్వయం దృష్ట్వా తృతీయాం జపేత్ —

ముహూ ర్త కాలమున అనగా తెరను తీయునపు డొక ఋంత్రి ముచ్చరించుచు వధువును దర్శించపవలె నని కలదు. అటుపై గొంత కార్యక్రిమము నడుచును. పిమ్మట—

సూత్రము—తస్మి న్ను త్తరయా దక్షి ణం యుగచ్ఛిద్రం ప్రితిష్ఠాప్య—

మరియొక మంత్రిముచే కన్యయొక్క శిరముపై కాడిని పెట్టవలెను. ఆ కాడియొక్క రంధ్రిమందు దర్భచే ముడివేయ బడిన బంగారు వస్తువునుంచి దానిపై నీటిని చల్లవలెను. అంతట—

సూ—మంగళసూత్రిం బద్ధ్వా — తత ఆర్ద్రాక్ష తారోపణం కుర్యాత్ —

మంగళసూత్రిము కట్టి తలంబ్రాలు పోయవలెను.

సూ—అ ధ్దైనా ము త్తరయా—దక్షి ణే హ స్తే గృహీ త్వాఽగ్ని మభ్యానీయ.

కన్యను చేయిపట్టుకొని అగ్నివద్దకేగి యచ్చట ప్రధాన హోమములు చేయవలెను.

సూ—అం తే హ స్తగ్రిహణం—

ఒక మంత్రిమునుచెప్పి తుదకు కన్యయొక్క చెయ్యి

పట్టుకొనవలెను. ఇటుల చేతిని పట్టుకొనుటకే పాణిగ్రహణ మని పేరు.

సూ — అ ద్భిర్నాం స ప్తమేప దే జపతి.

పిమ్మట కన్యను ఏడడుగులు నడిపించవలెను.

సూ —ఉ త్తరాభ్యాం యో క్త్రం విముచ్య—

కొన్ని హోమము. కొనర్చిన పిదప కన్య కదివరకు నడుమున గట్టిన గర్భతాటిని విప్పవలెను.

మొదటిరోజున పుట్టింట చేయదగిన వివాహభాగ మింతటితో ముగిసెను. వెంటనే కన్యను అత్తవారింటికి పంపుటకై సూత్రము లీ క్రింది విధముగ నడుచుచున్నవి.

సూ॥ ఉ త్తరా రథస్యో త్తంభినీ-కన్యను బండిపై నెక్కింపదలచి యా బండికి అనగా రథమునకు ఎద్దుల గట్టవలెను.

సూ॥ ఆరోహాత ము త్తరాభి రభిమంత్రియ తే - బండినెక్కుచున్న వధువును కొన్నిమంత్రములచే నభిమంత్రించవలెను. అంతట ప్రయాణమై పోవునపుడు.

సూ॥ తీర్థస్థాణు చతుష్పథవ్యతిక్రమే చో త్తరాంజపేత్

నదులు - గట్టులు - నాల్గుదార్లు కలసినచోట్లు - దాటవలసె నేని యొకమంత్రమును పఠింపవలెను. ప్రయాణమధ్యమున నదులు కాలువలు అడ్డము వచ్చెనేని.

సూ—నావము త్తర యానుమంత్రి తే—

పడవ నెక్కునపు డొకమంత్రము చదువవలెను.

ఇటుల క్రమముగ నా కన్యను స్వగ్రామమునకు జేర్చి.

సూత్రము—గృహాన్ ప్రపాదయన్ ఉత్తరాం వాచ యతి—

తన యింటిని జూపి యామెచే నొక మంత్రమును చెప్పించ వలెను. ఇటుల నింటిలో ప్రవేశించి.

సూత్రము—అనయా నవోఢయా వధ్వాసహ గృహ ప్రివేశ హోమం కరిష్యే.

గృహప్రవేశహోమ మొనర్ప వలెను.

చూచితివా! మొదటి రోజున తలంబ్రాలు మొదలగు నవి పూర్తి గావించి రథముపై నెక్కి యింటికి ప్రయాణమై మార్గ మధ్యమున—నదులు కొండలు దాటి క్రమముగ—తన యిల్లు చేరి గృహప్రవేశ హోమములు చేయుచున్నటుల గ్రహించితిమి.

సూత్రము—అథైనా మాగ్నేయేన స్థాలీపాకేన యాజయతి—

పుట్టింట నుండి తెచ్చిన అగ్నిహోత్రమున అన్నమును వండి హోమ మొనర్పవలెను. నిత్య మీ విధముగ నగ్ని హోత్రుని పూజింతు మని భార్యా భర్త లిరువురు

సూత్రము—యావజ్జీవం హోష్యామీ త్యుభయో స్సంకల్పః—

సంకల్పించవలెను.

మూడవనాడు - సదస్యము - నాల్గవదినమున శేష హోమము - జరిపి అయిదవరోజు మానసిక దేహములకు ర్భాధాన సంస్కార మొనర్చవలెను.

అదిమొదలు క్రమముగా

శ్లో॥ పతిసేవా గురౌవాసో, గృహార్థోఽగ్నిపరిక్రియా.

అత్తవారింట వసించి పతిసేవయే గురుసేవగా భావించి యతని నుండి విద్య నభ్యసింపవలెను.

ఈ కార్యక్రమమును తిలకించితిమేని మొదటిరోజున తండ్రియింటను మిగిలిన దినములలో మగనియింటను పెండ్లి జరుగుననియు అది మొదలు కన్య అత్తవారింట పతిసేవకై వసింపవలెననియు స్పష్టమయ్యెను.

అనార్యుడు—

అయ్యా! తాము సెలవిచ్చినది సత్యమేని యిప్పుడు జరుగుచున్న పెండ్లిండ్లు శాస్త్రీయముగ లేవని తెలియుచున్నది. ఇందుకు హేతువేమి ?

ఆర్యుడు—

ఓయీ ! నీవడిగినది గొప్పవిషయము. ఇక శాస్త్ర మర్యాదవినుము. అది రెండువిధములుగ నుండును.

1. అందొక విధము, సౌకర్యమునుబట్టి జరుగుట కంగీక రించును.

2. రెండవ విధము - తాను చెప్పినటుల నొక యక్షర మైన విడువరాదని నిర్బంధించును. అటులజేయనిచో రౌర వాదినరకము కల్గుననియు బెదరించును.

మొదటి విధములో కర్మకాండ నడుచుటయే ముఖ్యమై యున్నది. దానిని ఫలానాచోట చేయుడని చెప్పినను, అటుల నాస్థలమున జరుపడేని రౌరవాదినరక మని భయపెట్టదు. కనుక

పుట్టింటగాని, అ త్తవారింటగాని, ఈ రెండునుగాక మరెచోట్ల టనోగాని, చేయవచ్చును. ఇక రెండవ విధిని చూడుము.

రజస్వల యగుటకు పూర్వమే కన్యకు పెండ్లి సేయుడని విధించి యొకవేళ నటులజేయుడేని

శ్లో॥ త్రియ స్తే నరకం యాంతి దృష్ట్వా కన్యాం రజస్వలాం.

తండ్రియేగాక, తల్లియు, అన్నయు, నీ ముగ్గురు నరకమున కరుగుదురని భయపెట్టెను. కావున నెట్టి యిబ్బందిలోనైనను సమర్తాడిన పిమ్మట పెండ్లిసేయకూడదనియు, బాల్యమున జేయు పెండ్లి పుట్టింటగాని, అ త్తవారింటగాని చేయవచ్చుననియు సారాంశమై యున్నది.

అనార్యుడు—

మహాశయా ! పెండ్లి యైనది మొదలు కన్య అ త్తవారింట నుండవలె ననుట యోగ్యముగ నున్నది. అటుల నుండక గర్భాధాన మగువరకు పుట్టింటనే యున్న యెడల—బాల్యము నుండి పతి యొక్క ఆహార వ్యవహారముల నభ్యసించుటకు మార్గ మెద్ది ?

ఆర్యుడు—

ఓయీ ! తల్లి దండ్రులు తమ బిడ్డను చిన్నతనమునుండి అ త్తవా రింటికి బంపకున్నను పతిసేవా విధానమున లోపము కలుగకుండు నటుల జేయగలరు. ఎట్లన—అల్లుని యాహారాదుల గ్రహించి తను బిడ్డల కవి—నేర్పుదురు. అంతియేగాక—ప్రతి వత్సరమున నెన్నియో పేర్లు పెట్టి పండుగలనియు—ఉత్సవము లనియు—కార్యము లనియు—దెలు

వుచు నల్లుని తమ యింటికి బిలుచు చుందురు. మరియు నతని నడవడికలు—బాగుగ దెలిసికొని ప్రత్యక్షముగ పిల్లలకు జూపు చుందురు.

ఈ విషయములు గ్రహించుటకు మరియొక మార్గ ముండెను. అది యెద్ది యన—అత్తవారు తమ కోడలిని యేడాదికి రెండు మూడు సార్లు తమ యింటికి గొంపోయి యచటి యాచారముల జూపుచుందురు. ఇటుల రెండు విధము లుగ పతిసేవ లభించుచున్నది.

అనార్యుడు—

మహాత్మా! వివాహమైనది మొదలు పతి వెంట నుండి యతని సేవించుచుండవలెనని సెలవిచ్చితిరి. ఆ పని పూర్ణముగ నెరవేరవలెనన్న బాల్య వివాహములకంటె యువతీ వివాహ ములే యోగ్యములుగ నుండును. ఎందుకన బాల్యమున పెండ్లి చేసి పిల్లల నత్తవారింటికి బంపి తలిదండ్రు లుండలేరు. ఆ బిడ్డయు వారిని విడువజాలదు. ఈ యవస్థకంటె సమర్తాడిన వెంటనే పెండ్లియై అందులో గర్భాధానముకూడ ముగిసెనేని యెంత సౌకర్యము ? ఆ బిడ్డ పతిని విడువనేరక యతని యాహార వ్యవహారము లభ్యసించుట కెంతయో వీలుకాదా ? నిజముగా పతివ్రతయై యుండవలె నన్న యువతీ వివాహములే శ్రేష్ఠములు. ఈ విషయమున మీ యభిప్రాయ మేమి ?

ఆర్యుడు—

మిత్రమా! పాతివ్రత్యమన నంత సులభమైనదని భావింపకుము. సృష్ట్యాదినుండి నేటివర కెవ్వరును అందలి

మహిమ కనినవారు లేరు. అది హిందువుల సొమ్ము. మతము లన్నిటిలో హిందూమతము ప్రభుమత మని తలంతువేని, దైవమతమని ధృవపరతువేని బ్రహ్మతత్వ విమ ర్శనమున నగ్రస్థాన మలంకరించె నని నిశ్చయింతువేని, భిన్న మానవుల నుద్ధరింప వివిధసిద్ధాంతముల వెల్లడించెనని గ్రహింతు వేని, అట్టి విజ్ఞానతత్వ మర్థ మొనర్చుకొనిన భారతీయుల జన్మమునకు ముఖ్య కారణము పతివ్రతలే యని యెరుంగుము. మహోత్కృష్ట మగు నా పాతివ్రత్యధర్మమును ప్రతిష్ఠింపవలె నన్న బాల్య వివాహములే శరణ్యము లని యెంచుము. వంశ పారిశుద్ధ్యమును గోరిన మనుజు డుండెనేని ముందుగ బాల్యవివాహముల నెలకొల్పవలె నని నిశ్చయింపుము. ఇంత యేల, ధీరుడవైతివేని ప్రాణార్పణ మొనర్చియైనను ఈ ధర్మ మును రక్షింప బద్ధకంకణుడ వగుము.

ఎముక ముదిరిన యువతులు పెండ్లాడి యీ ధర్మమును కాపాడెదరని తలంచుచుంటివా? ఆ భావమునువిడువుము. ముదిరిన తీగెలు చెట్లనల్లుకొనినట్లుండును. ఎందుకీభ్రమ? యువతిని పెండ్లాడ దలతువేని బ్రహ్మచర్యదీక్షచే శుద్ధురాలైనపడుచును చేపట్టజాలవు. ఎయ్యది నేర్వదలచినను బాల్యమే ముఖ్యమని యెంచుము. ఈ మాతృపితృ లోకజ్ఞాన మెరుంగనివాడు, మాటలాడుటకైన నర్హుడు కాడు. అతని నాయకత్వము దేశనాశనమునకు దోవ యగును. పండితులు సయితము బాల్యమందభ్యసించిన నశ్యము పట్టీ, (పొగాకు నములుట) చుట్ట, కాఫీ, కాపింగు, మొదలగు దురాచారముల విడువలేక నాత్మహత్య గావించుకొనుచున్నారు.

నశ్యమును మానరాదాయని యడిగితిమేని బాల్యమున నభ్యాస మయ్యెనని వచింతురు. వేద వేదాంత విజ్ఞులై వైశ్వదేవాది సత్కర్మ నిష్ఠాగరిష్ఠులై దేవతార్చన మొనర్చి పరుల పవిత్రుల జేయుటకు సాలగ్రామ తీర్థ మొసంగుచుందురు. పుణ్యము రాదు సరికదా నశ్యపు చెయ్యితగిలిన దోషమున పొగాకునీరు త్రాగవలసిన దురవస్థ సంభవించును. పాతకమని యెరింగియు బాల్యాభ్యాస బలముచే సత్ప్రవర్తనకు రాజాలకున్నారు.

"Habit is the second nature" ప్రకృతిసిద్ధమై యొప్పు తత్వ మెటుల నభేద్యమై యుండునో అటులనే బాల్యమం దభ్యసించిన పద్ధతి రెండవప్రకృతియై యలరారును.

కావున స్త్రీలకు బాల్యమున పెండ్లిచేసి యెన్నికష్టములకైన నోర్చి యామెను అత్తవారింటికి పంపియో, లేక పతియొక్క ఆహారాదుల నేర్పియో, కృతకృత్యుల మగుదుమేని ఆ యలవాటు రెండవ ప్రకృతియై భర్తతో సర్వవిధముల నైక్యమొందుటకు వీలగును. నిజమైన దాంపత్య మనిన నిదియే.

"హెర్బర్టు స్పెన్సర్ అను పాశ్చాత్య పండితుడు రచించిన రేషనల్ ఆఫ్ ఎక్లీ మారియేజ్" అను గ్రంథమును చూడుము.

Life is said to be divisible into seven year-period. Huxley points out that the whole material of the body is renewed in this period. Generally consciousness begins to build the individual world in the beginning of the second period.

జీవితమున దేహమందును మనసునందును ఏడేండ్ల కొకసారి మార్పు కల్గుచుండును. జన్మించినది మొదలు మొదటి యేడేండ్లవరకు నేదో యొక విధమగు తత్వము ప్రతివ్యక్తి యందుండును. ఏడేండ్ల కొకసారి మార్పు కలుగ వలసినందున నెనిమిదవయేట నూతనవిషయముల గ్రహించుట కును జీవితాదర్శమున దేహతత్వ మెట్టిదై యుండ వలెనని నిశ్చ యింతుమో అట్టి ప్రకృతి కనుగుణమగు పద్ధతు లభ్యసించు టకును, మొదలిడవలెను. జీవుని వికాసమునకు ప్రారంభ మీ రెండవ యేడేండ్లదశ యనుట సత్యము"

అని యొపుస్తకమునకలదు. కావుననే మన పూర్వులు దివ్యజ్ఞాన సంపన్నులై ప్రకృతి శాస్త్ర మెఱిగి పురుషులనుగాని స్త్రీలనుగాని యెనిమిదవయేట నొకగురువు వద్దకు బంపుటకు ఉపనయన మొనర్చుచున్నారు. విధిగా ఎనిమిదవయేట పెండ్లి సేయవలెను. లేదా పండ్రెండేండ్లలోపల చేయనగును. తుదకు సమర్తాడుటకు పూర్వమైనను పూర్తిగావించుట ముఖ్యము. మొదటిపద్ధతి ఉత్తమము. రెండవపద్ధతి మధ్యమము. మూడవ పద్ధతి అధమము. ఇక నాల్గవరీతి లేదు.

సమర్తాడుటకు పూర్వము పెండ్లికాని యెడల పిమ్మట రజస్వలయైనచో తల్లిదండ్రులా బిడ్డకు పెండ్లిసేయు నధికార మును పోగొట్టుకొనుదురు. ఆమెకును వారికిని బంధుత్వము తెగిపోయినట్లెంచవలెను. ఇట్టి విపత్తుకలిగిన పిమ్మట పుష్ప వతియైన బిడ్డ తల్లిదండ్రులను విడచి వారి సొమ్ములను తీసివేసి తగిన వరుని వెదకి పెండ్లాడవచ్చును. పెండ్లికొడుకు ప్రియ

శ్చిత్త పూర్వకముగ నా బిడ్డను చేపట్టి సుఖించుట కభ్యంత రములేదు. ఇది ఆపద్ధర్మము. తలిదండ్రులు నరకమున బడుట కంగీకరించి ధర్మద్రోహులై గొడ్డుబోతులవలె నైనపుడు, అట్టియెడ, బిడ్డల నుద్ధరించుటకు పై విధ మంగీకరింపబడెను.

N. B.—ఈ విషయము రాబోవు గ్రంథములో—జూడనగును.

అనార్యుడు—

మహాత్మా! యువతీ వివాహములు వాడుకయం దుండెనేని ముప్పదేండ్ల వరకు స్త్రీలు పెండ్లాడ రని చెప్పితిరి. ఇది ప్రకృతి విరుద్ధము. ఎందుకన, సమర్తాడినది మొదలు పురుషవాంఛ కల్గును. వెంటనే తగిన వానిని వరింపని వారుం డరు. ఆకలిమైనవా రన్నము తినక నిద్రింతురా? మన దేశమున నెందరో యువతు లీ విధముగ పెండ్లాడుచుండిరి. కావున ముప్ప దేండ్ల వరకు పెండ్లాడ రనుట యోగ్యమా?

ఆర్యుడు—

ఓయీ! నీమాట యనుభవములేని బాట. మన దేశ మున యువతులు పెండ్లాడినను పై దుర్దశకు రాని కారణము వినుము. హిందూమతమున బాల్యవివాహములు శ్రేష్ఠము లని యెల్ల రెరుగుదురు. కన్యా వివాహముల కున్న గౌరవము యువతీ వివాహమునకు లేదు. అవి పశువుల కలియకలవలె నుండునని భావము కలదు. అయినను కొందరు స్వేచ్ఛా చారులు బయలువెడలి అచ్చటచట యువతీ వివాహములు లేవ నెత్తిరి. సూర్య ప్రకాశమున నేతుల దీపము కళా విహీన

మై యుండునో అటులనే బాల్య వివాహ మహిమచే యువతీ వివాహములు గౌరవముగ తలలెత్తజాలకున్నవి. పొరపాటున జరుగు పెండ్లిండ్ల వలన తలవంపులు గల చర్యలు బయలుదేరుచుండ వానిని కడుపులో బెట్టుకొని వ్యవహరించుచున్నారు. ఇంతకంటె నధికమగు దురవస్థ రానున్నను అది నివురు గప్పిన నిప్పువలె నణగియున్నది. శారదాబిల్లు మొదలగు శాసనములు విజృంభించి యాచరణమునకు వచ్చెనేని యపుడు ముప్పదేండ్లకైనను పెండ్లాడని దశ సిద్ధించును. ఆలోపల సమర్తాడియు, బ్రహ్మచర్యము నవలంబించి యుందురని యెంచకుము. ఎటులనో కాలము గడుపుచుందురు. నిదర్శనమునకై యువతీ వివాహము లుండు దేశములలోని యనుభవముల జూడుము.

In 1908 there were in France 13,50,000 unmarried men over 30 years of age and a somewhat larger number of unmarried women. There were 18,40,710 families without children.

Speech By N. Klotz, Minister of France
(Hindu 20-12-1912)

క్రీస్తుశకము 1908 వ యేట ఫ్రాన్సు దేశమందలి పురుషులు 30 యేండ్లు వచ్చువరకు పెండ్లాడకుండిరి. వారి సంఖ్య 13 లక్షల 50 వేలు కలదు. అదే ఈడుగల స్త్రీలు నయితము పెండ్లాడక పురుషులకంటె నెక్కువగ నుండిరి. కొందరు పెండ్లాడి కామసుఖ మనుభవించియు బిడ్డల కనకుండు పద్ధతు లభ్యసించిరి. అట్టి యిండ్లు 18 లక్షలు 4 వేల 710 యుండెను. చూచితివా యువతీ వివాహమహిమ.

There are at least 50,000 girls in New-York living with men who are not their husbands, girls who should have become mothers but don't care to have children.

Judge Lindsey "Revolt of Youth"

అమెరికా దేశములో న్యూయార్కు అను నొక పట్టణమున 50 వేలమంది స్త్రీలు పెండ్లాడకయే పరపురుషులతో జరించుచుండిరి. సంతతి కలుగవలసి యున్నను ఇకముందు పెండ్లి కాదను భయముచేతను, యౌవనము తగ్గునను భీతి చేతను, పిల్లలను పోషించు భారము వహింపలేకను, బిడ్డల గనకుండ నుపాయములు చేసియుండిరి.

అని 'రివోల్టు ఆఫ్ యూత్' అనుగ్రంథమున జడ్జిలిండ్సే అనువారు వ్రాసిరి. యువతీ వివాహఫలము లిట్లున్నవి.

సమాప్తము.

# ఈ పుస్తకములు

వృష సం॥ చైత్రమాసము వరకు

11 భాగములు పూర్తియైనవి.

# ప్రస్తుతము గృహరాజ్యభాగములు

నిలుపబడినవి.

ఇక

## దైవరాజ్యము

వైశాఖమాసము నుండి వెలువడును.

చందాదారులకు

## 12 భాగములు ఒక్కసారియే

వైశాఖమాసమున పంపబడును.

ప్రతి నెలకు పంపబడవు.

## ఈ గ్రంథములు వలయువారు:

మ్యానేజరు,

హిందూమత గ్రంథమాల,

సత్యనారాయణపురం,

బెజవాడ.

మ్యానేజరు,

హిందూమత గ్రంథమాల,

సికింద్రాబాదు,

(డక్కన్)

అనిగాని వ్రాయవలెను.

| | | | |
|---|---|---|---|
| పోస్టేజితో సహా సంవత్సర చందా | బ్రిటిష్ | రు | 1—5—0 |
| ,, ,, | నైజాం | . | 1—4—0 |
| విడి పుస్తకము | | | 0—1—6 |

పండితుల వారి యుపన్యాసములు వినగోరు వారు గాని వారితో మాట్లాడ దలచినవారు గాని బెజవాడ అడ్రెస్సునకు వ్రాయవలెను.

హిందూ మత గ్రంథమాల

ఉ ప న్యా స చ క్ర వ ర్తి

ప్రభాకర పండిట్ గారి ఉపన్యాసములు

# *Home Rule*

# గృహరాజ్యము

**9 - 10 - 11** భాగములు

వెల

**4** అ.



—నమస్తే—

ఈ గ్రంథమాలలో

వెలువడు గ్రంథములపై సర్వాధికారములు

బ్రహ్మశ్రీ
పరిభారక ఉమామహేశ్వర పండితులవారివి.

వెల్‌కమ్ ప్రెస్ గుంటూరు

హిందూమత గ్రంథమాల.

హిందూమత ప్రచారక, ఉపన్యాస చక్రవర్తి

బ్రహ్మశ్రీ ప్రభాకర ఉమామహేశ్వర పండితులవారి

ఉపన్యాస సారము.

# గృహరాజ్యము

9, 10, 11 భాగములు

సత్తెనపల్లి హిందూయువజన సంఘమువారి ద్రవ్యసహాయమున
వెల్కం ముద్రాక్షరశాల యందు ముద్రింపఁబడియె.

1941.

 వెల 0-4-0

# హిందూ మత గ్రంథమాల

## విరాళముల వివరములు

మహారాజాధిరాజ పోషకులు రూ. 116—0—0 మొదలుకొని

మనసోత్సాహముకొలది

| | | |
|---|---|---|
| మహారాజపోషకులు | సం॥ నకు రు | 25—0—0 |
| రాజపోషకులు | ,, | 10—0—0 |
| పోషకులు | ,, | 5—0—0 |
| సహాయకులు | ,, | 3 0 0 |
| అభిమానులు | ,, | 0 2 0 |

చందా వివరం

సంవత్సరం చందా

| | | |
|---|---|---|
| పోష్టుతో సహా | ,, | 1 5 0 (బ్రిటీషు) |
| ,, | ,, | 1 4 0 (నైజాం) |

బ్రిటీషిండియాలో బుక్కుపోస్టుచార్జి రు. 0 0 3లు హెచ్చినందున 12 నెలలకుగాను రు. 0 3 0 లు పెంచవలసి మైనది.

ఈ పుస్తకములు వలయువారు

మేనేజరు:—డాక్టర్ శ్రీరాముల వెంకటసుబ్బారావు.

# హిందూ మత గ్రంథమాల

గుంటూరు అగ్రహారము.

గ్రంథమాల సభ్యులుగ నుండదలచినవారు తమ పేరు, ఊరు, తాలూకా జిల్లా, దగ్గరగానున్న రైల్వేస్టేషను మొదలగు వివరములతో వ్రాయవలెను.

# గృహరాజ్యము

(9, 10 భాగములు)

అనార్యుడు:—

ఆర్యమహాశయా! వివాహము మత సంబంధముగ నుండవలెనని మీ ధోరణి తెలుపుచున్నది. అయితే పరలోక సంబంధమగు మోక్షమును గూర్చి మతము బోధించునని యిది వరకు వింటిని. అట్టి సందర్భమున దానిని ఇహలోక విషయముగ నెంచుట న్యాయమా?

ఆర్యుడు:—

మిత్రమా! పొరపడుచున్నావు. హిందూమతము ఇతర మతముల వంటిదికాదు. అది ఇహపరముల రెంటిని సమానముగ నడుపును. ఈ విషయమున వేదప్రమాణముల జూడుము,

1. "ధనం ధాన్యం బహుపుత్రలాభం
శతసంవత్సరం దీర్ఘమాయుః"

ధన ధాన్యములను — సంతానమును — దీర్ఘాయుష్యమును — కోరునటుల వేదము ప్రోత్సహించుచున్నది. ఈ విషయములు ఇహసంబంధములో, లేక పరసంబంధములో గ్రహింపుము. మరియు—

2. "సర్వప్రజాంమే గోపాయ"

దైవానుగ్రహముచే కలిగిన సంతానమును రక్షింపు మనియు,

3. "అధర్వ పితుంమే గోపాయ"

ఆర్జించిన యన్నమును కాపాడు మఁయు,

4. "శగ్గ్స్యప శూన్మే గోపాయ"

లభించిన పశువులను పాలింపు మనియు,

5. "సప్రిధ సభాంమే గోపాయ"

పరివారముతోఁగూడిన సభను రక్షింపు మనియు,

6. "మానోహిగ్ం సీ జ్జాతవేదో
గామశ్వం పురుషం జగత్"

గోవులు, గుఱ్ఱములు, ప్రజలు సురక్షితముగ నుండ వలెననియు,

7. "జహి శత్రూగ్ం రపమృధోనుదస్వ"

అపకార మొనర్చువా రుండరా దనియు,

8. "ఆనోవీరో జాయతాం"

వీరపురుషులు జనింపవలె ననియు,

9. "సజాయతాం వీరతమ స్స్వనాం"

ఆ బిడ్డలు వీరులై యుండుటయేగాక, వంశమున శిరో మణులవలె వీరాగ్రేసరులై ప్రకాశింపవలె ననియు,

10. "ఆతేగర్భో యోనిమే తుపుమాన్ బాణ ఇవే
షుధిం"

అంబులపొదిలో చేరిన బాణమువలె తన భార్యయందు పుత్రులు ప్రవేశింపవలె ననియు, కోరు మని వేదము హెచ్చరించుచున్నదిచూచితివా! బాణములవంటిబిడ్డలు కలుగవలెనట-!

11. శంచమే మయశ్చమే ప్రియంచమే + + శ్రేయశ్చమే + + యశశ్చమే + + ద్రవిణంచమే క్షేమశ్చమే+ + కృషిశ్చమే వృష్టిశ్చమే + + యవాశ్చమే, మాషాశ్చమే, తిలాశ్చమే, ముద్గాశ్చమే, గోధుమాశ్చమే, + + వనస్పతయశ్చమే, హిరణ్యంచమే, + + గ్రామ్యాశ్చమే పశవ ఆరణ్యాశ్చమే + +

సుఖము, శ్రేయము, ధనము, క్షేమము, వ్యవసాయము, వర్షము, యవలు, మినుములు, నువ్వులు, పెసలు, గోధుమలు, వృక్షములు, పశువులు మొదలగునవి యెన్నియో తనకు కలుగవలయుననియు జీవుడు కోరుచున్నాడు. ఇవి ప్రపంచ సుఖము కొరకు కావా? కావున మతము ఇహపర సాధనముల రెంటిని ప్రసాదించు నని విశ్వసింపుము.

12. "సిగ్ంం హేవ్యాఘ్ర ఉతయా పృదాకౌ,
త్విషిరగ్నౌ బ్రాహ్మణే సూర్యేయా
ఇంద్రం యాదేవీ సుభగా జజాన
సాన ఆగన్ వర్చసా సంవిదానా" [వేదము]

సింహమందు, పెద్దపులి యందు, కొండశిల యందు, తేజస్సునందు, అగ్ని యందు, బ్రాహ్మణుని యందు, సూర్యు నందు - ఏశక్తి ప్రకాశించుచున్నదో అది మా యందు ప్రస రించుగాక. అనగా అడవులం దెటుల సింహములు మృగ రాజులై యుండెనో అటుల భారతీయుల మగు మేము దేశ ములలో రాజాధిరాజుల మై వన్నె కెక్కుదుము గాక. స్వర్గాధి పతియగు దేవేంద్రుని తపః ప్రభావ మెట్టిదో, అట్టి శక్తి మా యందుచేరి మమ్ము దేవేంద్రసమానులుగ నొనర్చుగాక. ఇటుల ప్రార్థింపు డని వేదమతము బోధించుచున్నది. ఇట్లుండ వేదము కేవల మోక్షవిషయము తెలుపు ననుట యెంత యవివేకమో గ్రహింపుము.

అనార్యుడు:—

మహాశయా! హిందుమతమున సంఘాభివృద్ధిని బోధించు విషయములుకూడా కల వని నేడు గ్రహించితిని. మహానంద మైనది.

అయినను ఈ మతమున నొక లోపము కలదు. అది యెద్ది యన వివాహము స్త్రీ పురుషు లిరువురకు సంబంధించి యుండ, నందు పురుషునకు మాత్రము స్వాతంత్ర్యముండు టయు, స్త్రీకి లేకుండటయు గొప్పనేరమని తోచుచున్నది.

ఇతర మతములలో నటుల లేదు. దంపతు లిరువురు స్వతంత్రులై యున్నారు. హిందుమతమున మాత్రము సమా నత్వము లేకుండుటకు హేతువేమి?

ఆర్యుడు:—

మిత్రమా! స్త్రీ పురుషు లిరువురు కలసి గృహరాజ్యము నడుపు చున్నా రనుకొనుము. అటులనే, సాధారణముగ దేశ రాజ్యమున ప్రభువనియు, మంత్రియనియు నిరువురుందురు. పాఠశాలలో గురువు - శిష్యుడు - అనియు, కోర్టులో న్యాయాధిపతి, [అనగా మునసబు లేక జడ్జి] న్యాయవాది [అనగా వకీలు] అనియు, కలరు. దుకాణమున సేటు, [అనగా షావుకారు] గుమస్తా అనియు, వ్యవసాయమున రైతు, పాలేరు [అనగా జీతగాడు] అనియు నిటుల, లోక వ్యవహారమున రెండు పక్షములుండెను.

| అందు మొదటి పక్షమున | రెండవ పక్షమున |
|---|---|
| 1 రాజు | 1 మంత్రి |
| 2 గురువు | 2 శిష్యుడు |
| 3 న్యాయాధిపతి | 3 వకీలు |
| 4 షావుకారు | 4 గుమస్తా |
| 5 రైతు కలరు | 5 పాలేరు ఉండిరి |

ఈ రెండు పక్షములలో మొదటివారు స్వతంత్రులు. రెండవ పక్షపువారు అస్వతంత్రులు. అటుగాక రెంటిలో స్వాతంత్ర్య ముండిన యెడల నావ్యవహారము వివాద గ్రస్తమై సర్వవిధముల భంగమగును. అటులనే, గృహరాజ్యమున

నై తమ స్త్రీపురుషు లిరువు రుండిరి. వారిలో నొకరు స్వతంత్రులై రెండవవారు అస్వతంత్రులై యుండినపుడే గృహకృత్యము శాంతముగ నెరవేరును. ఇది లోకానుభవ సిద్ధము. సర్వమతములలోని రహస్య మిదియే.

క్రైస్తవులలో పురుషులతోబాటు స్త్రీలకుకూడా సంపూర్ణ స్వాతంత్ర్యముండెనని పలువురు భ్రమింతురు. ఆ విషయము సర్వాబద్ధము. ఏమన క్రైస్తవులకు ప్రమాణ గ్రంథమొకటి గలదు. దానికి బైబిలు అని పేరు. అందు ప్రాత బైబిలు, క్రొత్త బైబిలు అని రెండుభాగము లుండెను. ఆ రెంటిలో పురుషులకే స్వాతంత్ర్య మొసంగ బడెను. కొత్త బైబిలులోని ప్రమాణములను వినుము.

"స్త్రీకి తల పురుషుడు, పురుషునకు తల క్రీస్తు, క్రీస్తునకు తల దేవుడు."

అని కలదు. దీని భావమేమి? శిరస్సుచెప్పినటుల మిగిలిన శరీరమంతయు నడచును. అటులనే, దేవుడు నుడివినటుల క్రీస్తువు, లోబడియుండవలెను. పురుషుని యాజ్ఞానుసారము స్త్రీ మెలంగ వలయును అని సారాంశము. ఇంకను స్త్రీ విషయమై బైబిలు నం దేమికలదో చూడుము.

"స్త్రీలు సభలలో మౌనముగనుండ వలెను.
వారికి మాట్లాడుటకు హక్కు లేదు.
ఏదైనా తెలుసుకో దలచినపుడు ఇంటిలో భర్త నడుగ

వలెను. పురుషుని కొరకు, స్త్రీ సృష్టింపబడినది. స్త్రీ కొరకు పురుషుడు జనింపలేదు. ఏలనన, సృష్టికి మొదట, పురుషుడొక్కడే పుట్టెను. అతని పేరు ఆదాం, అతనితృప్తికై సహాయమునుగ, అతని ప్రక్కయెముకనుండి దైవమహిమచే స్త్రీ సృజింపబడెను. ఆమె పేరు హావ్వ అని కలదు."

ఇటుల బైబిలునందు పురుషుడు స్వతంత్రుడనియు, స్త్రీ, యస్వతంత్రియనియు చెప్పబడెను. ఇట్లుండ దానిని పాటింపకుండుట ధర్మమా! ఇక మహమ్మదీయ స్త్రీలలో ఘోషాపద్ధతి కనులార గన్పట్టుచున్నది. దీనింబట్టి స్త్రీలకు స్వాతంత్ర్యము లేదనుట స్పష్టము.

మతములనటుంచి ప్రకృతిని పరీక్షింతము. సృష్టియందు పశు పక్ష్యాది జీవములెన్నియో కలవు. అందు ఆడ పశువులకంటె పురుష పశువులలో ఎక్కువ బలము, నిర్భయత్వము, గోచరించు చున్నది. ఆవు, గొఱ్ఱె, శివంగి, కోడిపెట్ట, ఇవి స్త్రీ జంతువులు. ఆబోతు, పొటేలు, సింహము, కోడిపుంజు, ఇవి పురుషజంతువులు. స్త్రీ జంతువులకంటె పురుష జంతువులకు విశేష శక్తి యుండునని సంశయించు వారుండరు. బలముగలవారెవరో, వారే బలహీనులకు ప్రభువులై యుందురు. కావున స్త్రీలకు పురుషులు ప్రభువులై యుందురు. ఇది ప్రకృతి సిద్ధము. ఎందువలన పురుషుడు స్త్రీపై యాధిపత్యము వహింప వలెనో, ఆమెను వశమొనర్చుకొనవలెనో, లోకానుభవముచే విమర్శింతము.

రైతువద్ద ధాన్య ముండును. దానిని భూమియందుంచి పైరుచేయుటకు పొలమువసరము. అందుకై భూమిని సంపాదించును. అట్టి భూమికి నతడధిపతియై దానిని తన వశమందుంచుకొనును. ఈసందర్భమున రైతుస్వతంత్రుడు. భూమికట్టి స్వాతంత్ర్యము లేదు. రైతువద్ద విత్తనము లున్నట్లు పురుషుని కడ సంతానరూపమగు వృక్షముల నంకురింపజేయు బీజములు కలవు. భూమివలె స్త్రీలు పురుషులనుండి విత్తనములను (అనగా వీర్యమును) గ్రహించి సంతతినికనెదరు. కావున వారు భూమిం బోలి యస్వతంత్రు లగుచున్నారు.

అ నా ర్యు డు:—

మహాత్మా! యుక్తు లింతటితో చాలును. ఇక వేద ప్రమాణము ననుసరించి స్త్రీలు, అస్వతంత్రలనియు పురుషులు వారిని వశమొనర్చుకొనవలె ననియు నిరూపింపగలరా?

ఆ ర్యు డు:—

ఓయీ! నీ ప్రశ్నకు సరియైన ప్రత్యుత్తరము కలదు. స్త్రీ పురుషు లిరువురు కలియుట కేర్పడిన కర్మకలాపమునకు వివాహమని పేరు. వా రిద్దరు తమ చేతుల నొక్కటిగ జేర్చుటతో పెండ్లి పూర్తియగును. ఇట్లు చేతులను పట్టుకొనుటకు సంస్కృతభాషలో పాణిగ్రహణ మనిపేరు. పాణిగ్రహణమనినను, వివాహమనినను ఒక్కటే. పాణి యనగాచెయ్యి. గ్రహణ మనగాపట్టుకొనుట.

ఇదే భావమును సూచించు వివాహ మంత్రమును వినుము.

"గృహ్ణామితే, సుప్రజాస్త్వాయ హస్తం
మయాపత్యా జరదష్టిర్య థాసః"

ఓ కన్యా! తే=నీయొక్క, హస్తం=చేతిని, సుప్రజాస్త్వాయా=మంచి సంతతికొరకు, పత్యా=పెనిమిటినైన, మయా సహ=నాతోకూడా, యథా=ఎట్లు, జరదష్టిః=ముసలితనము పొందినదానవు, అసః=అగుచున్నావో, అటుల గృహ్ణామి=పట్టుకొనుచున్నాను. అనగా ఎంతవరకు ముసలివాడనై జీవించి యుందునో అంతవరకు నీవును ముదుసలివై జీవించుము.

అని పెండ్లికొడుకు పెండ్లికూతురుయొక్క చేతిని పట్టుకొనును. వివాహములోని ముఖ్యాంగ మిదియే యని యెరుంగుము.

అసలు పెండ్లాడుటకు ముఖ్య హేతువు పితృఋణ విముక్తి కని

"ప్రజయా పితృభ్యః"
ఈ వేదమంత్రము ఘోషించుచున్నది.

"ప్రజయా, హి, మనుష్యః పూర్ణః"
సంతతిని కనుటచేతనే నరుడు పూర్ణుడగుచున్నాడనియు తెలుపుచున్నది. దీనింబట్టి ఋణవిముక్తికై సంతతిని గనవలె

ననియు అట్టి సంతతికి సాధనము వివాహమనియు, ఆ పెండ్లిలో ముఖ్యచిహ్నము చేతిని పట్టుకొనుటయనియు గ్రహించితిమి.

ఇటుల కన్యను పాణిగ్రహణమొనర్చి తన యింటికి తీసికొనిపోవుచు నీక్రింది మంత్రమును పఠించును. అందలి భావమును గ్రహించుచో నీప్రశ్నకు సమాధానము లభించును.

"గృహాన్ గచ్ఛ - గృహపత్నీ - యథాసో -
వశినీ - త్వం - విదథ మా వదాసి"

ఓ కన్యా! గృహాన్=నాగృహములనుగూర్చి, గచ్ఛ= ప్రయాణము కమ్ము. గృహపత్నీ=గృహయజమానురాలిగా, యథా=ఎట్లు, అసః=అగుచున్నావో, అటుల నాయింటికి రమ్ము అనగా మన ఇంటిపనుల నడుపుటకు ఆధిపత్యము వహింపుము. అయితే, ఒకమాట మరువకుము. ఏమన నీవు గృహమునకు మాత్రమే యజమానురాలవు. నేను నీ కధిపతిని.

"వశినీ, త్వం" [వివాహమంత్రము]

త్వం=నీవు, వశినీ=నాకు వశురాలవై యుండవలెను.

అని, స్వతంత్రుడగు పురుషుడు అస్వతంత్రయగు స్త్రీని ప్రోత్సహించి, తన యింటికి గొంపోవుచున్నాడు. ఈ మంత్రములో వశినీ యను శబ్దము కలదు. అది స్త్రీలను పురుషుల వశేవుండుంచుచున్నది, అందుకనే, మరియొక మంత్రమున

"అగ్నేరనువ్రతా భూత్వా
సన్నహ్యే సుకృతాయకం"

ఓ కన్యా! నిన్ను, సుకృతాయ= స్వర్గలోకసుఖమొసంగు వివాహము కొరకు, కం=సుఖము కలుగునట్లుగా, సన్నహ్యే= బంధించుచున్నాను. అనగా ఇహసౌఖ్యమేగాక పరలోకసుఖము కూడా కలుగజేయుటకు నిన్ను స్వాధీనమొనర్చుకొనుచున్నాను. అని కలదు. దీనిచే పురుషస్వాతంత్ర్యము వ్యక్త మగుచున్నది. వేరొక స్థలమున వివాహములో-

"మనోహమస్మి + + సామా మనువ్రతాభవ"

ఓకన్యా! అహం = నేను, మనః = మనస్సుగా, అస్మి = ఉన్నాను. త్వం = నీవు = వాక్ = నోరువలె నున్నావు. అని పెండ్లికూతురుతో పెండ్లికొడుకు చెప్పుచున్నాడు. దీని భావమేమో వినుము. దేనిని మనస్సు సంకల్పించునో దానిని తప్ప వేరొక వాక్యమును నోరు వచింపజాలదు. అటులనే, మనస్సు వంటివాడు భర్త యనబడును. అతని యాజ్ఞలేనిది నోరువంటిభార్య, స్వతంత్రముగ నొక్క పనియైనను చేయ కూడదు.

అనార్యుడు:—

మహాశయా! పురుషుడు సర్వాధికారి కావచ్చును. అడవులందలి పువ్వులను స్వేచ్ఛగా దెచ్చుకొనుటకెటుల సర్వులు స్వతంత్రులో అటులనే యెవరెవరికి ఏయే కన్యలు లభించిన నా యా కన్యలను స్వయముగ బట్టుకొని పెండ్లాడ నగునా?

ఆర్యుడు;—

ఓయీ! అటుల వీలులేదు. ఎందుకన అడవులలోని పువ్వులకు యజమానులులేరు. కన్యలన్ననో తండ్రుల యాధీన మందుండిరి. కావున నా యజమాను లెవరికి వారల నొసంగుదురో ఆ పురుషులనే పెండ్లాడవలెను. అటుల జరిగిన వివాహములు ధర్మ సంబంధములై యుండును. మిగిలినవి కామబంధములు. వీనిని బుద్ధిమంతు లంగీకరింపరు.

అ నా ర్యు డు:—

మహాత్మా! స్త్రీపురుషు లిరువురిలో నొకరి నొకరు కలియుటకు కామము ముఖ్య కారణమైయున్నది. దానిని విడిచి కేవలము ధర్మపూర్వకముగ పెండ్లాడవలెననుట యసందర్భము కాదా?

“కామః కామాయ, కామోదాతా, కామః ప్రతి గృహీతా”

అనగా, కామదేవత కన్యను కామము కలవానికిచ్చుచున్నది. ఇచ్చువాడు, పుచ్చుకొనువాడు కామస్వరూపులుగ నున్నారు. అని వేదము తెలుపుచుండ వివాహము కామసంబంధము కాదనియు, ధర్మమనియు తెలుపుట న్యాయమా?

ఆ ర్యు డు:—

మిత్రమా! బాగుగ ప్రశ్నించితివి. శ్రద్ధతో వినుము. జగమున సర్వకార్యములు కామప్రధానములనుట సత్యము.

నిజముగా కామములేని కార్యములు లేవు. అయినను అవి ధర్మ బద్ధములై యుండినపుడే మనుజుడు శ్రేయమొందగలడు.

సహజముగ హృదయమునుండి మొదట కామము బయలుదేరును. అది పశుధర్మము, లేక రాక్షసత్వము. అయినను కామసంబంధ కార్యమును ధర్మసంబంధముగ మార్చుట వలననే మానవజన్మము ఫలించును. అట్టికార్యము ధర్మబద్ధ మనియు, దైవస్వరూపమనియు వేదము ఘోషించెను. మానవ హృదయమునుండి బయలువెడలు కోర్కెలు కామసంబంధ ములై యుండుననియు వాని ననుసరించి వర్తించుట దుఃఖహేతు వనియు స్వానుభవమున దెలియవచ్చును.

ఎటులనన బండికికట్టిన గుఱ్ఱము మొదట చెడుత్రోవలో నడుచును. ఆనడకవలన యజమానునకు నష్టముసంభవించును. అటులనే శరీరమునుండిబయలుదేరిన కామసంబంధ కార్యములు సయితము మనుజులను నరకమున బడవేయును.

అయితే గుఱ్ఱములవలన బాధకలుగకుండుటకై యెటుల కళ్లెముల బిగింపవలెనో అటులనే కామకార్యములనుండి తప్పించుకొనుటకై ధర్మమను కళ్లెమునుబిగించి జీవయాత్రను జరుపుచుండవలెను.

ఆత్రోవయే ధర్మమార్గము. కావున సంసారయాత్రకు మూలకారణంబగు వివాహము ధర్మబద్ధమై యుండుటకంటె మహోన్నతస్థితి వేరొండులేదు.

కావున కామమార్గముకంటె ధర్మమార్గము సుఖప్రద మని లోకానుభవమున తెలియును. అపుడు సర్వసంశయములు తీరును. ఇందుకొక యుదాహరణము వినుము. రోగికి సహజముగ వివిధపదార్థములు తినవలెనని కోరిక జనించుచుండును. ఇది సర్వులకు సహజము. ఎంతటి విద్వాంసునికైనను కోర్కెల నరికట్టుట దుర్లభము.

శాస్త్రమును ధిక్కరించుటకు ఏనాడు సంఘము సిద్ధమగునో ఆనాడే వైద్యుని ధిక్కరించిన రోగివలె అదియు నశించితీరును. కావుననే రోగియొక్క కోర్కెలదీర్చుటకు వైద్యులంగీకరింపరు. వారు వైద్య నియమముల ననుసరించి నడిపింతురు. అనగా వైద్యశాస్త్రమునకు బద్ధులైయుందురు. ఆమార్గముననే ధర్మమార్గమనిపేరు. సోదరా! చూచితివా? ధర్మమార్గ మహిమ. సహజముగ మొదటబుట్టిన కామదేవుడు జ్యేష్ఠపుత్రుడనియు పిమ్మట నియమసహితుడై బయలువెడలిన ధర్మదేవుడు కనిష్ఠపుత్రుడనియు, సిత డిహపర రాజ్యముల వశ మొనర్చుకొనుటకై ధర్మమార్గమును స్థాపించెననియు నందు వలన జీవులకు సర్వసౌఖ్యములు లభించుననియు నెరుంగుము.

పై యుదాహరణము ననుసరించి స్త్రీ పురుషులకు సహజముగ కలుగుచుండు కామవ్యవహారమున సయితము ధర్మదేవత సర్వాధిపత్యము వహించినప్పుడుగాని గృహరాజ్యమున సంపూర్ణసౌఖ్యమలవడదు. అందుచే వివాహము ధర్మబద్ధమై

యుండవలెనని నిశ్చయింపబడెను. అది మొదట కామప్రధానమైయుండినను దానిని ధర్మమార్గమున, ననుసరింప జేయవలెను. ఆ విషయమే వేదమున కలదు. చూడుము.

"పత్నీత్వమసి ధర్మణాహం గృహపతిస్తవ"

[అథర్వవేదము]

ఓ కన్యా! త్వం=నీవు, ధర్మణా=ధర్మముచే, పత్నీ=భార్యవు, అసి=అగుచున్నావు. అని పెండ్లికొడుకు చెప్పెను. కామప్రధానుడై స్త్రీని చేపట్టరాదనియు కామము కలిగినను దానిని ధర్మరూపముగ మార్చుకొనవలెననియు విశదమైనది.

అ నా ర్య డు:—

మహాశయా! కామముచేగాక, ధర్మమార్గమున స్త్రీని చేపట్టుట యుక్తముగనేయున్నది. అయితే స్త్రీ యొకరి యధీనమందుండి దానముచేయబడవలెనని వేదమున కలదా?

ఆ ర్య డు:—

మిత్రమా! కలదు. వినుము.

"సోమో దదద్గంధర్వాయ" [వివాహమంత్రము]

సోమః=చంద్రుడు, గంధర్వాయ=గంధర్వునకు, అదదత్=ఇచ్చెను. అనగా జన్మించినది మొదలు స్త్రీ చంద్రుని యొక్క యధీనమందుండును. కొంతకాల మతడు రక్షించి

తుదకామెను గంధర్వున కొసంగును.

"గంధర్వోదదదగ్నయే"

గంధర్వుడామెను కాపాడి అగ్ని కొసంగును.

"రయించ పుత్రాగ్ శ్చాదాదగ్ని ర్మహ్యమథో ఇమాం"

అగ్నిదేవుడు తన వశమందున్న కన్యను మనుజున కర్పించును. స్త్రీకి అధిపతులుగా నుండిన

1. చంద్రుడు 2. గంధర్వుడు 3. అగ్ని

ఈ ముువ్వురు దేవతలని గ్రహింపుము. తుదకీ దేవతల నుండి కన్య మానవాధీనమునకు వచ్చుచున్నది. ఏనరుడు పెండ్లాడ దలచునో అతడొక కన్యను అగ్నియొక్క యధీనమునుండి స్వీకరింపవలెనని స్పష్టమైనది.

అగ్నివలన నొకమనుజుని కొసంగబడిన పిమ్మట నాస్త్రీయాదేవుని విడచి నరునిజేరి యతని వశమగును. అట్టి కన్యను మరియొకడు పెండ్లాడుటకు వీలులేదు. ఒకవేళ నతనిని విడచి యాస్త్రీవేరుగా నున్నను, ఆమెను పెండ్లాడుటకింకొనికధికారములేదు. ఎందుకన అగ్నిదేవునియధీనమందుండిన యకన్యను పెండ్లాడుమని వేదమువచించెను. ఇట్టిస్థితిలో నాయగ్నియిదివరకే న స్త్రీని తనవశమునుండి తొలగించి యొక మనుజుని

కడచేర్చినేని యది మొదలా దేవునకు కన్యపై గల పెత్తనము పోయినట్లే కదా! రెండవవాడా మెను పెండ్లాడదలచెనేని ఓ యగ్నిదేవా! ఈకన్యను నాకొసంగుమని యడుగవలెను.

అంతనా దేవుడేమనునో తెలియునా! ఓయీ! ఇదివరకే యీబిడ్డను, వేరొకని కొసంగితిని. ఇక నన్నడిగిన లాభమేమి! వెళ్ళుము.

అని ప్రత్యుత్తరమొసంగును. పాపము, ఆయాచకునిగతి యేమో తెలియునా? మొదటి మగనివద్దకేగి యాచింపవలెను. అతడు సరియైనపురుషుడగుచో తనభార్యను పరులకొసంగునా? ఏమన పెండ్లాడినది మొదలాకన్య, యతనివశమయ్యెను. ఈసంగతి వేదసమ్మతమై యెటుల ప్రఖ్యాతిగాంచెనో వినుము.

తండ్రి, పుత్రునివీడినను, కుమారుడు, తండ్రిని వదలినను, అతనికితడే పుత్రుడనియు, నితనికతడే తండ్రియనియు ధర్మము నిర్ణయించెను. ఎన్నిమార్పులుచేయ యత్నించినను పితృపుత్రసంబంధము తెగదు. వారిరువురు ప్రబల శత్రువులై జీవయాత్ర గడపినను తండ్రిమరణింపగా నాకుమారుడు ధర్మబద్ధుడై దహన సంస్కారములు జరుపవలెను. అటులనే భార్యాభర్తలసంబంధము త్రెంపదగినది కాదు. అటులకాదని త్రెంపినను అది పశుధర్మమగును. మనుజుడు పశువుగా మారుట కంగీకరించడు. కావున ప్రథమభర్తకు సంబంధించిన స్త్రీని, రెండవ పురుషుడు చేబట్టకూడదు. సారాంశమేమనగా, అగ్నిదేవుని

వశములోనున్న కన్యను మాత్రమే పెండ్లాడవలెననియు నటుల నొకని వశమైనపిమ్మట నాబిడ్డను వేరొకడు స్వీకరింపరాదనియు నెరుంగుము.

పై మంత్రమున మొదటి వాక్యములో "అదదత్" ఇచ్చెను, అనియు రెండవవచనమునందును "అదదత్" అనియు మరియు మూడవవాక్యమున సయితము "అదాత్" ఇచ్చెను. ఇట్లుండుటచే స్త్రీని ఒకనికీయ్య వలెననియు, నటుల నొసంగ బడిన పిమ్మటనే యామె నొకడు పెండ్లాడుటకు హక్కు కలిగి యుండుననియు స్పష్టమైనది. అంతియేకాని, వారు స్వయముగ పురుషుల వరింపరాదు. అయితే, తలిదండ్రులు ధర్మభ్రష్టులై దైవవాక్యమగు వేదధర్మమును ధిక్కరించి తమబిడ్డలనుదాన మొసంగక విడచిరేని, అట్టి యాపత్కాలమున నాకన్యలు స్వయంవర రూపమున పెండ్లాడవచ్చును. అప్పుడైనను ప్రాయశ్చిత్త మొనర్చుకొనియే, పురుషులు పెండ్లాడవలెను. అటుల గావించిన యెడల దోషమెంతమాత్రములేదు.

ఈ సమయమున నింకొకసంగతి గుర్తించవలసి యున్నది. చంద్రుడు, గంధర్వుడు, అగ్ని, వీరు మువ్వురు మనుజులు కారనియు వారు దేవతలనియు జ్ఞప్తియం దుంచుకొనుము.

"దేవతలనగా భూలోక వాసులగు విద్వాంసులనియు, జ్ఞానులనియు, వీరికంటె వేరుగా దేవతలు లేరనియు భ్రమింప కూడదు."

"యేదేవా, మనోజాతాః"

అను వేదప్రమాణము ననుసరించి దేవతలు మానసిక రూపులై యున్నారు. వారి దేహములు మనశరీరములవలె అన్న రసముచేతను, స్త్రీ పురుషుల సమావేశముల వల్లను జనించినవికావు. ఎముకలు, నెత్తురు, చర్మము, ఇవి వారి దేహములలో లేవు. అయితే నిక శరీరముండుటకు మార్గమెద్ది యని సంశయము కలుగవచ్చును.

మరియొక విధముగ దేవతా దేహములగూర్చి తెలిసికొనుము. స్వప్నమున అనగా కలలో మనకు కొన్ని దేహము లేర్పడును. అవి దేశములు తిరుగును. అపుడీ స్థూలదేహములు మంచములపై పడియుండును. ఇకనెచ్చటెచ్చటికోవెళ్లి వివిధ కార్యములొనర్చిన స్వప్నదేహము లెక్కడివో వానిలో మనయాత్మ యెటుల ప్రవేశించెనో అపుడారూపము లెటులుండెనో ఎముకలు నరములు నెత్తురు లేకయే అవియెట్లు తిరుగుచున్నవో తెలియజాలము.

దేవతారూపములునయితము స్వప్నదేహములవలె నుండునని యెంచుము. అయితే, కలలు, బహుకాలముండవు; ఈ దేవతాదేహము లన్ననో, చిరస్థాయిగానుండగలవు.

అట్టిదేవతలు కన్యలందావహించి వారిని రక్షించుచుందురు.

♦దేవతలదేహములు, ఆహారాదులు, లోకములు మున్నగువానినిగురించి "దైవరాజ్యము" అను రాబోవు గ్రంథముజూడుడు.

తండ్రి ఎపుడు కన్యాదాన మొనర్ప దలంచునో అపుడా దేవత లతనితో జేరి తమ యధీనమందుండు కన్యను పెండ్లికొడుకున కర్పింతురు. బిడ్డను దానము చేయునపుడు

"నేను దానముచేయుచున్నాను"

అని తండ్రి వచించును. యీవాక్యము వాస్తవమున నతనికి సంబంధించినదికాదు. ఏమన నావిషయమున వేదాభి ప్రాయము వేరై యుండును.

"దదామీత్యగ్నిర్వదతి"

అని వివాహమంత్రమున తలంబ్రాలు పోయునపుడు వేదపురుషుడు పై వాక్యము నెటుల పల్కెనో చూతుము.

అగ్నిః =( కన్యాదానమొనర్చిన ) అగ్ని దేవుడు, దదామి =(ఈకన్యను) ఇచ్చుచున్నాను, ఇతి = అని, వదతి = ప లుకు చున్నాడు. దీనింబట్టి కన్యను దానమొనర్చినది అగ్నియేగాని, తండ్రికాదు. అయితే బాహ్య దృష్టికి తండ్రి సహాయకుడుగ నుండెను.

అట్టిదశ లభించుటయు నాకన్యాదాతకు మహత్తరపుణ్య మనవచ్చును. అందుచే నతనికి స్వర్గసుఖముకూడా లభించును. ఇంతకును, సారాంశము తెలిసెనా? దేవతలచే దానము చేయ బడని కన్యను పురుషుడు పెండ్లాడరాదని విశదమగుచున్నది.

అనార్యుడు:-

మహాత్మా! కన్యను మనకొసంగునది దేవతలు కావ

చ్చును. ఎందుకన దేవుడే సర్వము మనకొసంగును. అయితే యింకొక సంశయము కలదు. కన్యయొక్క తండ్రి దేవుడుకాడు. అతడు నరుడు. దేవుడు స్వయముగా మనకొసంగక నరునిగుండా కన్య నిప్పించుటకు హేతువేమి?—

ఆర్యుడు:—

మిత్రమా!— బాగుగవినుము. లోకమున సహజముగ నొకనిమూలమున మనకేద్దియో లభించుచుండును. ఒక డొక దానిని మనకొసంగెనని చెప్పుటకు బదులు దేవుడీనాటి కీవస్తువును ప్రసాదించెనని వచింతుము. దీనిభావమేమి? దేవుడు ప్రత్యక్షముగ నవతరించి మనకేద్దియు నొసంగడనియు నతఁడొకని ద్వారా యిచ్చుననియు నెరుంగ వలెను. అది యటులుండనిమ్ము. దేవునకొక పదార్థము నివేదింప దలంచినపుడేమి చేసెదము. అతని కభిముఖముగ బోయి యిచ్చుచుందుమా? అటుల నొసంగము. ఒక నరునకో లేక విగ్రహమునకో సమర్పించి తన్మూలమున నామహాత్మున కాపదార్థము చేరెనని తలంతుము. అందుకే గదా-యొకనికి భిక్షమిడుచు కృష్ణార్పణము-శివార్పణము-అనుచుందుము. దేవునకేద్దియైన నర్పింపదలంతుమేని యెటుల నొకనరునిగాని విగ్రహమునుగాని మధ్యవర్తిగ నుంచుకొని యాపదార్థమును నివేదింతుమో అటులనే భగవానుడు నయితమొక పదార్థమును మనకొసంగదలచెనేని యొకనిద్వారా ప్రసాదించుచుండును.

ఇది లోకసిద్ధము. ఇంతకంటే వేరొక మార్గమీధరాత లమునలేదు. కావున వివాహసమయమున కన్యనొక పురుషున కొసంగదలచి దేవుడా మెయొక్క తండ్రిని ప్రోత్సహించి యతని మూలమున తనపని నెరవేర్చుకొనును.

అనార్యుడు:—

అయ్యా! తలిదండ్రులు బిడ్డల యోగక్షేమముల విచారించుట కల్ల. ఏమన- ధనాశచే, యెందరో తమకన్యలను ముసలి వారలకిచ్చి గొంతులు కోయుచుందురు. కావున వారొనర్చెడి పెండ్లిండ్ల కంటె కన్యలు స్వయముగ పతుల నిర్ణయించుకొనుట యే మేలుగదా?

ఆర్యుడు:—

ఓయీ! యెచటనో వేయికొకరు (పైసల) ధనమున కాశించి యటుల జేయుదురు. ఆకఠినాత్ములకు రౌరవాది నరకములు తప్పవు.

"పంచాశద్వత్సరా దూర్ధ్వం
నకుర్యాత్పాణి పీడనం"

అనగా ఏబది యేండ్లు దాటిన పిమ్మట పురుషులు పెండ్లాడరాదని ధర్మశాస్త్రమున కలదు. ఇట్లుండినను మనుజులక్రమ ప్రవర్తనలకు లోనై శాస్త్రధిక్కారమొనర్తురేని శిక్షార్హులుకాక తప్పదు. ధర్మవిరుద్ధపు పెండ్లిండ్లు జరుగకుండునటుల కట్టుదిట్టము లొనర్చుట సాంఘికులధర్మము. అటుల జేయని

యడల- సంఘనాశనము సిద్ధము. లేదా రాజ్య భ్రష్టులై విదేశీయుల హస్తములలో కీలుబొమ్మలై జీవింపవలసియుండురు.

అనార్యుడు:—

మహాశయా! తండ్రి తనబిడ్డను ముసలివారల కీయ్యకుండినను చిన్నతనమున అనగా 8, 9 వత్సరముల ప్రాంతమున పెండ్లిచేయుచో దోషముసంభవించును. ఏమన దైవవిధిచే భర్త మరణింపవచ్చును. అపుడు వైధవ్యము కలిగెనేని యెంత కష్టమో యోచింపుడు. ఆ స్త్రీ కామవశమున వ్యభిచరించి గర్భవతియై సంఘమునకు వెరచి కడుపుదిగత్రాగును. ఈవిపత్తు కలుగకుండుటకై యువతీ వివాహములు శ్రేష్టములుకావా?

ఆర్యుడు:—

మిత్రమా! నీవుచెప్పినటుల సమర్తయైన కన్య యొకని ప్రేమించి పెండ్లాడిన దనుకొనుము. కొలదికాలమున భర్త మృతినొందినచో నాయువతికి సయితము వైధవ్య మేర్పడక తప్పదు. అంతట కామమునజిక్కి రహస్యముగ వ్యభిచరించి గర్భధారణమొనర్చి విధిలేక మందులుతిని పిండమును పోగొట్టుకొనును. బాల్యమునగాని, యౌవనమునగాని పెండ్లాడినస్త్రీలు విధవలైన యెడల గర్భస్రావ విషయమున నిరువురుసమానులే. అట్టితరి కన్యా వివాహముల నిషేధింప నేల? ఒకవేళ వితంతువులకు పెండ్లిచేయుచో పై దోషము కలుగకపోవచ్చును. అపుడు కన్యావివాహములైనను యువతీ పరిణయములైనను ఒక్కటే.

అయితే పునర్వివాహమునకు హక్కు కలదాయని యడిగెదవు కాబోలు, లేనిమాటనిజము. అంతమాత్రమున యువతీ వివాహములొనర్చిన లాభ మేమి? వారిభర్త మరణించినయెడల వైధవ్యము తప్పునా? తప్పదు! అటుపై కడుపుదింపుకొను దోషము పూర్వమువలె సిద్ధపడును. విధవా వివాహముల కంగీకరింతువేని కన్యలకైనను, యువతులకైనను వివాహముచేయవచ్చును. ఎందుకన వారలకు వైధవ్యము సంభవించినపుడు తిరిగి పెండ్లి చేయుటకభ్యంతరములేదు. అయితే యిక కన్యావివాహములు కూడవని వాదింపక విధవా వివాహములు చేయవలెనని పట్టు పట్టెదవేని ప్రశ్నపరంపరలు బయలువెడలి ప్రత్యుత్తరముకై వేధించును. అపుడు వలలో జిక్కినపిట్టవలె గిలగిల కొట్టుకొనెదవు.

♦♦♦ రాబోవు గ్రంథములలో విధవా వివాహ ప్రశంస రాగలదు. అపుడందలి దోషములు తెలుపబడును.

కావున తల తోక లేని ప్రసంగములు మానుము. నిజ మెరుంగదలతువేని విధవా వివాహము లొనర్చుటకు యత్నించుట కంటె స్త్రీలకు వైధవ్యము కలుగకుండు నటుల యోచింపుము. నీవు పురుషుడవై స్త్రీల విషయమున జాలిజెందుట సంతోషము. కాని ఆకనికరము పురుషజాతియందేల లేదో తెలియకున్నది. అదియెటులనో వినుము. పురుషులు మరణించనిది స్త్రీలకు వైధవ్యము కలుగదు. ఈమర్మము పలువురకు తెలి

యదు. తమజాతి నశించుచున్నదని యెరుంగక పురుషులు స్త్రీల కష్టముల తొలగింప నెంచుచుండిరి. ఇదివింతగాక మరేమి? మొదట పురుషులకు ఘోరవిపత్తు సంభవించెను. అది యెద్ది యన- నూరు వత్సరములు బ్రతుకదగినవారు కొద్దియీడులో మృతినొందుట కంటె పాపము వేరొండులేదు. చిరకాలము జీవించి లోకసుఖముల ననుభవించి యానంద మొందవలసిన పురుషులు మృత్యుదేవతకు బలియగుట తటస్థించునేని- యెంత దుఃఖింతురో వర్ణింపగలమా? స్త్రీల విషయమై జాలిజెందిన గుండె పురుషుని విషయమున పాషాణ ప్రాయమగుటకు హేతు వేమి?

అయ్యో! పాపము శమించుగాక. పురుషులు దీర్ఘాయుష్మంతులు కాజాలక-కాంతల నానందాబ్ధిలో నోలలాడింప కుండుట యెంతఘోరము, అందుకై తగిన యుద్యమము లేవనెత్త కుండుట న్యాయమా? దౌర్భాగ్య దామోదర చక్రవర్తినై "నేనొక మనుజుడనని" తలయెత్తి తిరుగుటకు సాహసింతువా? ఇది యొకమగతనమా?

నీకు దేశోద్ధరణ బుద్ధియుండెనేని పురుషపుంగవుడవై యుందువేని ఆర్యరక్త సంభవుడవైతివేని-- వెంటనే పురుషజాతి నుద్ధరింపుము.

స్వజాత్యభిమానముచే నిటుల బల్కితినని తలంపకుము. స్త్రీలయెడగల్గు దయచేతనే పురుషజాతిని రక్షింపుమని హెచ్చరించితిని. ఎందుకన- వారు సురక్షితముగ నున్నయెడల స్త్రీలకు

వైధవ్యము కలుగనేరదు. ఈవిధముగ మేలుచేకూరును. అంత కన్యా వివాహ నిషేధశాసనములు- పునర్వివాహ విధాయక ప్రసంగములు జగన్నాటకమున నృత్యమొనర్ప నవసరములేదు. ధర్మవిధ్వంసివై వేదదూరుడవై జాతీయతా వృక్షమునకు వేరు పురుగువై దైవకోపానల జ్వాలలకు గుఱివై నరకకూపమున కరుగకుము. ఎచ్చట రోగమో అచ్చట చికిత్స చేయవలెను. వైధవ్య రోగమునకు హేతువు పురుషులందుండెనని మరువకుము. కావున స్త్రీలకు పునర్వివాహము లొనర్చుటకు బదులు పురుషుల యాయువును నమర్ధింపుము. శీఘ్రమరణములకు కారణము లరయుము. మనపూర్వులను (అనగా ఎప్పటివారినో కాదు- తాతముత్తాతలను) కనులార చూచుచున్నాము. వారి వయస్సు 80-90 సంవత్సరములవరకుగలదు ఆబలము- ఆయాహారము- మనశ్శక్తి- ధైర్యసాహసములు- పట్టుదలలు- అతీతములై యుండెను. కారణమేమి? వారు వర్ణాశ్రమ ధర్మముల బాటించుచుండిరని చెప్పకతప్పదు. పొట్టకూటికై అన్యవృత్తుల స్వీకరింపక కులవృత్తులలో నుండిరి. జాతీయ భాషాపఠన మొనర్చిరి. మ్లేచ్ఛభాషాభ్యాస మొనర్పరైరి. ధర్మచింతనము విడిచి స్వేచ్ఛా ప్రసంగముల జిక్కకుండిరి. శాస్త్రముల ననుసరించి మంచిచెడ్డల గ్రహించుచుండిరి. ఇహచింతనమునకంటెపరచింతనమున విశేషముగ నిమగ్నులై యుండిరి. స్త్రీలు పతిభక్తికల్గి నీతి నియమముల మెలంగిరి. ప్రజలు ప్రభుభక్తితో నుండిరి. ప్రభువులు ప్రజలను బిడ్డలవలె జూచుచుండిరి. జాతిభేదములుం

డినను పరస్పర ద్వేషములులేక నొక్కజాతిగ చరించిరి. దేశాభిమానము- దేవాభిమానము- మతాభిమానము- ధర్మాభిమానము- మెండుగ నుండెను.

పై నియముల నుల్లంఘించుటయే మన యాయుర్విహీనతకు హేతువు రానురాను పురుషమరణములు పెరుగుచుండ నిక విధవాసంఖ్య హెచ్చకుండునా? అడుసు త్రొక్కనేల? కాలు కడుగనేల?

"Prevention is better than cure" అను సామెత నెరుంగవా? కావున స్త్రీలకు వైధవ్యదశ లేకుండుటకై తత్ప్రతిబంధకము లాలోచించుట శ్రేయము.

అనార్యుడు:—

అయ్యా:— ఆయువు బ్రహ్మలిఖితమై యుండ దానిని పొడగించుటయు-తగ్గించుటయు సాధ్యమని వేదము వచించునా?

ఆర్యుడు-

మిత్రమా:— బ్రహ్మలిఖిత మొగ విధముగ నుండినను దీర్ఘాయువుకయి యత్నింపుమని వేదమునకలదు. చూడుము.

1. శతం జీవేమ సరదస్స వీరాః
2. జీవేమ శరదశ్శతం
3. శతమానం భవతి శతాయుః పురుషః
4. దీర్ఘాయురస్తుమే పతిర్జీవాతు శరదశ్శతం
5. శతంజీవ శరదోవర్ధమానః

6. త్వష్టా సహస్రమాయూగ్ంషి దీర్ఘ మాయుః కృణోతువాం

7. అయం కుమారో జరాయంధయతు దీర్ఘమాయుః

8. అయుర్దాదేవ జరసంగృణానో

ఈ పైమంత్రములలో "శతం - శరదః - శతాయుః దీర్ఘాయుః - సహస్రిమాయూగ్షి" - మున్నగు శబ్దముల చే, నూరు లేక వెయ్యి వత్సరములు, మానవుల యాయుర్దాయ మని అర్థమగుచున్నది. జీవేమ, జీవాతు, జీవ, మొదలగు పదములచే "జీవింతుముగాక" యని స్ఫురించుచున్నది. కావున నొసట వ్రాసిన వ్రాతను ఈశ్వరానుగ్రహమున పెంచవచ్చు నని వేదము తెలుపుచున్నది.

అనార్యుడు:—

అయ్యా! వివాహములు ధర్మబద్ధమని, కామసంబంధమని రెండురకములుగ వివరించితిరి. అందు ధార్మికవివాహములు ఇహ లోక సుఖమునేగాక! పరలోకసౌఖ్యమును ప్రసాదించుననియు నుడివితిరి. ఇహలోఖసుఖమనగా భూలోఖసుఖమని తెలియు చున్నది. ఇక పరసౌఖ్యమన నెట్టిది?

ఆర్యుడు—

ఓయీ! అనంతకోటి బహ్మాండనాయకుండగు భగవా నుడు కనులకు గోచరించు నీభూలోకమును సృజించి అందనతం ములగు జీవకోట్లనుకల్పించి వారలకు మాత్రమే సుఖమొసంగు

చుండెనని తలంపకుము, ఆనక్షత్రములు- గ్రహములు-లెక్కకు మిక్కిలిగా నున్నవి, అవి అన్నియు మనభూమికంటె చాలాగొప్పవి, పుడమి యందువలె నాపరలోకములలోను జీవులెందరో వసించుచుండిరి. ఖగోళమందలి నక్షత్రాది మండలములన్నియు పరలోకములనియు,అమృతలోకములనియు,స్వర్గములనియు,పిలువబడును. అందు వసించుజీవులకు దేవతలనిపేరు. వారనుభవించు సౌఖ్యము వర్ణనాతీతము. దానినే పరలోకసౌఖ్యమనెదరు.

అనార్యుడు:—

మహాత్మా! పరలోకములు కలవని వేదప్రమాణములు కలవా?

ఆర్యుడు:—

మిత్రమా! జీవులకు పరలోక ప్రాప్తిని కలిగించుటకే వేదము ప్రవర్తించెను. మరియు స్వర్గలోకములు (అనగా దేవతాలోకములు) కలవని వేదవాక్యముల నభిలషింతువా? మంచిది. వినుము.

"నక్షత్రాణివై దేవగృహాణి"

(కృష్ణయజుర్వేదం)

నక్షత్రములు మున్నగు మండలములలో దేవతలు వసింతురు. అందువలన నవి దేవగృహము (అనగా దేవలోకము)

లనబడును. అవి యెన్నియో కలవు. అందు విశేషముగ మనము గమనింపదగినవి.

"ఏకవిగ్ శతిర్వై దేవలోకాః"

(కృష్ణయజుర్వేదం)

యిరువదియొక్కటిగ నున్నవి.

"స్వర్గేలోకే మధుమత్ పిన్వమానాః"

(అధర్వవేదము)

స్వర్గలోక ముండెననియు నందలి పదార్థములు బహు తీపిగా నుండుననియు వివరింపబడెను.

*(స్వర్గముల గురించి "దేవరాజ్యము" అను రాబోవు గ్రంథమున చూడుడు.)

అనార్యుడు?—

అయ్యా! అనంత కళ్యాణ గుణవిశిష్టుండగు పరమేశ్వరుని సృష్టివైచిత్ర్యమున నెన్నియో లోకములుండవచ్చును. ధర్మ వివాహములవలన నాయాదంపతులకు స్వర్గలోకములు కలుగునని వేదము వచించెనా?

ఆర్యుడు—

ఓయీ! సంశయముల దీర్చుటకు వేదముకంటె వేరొక మించిన ప్రమాణములేదు.

1 ఉరుంలోకం సుగ మత్రపంథాం
కృణోమితుభ్యం సహపత్న్యైవధు"
అథర్వవేదము 14 కాండ

వధు=ఓకన్యా! నీకు, ఉరుంలోకం=గొప్పలోకము అనగా స్వర్గ లోకము లభించుటకు, పంథాం=మార్గమును, కృణోమి=చేయు చున్నాను.

2 ధాతుశ్చయోనౌ=సుకృతస్యలోకే
స్యోనంతే సహపత్యా కరోమి.
(కృష్ణయజుర్వేదము)

సుకృతస్యలోకే=పుణ్యలోకమగు, ధాతుశ్చ=బ్రహ్మ దేవునియొక్క, యోనే=స్థానమందు, తే=నీకు, పత్యాసహ=పెనిమిటినైన, నాతోకూడా. (నిన్నుగొనిపోయి అచ్చట) స్యోనం కరోమి=సుఖస్థానమును చేయుచున్నాను. అనగా మనమిద్దరము పరలోకమునకేగి సుఖమనుభవింపగలము. వేదకర్మల ననుష్ఠించినయడల మనకీరువురకు స్వర్లోకసుఖము కల్గును.

3. "ఆరోహసూర్యే అమృతస్యలోకం
స్యోనం పతిభ్యోవహతుం కృణుత్వం"
(అథర్వవేదం 14 కాండం)

ఓకన్యా! ఆరోహ= ఈబండి నెక్కుము. ప్రస్తుతము మన యింటి కేగుదము. అచ్చట భూలోక సుఖము లనుభవించి

పిమ్మట, అమృతస్యలోకం= అమృతలోకమును అనగాస్వర్గ మును చేరుదము.

4. "సుకిగ్ శుకగ్ శల్మలిం విశ్వరూపగ్
హిరణ్య వర్ణగ్ సువృతగ్ సుచక్రం
ఆరోహ వధ్వమృతస్య లోకం
స్యోనం పత్యే వహతుం కృణుష్వ"
(కృష్ణయజుర్వేదం)

ఓకన్యా! నిన్ను పెండ్లాడితిని. ఇకమనయింటికి పోవుదము రమ్ము. సుకిగ్ శుకగ్ = మంచి కింశుకవృక్షముల తోడను శల్మలిం= బూరుగు చెట్లతోడను చేయబడినట్టిన్ని, విశ్వరూపం నానారూపములతో కూడినట్టిన్ని, హిరణ్యవర్ణం=మంచిరంగులు కలిగినట్టిన్ని, సువృతం=గుండ్రని, సుచక్రం= మంచి చక్రము లుగల రథమును, ఆరోహ = ఎక్కుము. మరియు, స్యోనం = సుఖకరమైన, అమృతస్యలోకం = దేవలోకమునుగూర్చి పత్యే వహతుం = పెనిమిటినైన నన్నుపొందుటకు కృణుష్వ = చేయు ము. ఈబండి నెక్కుట యెందు కనగా.

కేవలము గృహసౌఖ్యముల ననుభవించుటకు కాదు. స్వర్గసౌఖ్యములుకూడా పొందుటకని యెరుంగుము.

"పక్షీహాభూత్వాతి, దివస్సమేతి"
(అథర్వవేదము)

చూచితివా! మరణానంతరము పక్షిరూపమునుపొంది స్వర్గమునకు పయనమై యచ్చటసుఖమును పొందవచ్చునని వేదము బోధించుచున్నది. అందువలన, ధర్మ వివాహములు పరలోకపర్యంతము భార్యా భర్తలను బంధించునని తెలియుచున్నది.

5. "ఋతస్యయోనౌ. సుకృతస్యలోకే
స్యోనంతేఅస్తు, సహానంభలాయై."
(అధర్వవేదము 14 కాండ)

ఈమంత్రిమున సయితము సుకృతలోకమగు స్వర్గమున తనతోకూడా భార్యకు సుఖముకలుగునని సూచించున్నాడు.

ఆనార్యుడు:—

అయ్యా!— స్వర్గము లభించుట బహుదుర్లభమని యిదివరకు వినియుంటిని. అనేక సంవత్సరములు పుణ్యకార్యము లొనర్చినగాని యదిలభింపదు. పెండ్లాడినపిమ్మట కొలదికాలమునకు భర్తమరణించెనేని పుణ్యమొనర్చుటకు వీలు కలుగదు. ఇట్లుండ నికభార్యా భర్తలకు స్వర్గములభించుటెట్లు?

ఆర్యుడు:—

మిత్రిమా! బాగుగ ప్రిశ్నించితివి. వినుము మతముల న్నిటిలో వేదమతము సర్వజ్ఞత్వము కల్గియున్నది. అది స్వర్గవిషయమున నాశజూపుటయేగాక తత్సాధనముల సయితము ప్రసాదించును. అటుల నడుచుటకు యత్నించి యాపనుల పూర్తిచే

యుక మరణించెనేని స్వర్గము లభింపదని తెలిసి యతడుత్వరలో చావకుండుటకై మార్గములనయితము జూపును. దీర్ఘాయుష్య పద్ధతు లాచరించుటకై స్త్రీపురుషు లిరువురకు 8 మొదలు 12 వత్సరముల లోపల నుపనయనముల జేయవలెను. ఎందుకన- నాయీడులో వారి హృదయములు శుద్ధములుగ నుండును. ఎయ్యది బోధించినను వానిని సులభముగ గ్రహించి మనసున నిలుపుకొని యావజ్జీవము యాచరింప బూనెదరు. బాల్యము నుండి యాయుర్వృద్ధికై పూర్వకాలపు బాలురనెటుల పోషించు చుండిరో చూడుము.

పుట్టిన వెంటనే "జాతకర్మ" అను నొక సంస్కారము జరుపుదురు. అందు

"అయంకుమారో జరాంధయతు, దీర్ఘమాయుః"

తనకుమారుడు దీర్ఘాయువును పొందుటకై ధ్యానిం పబడుచున్నది.

"సర్పిషాన్ ఫలీకరణ మిశ్రాన్ అంజలినోత్తరై
స్త్రీస్సిన్స్రిః ప్రతిస్వాహాకారగ్ సగ్ శాస్తి"

అను సూత్రప్రకారము ఆవాలు తవుడు కలిపి హోమ మొనర్చెదరు. ఆహోగవలన నాధ్యాత్మిక లాభమునకు తోడుగ ఆరోగ్యము- ఆయుష్యము వృద్ధియగును.

పిమ్మట "నామకరణము" అనునొక కర్మచేయుదురు. దానిలో బిడ్డనొక్క మాసనామము, నక్షత్రనామము, వ్యావ

హారిక నామము వ్రాసి "దీర్ఘాయుష్మాన్భవ" అనగా దీర్ఘాయుష్యమును పొందుము అని యాశీర్వదింతురు.

తరువాత కొంతకాలమునకు "అన్నప్రాశనము" అను నొక కర్మ మొనర్తురు. అందులో బాలురకు అన్నము ముట్టించ బడును.

"శివాస్త్వాఆప ఓషధయస్సంతు
అనమీ వాస్త్వా ఆపఓషధయస్సంతు"

అని పఠింతురు. అనగా ఉదకము, అన్నము, "ఈబాలునకు శుభమును, ఆరోగ్యమును కలుగజేయుగాక" యని భగవానుని ప్రార్థించుచున్నారు.

మూడవయేట పుట్టు వెంట్రుకలు తీయుటకై "చౌలము అను నొక కర్మ గావింపబడును. అందలి మంత్రముల జూడుము.

"యేనావ పత్యవితాక్షురేణ+వపతే
దమస్యా యుష్మాన్ జరదష్టి ర్యథాసదయం"

ఇందు "ఆయుష్మాన్" - "జరదష్టిః" అను శబ్దములు ముసలి తనమువరకు జీవించి యుండవలెనని సూచించు చున్నవి

"శుంధిశిరో మాస్యాయుః- ప్రమోషీః॥

ఈమంత్రము న సమితము, ఆయుః= ఆయువు నశింప కుండు గాకయని ప్రార్థింపబడెను.

ఈచౌలకర్మమునకు "అయుష్కర్మ"మనినామాంతరము కలదు. ఎందుకనగా పుట్టువెంట్రుకలుదీసి జుట్టుపెట్టించు నెడల దానివలన నాయువు వృద్ధియగును. అందుచే నాకర్మకు ఆయుష్కర్మమని పేరుకల్గెను.

దీనిని "చూడాకర్మ" మనియు బిలుతురు. చూడాశబ్దమున కర్థముజుట్టు. శిఖాధారణమువలన అయుర్వృద్ధికలుగును.

*(జుట్టుపెట్టుకొనుటచే నాయుర్వృద్ధి యెట్లుల
గలుగునో రాబోవుగ్రంథములలో తెలుపబడును.)

ఎనిమిదవయేట ఉపనయనము చేయుదురు. అపుడు బాలుని జేరి యాచార్యుడీక్రింది మంత్రముచే నభిమంత్రించును.

"ఏషతే దేవసూర్య బ్రహ్మచారీ
తంగోపాయ సూర్యపుత్ర స్స దీర్ఘాయుః"

ఓ సూర్యదేవా! ఈబాలుడు మీయాజ్ఞల నిర్వహించును. సః = అతడు, మామృత = (అల్పకాలమున) మరణింపకుండుగాక. మరియు దీర్ఘాయుః = మిక్కిలి ఆయువుకలవాడై యుండుగాక. అని ధ్యానింపబడును. పెద్దల సంకల్ప బలముచే బిడ్డలు దీర్ఘాయుష్మంతు లయ్యెదరని వేదము నిర్వచించెను.

ఉపనయనమైనది మొదలు ప్రతిదినము బాలుడు "సంధ్యావందన"మొనర్చును. అందు మూడు వేళల నీక్రిందివిధముగ ధ్యానించుట కలదు.

"ఆయుః పృథివ్యాం ద్రవిణం బ్రహ్మవర్చసం
మహ్యాం దత్వా ప్రియాతుం బ్రహ్మలోకం"

ఓ దేవా! బహుకాలము జీవించుటకై యాయుష్యము నొసంగుము. పిమ్మట పరలోక సుఖముకొరకు బ్రహ్మవర్చస్సును ప్రసాదింపుము. అని ధ్యానించును.

"ఋషయో దీర్ఘ సంధ్యత్వాత్
దీర్ఘాయుష్య మవాప్నుయుః"

అను ప్రమాణము ననుసరించి బాగుగ సంధ్యావందన మొనర్చినయెడల బహుకాలము జీవింప వచ్చునని తెలియు చున్నది. మహర్షులు దీర్ఘకాలము సంధ్యావందనముచేసి చిరం జీవులైరి.

ఇంతియేగాక మన బ్రహ్మచారి గురుకులమున జితేంద్రి య్యుడై ఆహార వ్యవహారములలో, నాయుర్వృద్ధిగల పద్ధతు లవలంబించును. ఈవిధముగ పురుషులు నూరువత్సరములు జీవించుటలో సంశయములేదు. అట్టివారిని పెండ్లాడిన కన్యకు వైధవ్యముసంభవించుట కలలోనివార్త. విధవావివాహములకై విలపించు వారుందురేని తమశక్తినంతయు ధారపోసి పురుషుల ను దీర్ఘాయుష్మంతులుగ నొనర్చుటకై గురుకులముల నిర్మింప వలెను. ఈపనులు అతిచురుకుగచేయ నంతకాలము దేశాభివృద్ధి కలుగదు. బాలురతోపాటు బాలికలను కూడా గురుకులము

నకు పంపవలెను. ఆగురుకుల మెచ్చటనో- గురువులెవ్వరో తెలి యునా?

"పతీసేవా గుకౌవాసో" (మనుస్మృతి)

పతియే సతికి గురువు. అతని నివాసమే గురుకులము. ఇదియార్యధర్మము. గురువు తనశిష్యుని దీర్ఘాయుష్మంతునిగ నాశీర్వదించునట్లు భర్తయు, భార్యను ఆయుర్వృద్ధికై యాశీర్వ దించును. చూడుము.

"మయా పత్యాప్రజావతీ, సంజీవ, శరద, శ్శతం"

(కృష్ణయజుర్వేదం)

ఓకన్యా! మయాపత్యా = పెనిమిటినైన, నావలన; ప్రజావతీ = సంతతిని పొంది, శరదశ్శతం = నూరువత్సరములు సంజీవ = జీవింపుము అని భర్తయగు గురువు శిష్యరూపిణి యగు భార్యను దీవించుచున్నాడు. ఈవిధమగు వేదసాంప్రదా యమును గమనించుచో మనుజులకు అకాలమృత్యువు కలుగ నేరదు.

ఇకస్త్రీలకు వైధవ్య మెక్కడిది? ధర్మభ్రష్టతచే మరణ ములు కలుగును. కావున నీతిమంతులు ధర్మరక్షణ మొనర్చుట కర్తవ్యము.

అన్యారుడు:—

మహాశయా! పతినిసేవించుటకంటె సతికి వేరొక వ్రత ములేదా! ఈవిషయమున వేదప్రమాణమును చూపుడు.

మరియు పురుషుడొనర్పవలసిన వ్రతమున్ను తెలుపుడు.

ఆర్యుడు:—

మిత్రమా! వివాహసమయమున పురుషుడు తనభార్య యొక్క కాలుపట్టుకొని ఏడడుగులు నడిపించును. ఆకలాపము నకు సప్తపది యనిపేరు. అట్లునడిపించునపు డీక్రింది మంత్రముచే కన్య, నభిమంత్రించును. అందుపతి ననుసరించి వర్తించు టే సతికి పరమ ధర్మమని నుడువబడెను. వినుము-

1. "సఖాసప్త పదాభవ++
సా, మా, మనువ్రతాభవ." (వివాహ మంత్రము)

వేదపురుషుడు పెండ్లికూతురునకు "సా" లేక "ఋక్" అనియు పెండ్లికొడుకునకు "అమ,సామ" యనియురహస్యనామ ములనిడెను. ఈమంత్రములతో పెండ్లికొడుకు, కన్యను "సా" యనునామముచే బిలుచుచున్నాడు.

సా=ఓకన్యా! మాం=నన్ను, అనువ్రతా=అనుసరించి దానవు, భవ=కమ్ము. మరియొక మంత్రమునుచూడుడు.

2. ఆశాసానా సౌమనసం, ప్రజాం, సౌభాగ్యం
రయిం! పత్యురనువ్రితా భూత్వాసన్నహ్య
స్వామృతాయకం॥

[అధర్వవేదము 14కాండం 1అను
వాకం 1సూక్తం 42మంత్రము]

ఓ కన్యా! పత్యుః=పెనిమిటినైన నన్నుగూర్చి, అను వ్రతా=అనుసరించిన వ్రతముకలదానవుగా, భూత్వా=అగుచు (ఉండుము.) అని పురుషుడు పెండ్లికూతురును హెచ్చరించు చున్నాడు. ఈ రెండు మంత్రములలో భార్య, భర్త ననుస రించి వర్తించుచు జీవయాత్ర గడుపవలెనని విశదమగుచున్నది. కావుననే ఆమె పతివ్రతయని ఖ్యాతిగాంచెను.

---

పురుషుడు సతీ వ్రతమొనర్ప వలెనని వేదమునలేదు. ఆయితే యిక నతని వ్రతమెట్టిదో గ్రహింతము. స్త్రీ తన యుపనయన కాలమున (అనగా వివాహసమయమున) నెటుల పతియొక్క వ్రతమును స్వీకరించెనో అటుల నుపనయన కాల మున పురుషుడు బ్రహ్మయొక్క వ్రతము ననుష్ఠించుటకు ప్రతిజ్ఞ యొనర్చుచున్నాడు.

"యద్బ్రాహ్మణానాం, బ్రహ్మణి, వ్రతం + + +
యన్మఆత్మన, ఆత్మని, వ్రతం,
తే నాహగ్ం, సర్వవ్రతో, భూయాసం"
(కృష్ణయజుర్వేదం)

బ్రహ్మణి = బ్రహ్మమునందు, వ్రతం = వ్రతము, యత్ = ఎయ్యదికలదో, అదియే నావ్రతము, మే = నాయొ క్క, ఆత్మకు = అనగా మనస్సునకు, ఆత్మనివ్రతం = పరమా త్మయందు వ్రతము, యత్ = ఏదికలదో, ఆయొక్క వ్రతము

చే, సర్వవ్రతః భూయాసం = సమస్తవ్రతములనొనర్చిన వాడ నయ్యెదను.

అనిస్మరింపుచు పురుషుడు బ్రహ్మవ్రతమొనర్చుటకు కంకణము కట్టుచున్నాడు. కనుక స్త్రీలకు పతియొక్క వ్రతము, పురుషులకు బ్రహ్మయొక్క వ్రతము ముఖ్యములని తేలినది.

అనార్యుడు:—

మహాశయా! పతినిసేవించుటే స్త్రీలకు ధర్మమగుగాక. అట్టి వ్రతమనుష్ఠించు కాలమెపుడు! ఆవిషయము వేదమున కలదా!

ఆర్యుడు:—

మిత్రమా! వేదసంబంధ వ్రతములకు ప్రారంభకాలము ఉపనయన సమయమని యెరుంగుము.

అనార్యుడు:—

అయ్యా! ఉపనయనమునకు ముఖ్యకాలమెద్ది?

ఆర్యుడు:—

ఓయీ! ఉపనయనము (అనగా వడుగు) వేదధర్మముల ననుష్ఠించుటకేర్పడెను. వేదమంత్రములుఏడురకములుగనున్నవి. తెలుగుభాషలో, సీసపద్యము, కందపద్యము, తేటగీత, మున్నగు భేదము లెటులకలవో అటులనే, వేదమున ఏడురకములైన నడకలు మంత్రములలో కలవు. అందు ముఖ్యమైనవి.

1. గాయత్రీ ఛందస్సు
2. త్రిష్టుభ ఛందస్సు
3. జగతీ ఛందస్సు

అని మూడు విధములుగనుండెను. వీనిలో చాలాముఖ్యమైనదియు, మంత్రములకు మూలమైనదియు, 1. గాయత్రి ఛందస్సు అనగా గాయత్రి మంత్రము సర్వవేదసారమైయున్నది. అదినాల్గు పాదములతో నుండును. (అయినను వ్యవహారమున మూడుపాదములతో నొప్పును). ప్రతిపాదమునకు నెనిమిది యక్షరములు కలవు. ఇట్టిమంత్రమును మోక్షసిద్ధికై యుపనయన కాలమున నుపదేశింతురు. ఎనిమిదక్షరముల మంత్రము ఉపదేశింప బడుటచే నొకనికి వడుగుచేయుటకు కూడా తగిన వయస్సు ఎనిమిదేండ్లని నిర్ణయింపబడెను. మూడవదియగు జగతీ ఛందస్సునకు ప్రతిపాదమున 12 అక్షరము లుండుటచే నుపనయన కాలము 12 ఏండ్లవరకు పరమ పవిత్రమై యుండునని వేదవేత్తలు నిశ్చయించిరి.

అనార్యుడు:—

మహాత్మా! పురుషుడు బ్రహ్మవ్రత మనుష్ఠించుటకు వడుగుచేసుకొనవలెనని తెలినది. అది ఎనిమిదవ వత్సరముననే ప్రారంభింప వలెనా?

ఆర్యుడు:—

ఓయీ! ఎనిమిదవ వత్సరమున జేయుటయే సర్వోత్త

మము. మరియు 12 వ వత్సరము దాటులోపల నైననుచేయు టయే ముఖ్యము.

అనార్యుడు:—

అయ్యా, పురుషుల యుపనయనకాలమును దెలిపితిరి. ఇక స్త్రీల విషయమై తెలుపగోరెద.

ఆర్యుడు:—

ఓయీ! ధర్మానుష్టకాల మిరువురకు నొక్కటే అనగా ఎనిమిదిమొదలు 12 దాటుటకు పూర్వమే పతిని సేవించుటకు పూనవలెను.

అనార్యుడు:—

మహాశయా! పతినిసేవించుటకై యొనర్పబడు కర్మ వివాహమను పేరుతో వ్యవహరింపబడుచుండును. దానికి ఉప నయనమని పేరుపెట్టుటకు హేతువేమి?

ఆర్యుడు:—

మిత్రమా! అధర్వవేదమున నొకసూక్తముకలదు. అది బ్రహ్మవ్రతమును బోధించుటకేర్పడెను. కావున ఉపనయనకర్మ యందు వినియోగించు సూక్తమని యర్థమగుచున్నది. ఉప నయనమైన బాలునకు బ్రహ్మచారియనిపేరు. అతనిని గురించి వివరించుటంజేసి పై సూక్తము బ్రహ్మచారీ సూక్తమని పిలువ బడుచున్నది. యీ వేదమంత్రమును చూడుము.

"ఆచార్య ఉపనయమానో, బ్రహ్మచారిణం,
కృణుతేగర్భమంతః తంరాత్రీస్తిస్ర
ఉదరేభిభర్తి తం జాతం దృష్టుమభిసయంతి దేవాః

అనగా ఆచార్యుడు ఉపనయన మొనర్చిన పిల్లవానిని మూడురాత్రులు తనకడుపులో దాచుకొని యటుపైన నతనిని విడుచుచున్నాడు. మాతృగర్భమునుండి నూతనముగ జనించిన బాలుని చందమున నుపనయన సమయమున నా పిల్లవాడు ఆచార్య గర్భమునుండి క్రొత్తగా పుట్టిన వానివలె నగును. ఇటుల రెండుసార్లు జనించుటచే నతడు ద్విజుడనబడును. ద్వి= (అనగా) రెండుసార్లు జ= (అనగా) జన్మించినవాడని యర్థము.

ఈ మంత్రములో ఉపనయమానః అను శబ్దముండుటచే పైసూక్తము ఉపనయన సంబంధమని తెలుపుటకెంత మాత్రము సంశయములేదు. దానిలో పురుషులకు ఉపనయన విధానమును బోధించి స్త్రీలకుకూడా ఆకర్మ సంబంధమును హెచ్చరించెను. వారికి కావలసిన విద్యాసంబంధ జ్ఞానముకాని తదితర విషయకమగు తెలివికాని లభించుటకై యవసరమేర్పడెనని తలచి యొక గురువును నియమించుటకు వేదపురుషుడభిప్రాయపడెను. స్త్రీల విషయమై గురువువేరుగా లేడనియెరింగి పతినే యాచార్యుడుగా నిశ్చయించెను. అందుకై యీక్రింది వాక్యమును చూడుము.

"బ్రహ్మచార్యేణ కన్యాయువానం విందతేపతిం"
(బ్రహ్మచారీసూక్తం)

బ్రహ్మచర్యవ్రత మవలంబించి కన్య యువకుడైన పతిని సేవింపవలెననికలదు. ఉపనయన సంబంధమైన సూక్తములో పతి నాశ్రయింపుమని తెలుపుటచే వడుగుచేసుకొని వెంటనే పతికులమున కేగవలెనని విశదమగుచున్నది. ఉపనయనకాలమున బాలురు గురువు నాశ్రయించి వెంటనే గురుకులమును చేరినటుల స్త్రీల విషయమున్ను గ్రహింపవలెను. కావుననే పతినాశ్రయించి బ్రతుకుటకేర్పరచిన కర్మకు ఉపనయనమను పేరుకల్గెను. నిజముగా పతిని వరించునట్టి కర్మను ఉపనయనమనుట న్యాయము.

(1) "స్త్రీణాముపనయనస్థానే
వివాహంమను రబ్రవీత్"

స్త్రీలయొక్క ఉపనయన స్థానమందు వివాహశబ్దము వాడవచ్చుననియు,

(2) "వైవాహికోవిధి స్త్రీణాం
ఔపనాయనిక స్స్మృతః"

స్త్రీలకు వివాహ సంస్కారము ప్రత్యేకముగ లేదనియు ఉపనయనమునే వివాహమని యెరుంగుడనియు తాత్పర్యము. ఇటుల ధర్మశాస్త్రములు దెలుపుచున్నవి.

అనార్యుడు:—

అయ్యా, వివాహము సాంఘిక సమస్యకాదనియు మత సంబంధమనియు ప్రిప్రిథమమున తెలిపియుంటిరి. అదినిజమగు నేని వేదమున వివాహశబ్దముకలదా?

ఆర్యుడు:—

ఓయీ ఆశబ్దము కలదు వినుము.

"యద్దుష్కృతం యచ్ఛమలంవివాహే
వహతౌచయత్। తత్సంభలస్య
కంబలే, మృజ్మహే, దురితంవయం"
(అధర్వవేదము 14 కాండ)

అనగా వివాహ సమయమున దంపతు లొనర్చిన పాప మెద్దియైన కలదేని "అది ముఖప్రీతి వచనములచే కాలయాపన మొనర్చు కలుషాత్ముని కొంగున నుంచుచున్నాము" అని ఈ మంత్రమున వివాహ శబ్దము ప్రియోగింపబడెను.

అనార్యుడు:—

మహాత్మా! మనుజుడు విధిగా పెండ్లాడవలెనని వేదమున కలదా?

ఆర్యుడు:—

మిత్రిమా! అదియునుకలదు. శ్రిద్ధతో వినుము. పంచ భూతములనుండి శబ్దము- స్పర్శము- రూపము- రసము- గంధము

అను ఐదువిషయములు వెలువడుచుండును. విషయాసక్తులై వానిని మోహించి భోగించి సుఖింపదలంచు వారెల్లరు పెండ్లాడి బిడ్డలను గనినగాని ముక్తి చేకూరదని వేదము తెలుపుచున్నది. అట్టి విషయలంపటుని గూర్చి,

"ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్సీః"

(ఉపనిషత్తు)

ఓయీ! "నీవు తప్పక సంతానప్రయత్నమొనర్పుము" అని వేదము హెచ్చరించెను. అనగా పెండ్లాడుమని యర్థము.

"పరీక్ష్యలోకా న్కర్మచితా ద్బ్రాహ్మణో
నిర్వేదమాయాన్నా స్త్యకృతః కృతేన"

విషయవాసనలుగల పురుషులు పెండ్లాడి వివిధకర్మ లాచరించి యందలి రసముగ్రహించి తుదకు నిరర్థకములనియెంచి వైరాగ్య మొందవలెను. పిమ్మట

"తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్"

సద్గురువుల నాశ్రయించి బ్రహ్మజ్ఞానమును బడయవలయును.

"వేదాంత విజ్ఞాన సునిశ్చితార్థః
సన్న్యాసయోగాత్ యతయశ్శుద్ధసత్వాః"

అంతట వేదాంత విజ్ఞాన సంపన్నులై సన్యసించి యతీశ్వర ధారియై ముక్తిని జెందవలెను.

అట్టిమోక్షమునకు మూడు ప్రతిబంధకములు కలవు వానిని దాటినగాని ముక్తి చేకూరదు కావుననే మనుస్మృతిలో

"ఋణాని త్రీణ్యపాకృత్య,
మనోమోక్షే నివేశయేత్"

మూడుఋణములను దీర్చి ముక్తికై యత్నింపుమని నుడువబడెను. ఆఋణములెవ్వియన

"జాయమానోవై బ్రాహ్మణస్త్రిభిర్
ఋణవా జాయతే"

అనగా ప్రతిపురుషుడు మూడుఋణములతో, పుట్టుచున్నాడు. జనించుటకు పూర్వమే జీవుడు ముగ్గురకు ఋణపడి యుండెను. వారెవ్వరన—

1. ఋషులు. 2. దేవతలు. 3. పితృదేవతలు.

అనియెరుంగుము. ఆఋణమునుండి విడివడుటకై

1. బ్రహ్మచర్యేణ ఋషిభ్యః
2. యజ్ఞేన దేవేభ్యః
3. ప్రజయా పితృభ్యః (కృష్ణయజుర్వేదం)

1. బ్రహ్మచర్యదీక్షచే ఋషిఋణమును
2. యజ్ఞము లొనర్చుటచే దేవఋణమును
3. సంతతిని గనుటచే పితృఋణమును తీర్పనగును.

వివాహముకానిది యజ్ఞమాచరించుటకు వీలులేదు. యజ్ఞముసేయక దేవఋణముతీరదు. పెండ్లాడని యెడల సంతతి కలుగదు. సంతానములేనిచో పితృఋణముతీరదు. కావున మోక్షార్థియగు మానవుడు దేవ-ఋషి-పితృ- ఋణవిముక్తుడై వివాహమాడవలెను. ఇది వేదమందలి పరమ రహస్యము.

అనార్యుడు:—

ఆర్యమహాశయా! నూటికి తొంబది తొమ్మిది మంది పెండ్లాడ వలసినటుల గన్పట్టుచున్నది. అయితే స్త్రీ పురుషుల వివాహ వయస్సును గూర్చి వేదమున వివరింప బడెనా?

ఆర్యుడు:—

మిత్రమా! వేదమున స్త్రీపురుషసంబంధ మంత్రములు రెండురకములుగ నున్నవి. అందులో కొన్ని వివాహ మంత్రములు. మిగిలినవి గర్భాధానసంబంధములు. వేదసాంప్రదాయ మెరుంగని సంఘసంస్కార ప్రియులు గర్భాధానమంత్రములను జూచి అవి వివాహమంత్రములని భ్రమించుచుందురు. ఈదోషముచే వేదములలో యువతీవివాహములు కలవని వాదించుటకు మొదలిడిరి. వివాహమంత్రములలో స్త్రీయొక్క వయస్సును వర్ణించునపుడు ఆమె కన్యయై యుండవలెనని వేదపురుషుడు నుడువుచుండును. మరియు పెండ్లిఅయిన వెంటనే పతిగృహమునకుచేరి యచట పతివ్రతా ధర్మము ననుష్ఠింపవలెననియు సూచించును.

"కన్యలాపితృభ్యోయతీపతి లోకం"

(కృష్ణయజుర్వేదం వివాహమంత్రం)

ఇందు కన్యలాఅను శబ్దముప్రయోగింపబడెను. కనుక వివాహ సమయమున స్త్రీ కన్యగా నుండవలెనని సులభముగా గోచరించుచున్నది. ఒక పురుషునకు దానముచేయబడినకన్య వెంటనే పితృగృహమునుండి పతిలోకం=పతిగృహమునకు, యతీ=వెళ్ళుచున్నదై, దీక్షాం=కన్యాదీక్షను అవాదాస్థ=పూర్తిచేయుచున్నది.

అని తెలుపుటచే వివాహమైన స్త్రీ తలిదండ్రులను విడచి పతిగృహమునకు వెళ్లవలెననియు అందుకుదగిన వయస్సులోనే పెండ్లి జరుగవలెననియు స్పష్టమగుచున్నది.

అనార్యుడు:—

అయ్యా! కన్యయనగా యుక్తవయస్సురాని బాలికయని నిశ్చయించినయెడల ఒకదోషము కలుగును. అదియెద్దియన ఎనిమిది లేక పదేండ్లబిడ్డ పతివద్దకేగి యచట చేయదగినపనియేమి? కామసౌఖ్యమనుభవించుటకు యౌవనమురాకుండెను. దీనింబట్టి పూర్వకాలమున యువతీవివాహము లుండెనని స్పష్టమగుట లేదా?

ఆర్యుడు:—

ఓయీ! బాగుగ విమర్శించినయెడల సత్యము తెలియును. బాలురు బాల్యమునుండి గురుకులమునకు పోవుచున్నారని

మెరుఁగుదువు. గురుకులమున విద్యాభ్యాసము ముఖ్యప్రయోజనమైయున్నది. అటులనే బాలికలు బాల్యమున పతికులమున కేగి స్త్రీలకుందగిన విద్య పతివలన గ్రహింపవచ్చును. ఇంకను పతియొక్క ఆహారవ్యవహార నియమములును సదాచారధర్మములును మనోభావములును గ్రహించి యభ్యసించుటకు బాల్యావస్థయే తగినదిగనుండును. ఎందుకన బాల్యమున పతియొక్క యాచారము లభ్యసించినయెడల నవిజన్మసిద్ధములవలెనిల్చునవై మనోవాక్కాయముల నతనితో నైక్యమొందుటకు వీలగును. లౌకికవిషయమందెటుల బాల్యమందభ్యసించిన పద్ధతులు బలవత్తరములై యభేద్యములై యుండునో అటుల పరలోక విషయముల నయిత మభ్యసించుటకు బాల్యదశయే ప్రధానమని గ్రహింపుము. ఒక్కపతి ననుసరించుటయేకాదు. అతని వంశమున నెందరో ముఖ్యులుకలరు. ఆతని తలిదండ్రులతో అక్కసెల్లెండ్రితో నన్నదమ్ములతో నానుకూల్యముగ వర్తింపవలసియున్నది. బాల్యమునుండి యలవాటుపడినగాని వారిని మెప్పించుటకు వలనుపడదు. ఒకదేశమున భిన్నమతస్థులు వివిధజాతులు కలసి మెలసి వ్యవహరించినగాని స్వరాజ్యసిద్ధి కలుగనేరదని యూహించుచున్న నీకాలమున వేరొక కుటుంబమునుండి మరియొక కుటుంబమునజేరి వారిలోదూరి యొక్కటిగచరింపవలెననిన యెంతకష్టమో యోచింపుము. బాల్యమున వేరొకవిధముగ నలవాటుపడిన స్త్రీ, వయసు మీరినపిమ్మట అనగా యువతియై యెవనినో పెండ్లాడి యతనికిని అత్తమామలకును, ఆడబిడ్డల

కును, నచ్చునటులాచరింప సాధ్యమా? కావుననే పరదేశ ములలో యువతీ వివాహములవలన భర్తలతోడను వారికుటుం బములతోడను ఐక్యముకుదురనేరక వివాహవిచ్ఛేదములు- పున ర్వివాహములు- సంతాన నిరోధములు, మున్నగు పశుకృత్య ములు విచ్చలవిడిగా హెచ్చుమీరి రచ్చకెక్కి యుచ్చెగువును. కలుగజేయు చుండెను.

అనార్యుడు:—

మహాశయా- వివాహసమయమున స్త్రీయొక్క వయ స్సును సంఖ్యారూపమున నిర్ణయించుటకై వేదమంత్రములు లేవా?

ఆర్యుడు:—

మిత్రమా! వేదమున లేని దొక్కటియులేదు వినుము.

"నయద్బ్రహ్మచర్యం నచసమిధానచాగ్నిహోత్రం
నతపసాతద్దే తోశుక్రం ఋజుందధాతు
సంస్కారాశ్చ కన్యాయా మష్టమేనవమేదిక్
సమాః పతింవృణోతి సుభగాభవంతు"

(ఋగ్వేదబ్రాహ్మణం)

24 మంత్రం 4 ప్రపాఠకం 4 అధ్యాయం.

కన్యాయాం=కన్యయందు సంస్కారాః=వివాహసంస్కా రములు, అష్టమే నవమే= 8, 9 వత్సరము లందును,

దిక్=(10 దిక్కులు గనుక) 10 యవ వత్సరమందును జరుగ వలయును. అట్టి యీడుగల కన్య, పతింవృణోతి= భర్తను వరింపుచున్నది. మరియొక మంత్రమును గమనింపుము-

"ఇంద్రదస్త్వ మీఢ్వస్సు భగాః కన్యాయా
అష్టమే వర్షే మధుపర్క ఇమాం
నవమే, దశమే, వర్షే జాతః పతిర్దధాతు"
(సామవేదము ఉద్గీథశాఖ ఔశనకసంహిత
పూర్వార్చిక అష్టమ ప్రపాఠకం)

ఈ మంత్రమున, కన్యాయాః=కన్యకు, అష్టమే వర్షే= 8 వ వత్సరమందును, నవమే=9 వ వత్సరమందును, దశమే వర్షే=10 యవ వత్సరమందును, పతిః=భర్త, లభించుగాక.

ఈ మంత్రములచూడగా 8, 9, 10 యేండ్ల యీడు గల స్త్రీలను కన్యలుగా వర్ణించినటుల తెలియుచున్నది. మరియు-

"గౌరీ, రోహిణీ, కన్యా అనిగాని
కన్యా, రోహిణీ, గౌరీ అనిగాని"

వేరువేరుపేర్లచే 8, 9, 10 యేండ్లబిడ్డలను పిలుచునట్టి సాంప్రదాయమున్ను కలదని యెరుంగుము.

ఈ విషయము బలపర్చు మంత్రమొకటి కలదు.

"ఇమాం కన్యాం గౌరీం, సుభగాభవంతు।
స్వస్తిరస్తు రోహిణీం, సుభగాభవంతు।
స్వస్తిరస్తు కన్యాయా సుభగాభవంతు।
స్వస్తిరస్తు పాణిం పీడ్యామ్యనామికాంగుష్ఠాభ్యాం"
(యజుర్వేదము; ప్రజాపతిసంహిత)
అగ్నిశాఖ, 11 అధ్యాయం, 10 సూక్తం

అనామికాంగుష్ఠాభ్యాం=ఉంగరపువ్రేలు, బొటనవ్రేలు ఈ రెంటిచే పాణిం పీడ్యామి = చేతిని పట్టుకొనుచున్నాను.

అని పెండ్లికొడుకు నుడువుచున్నాడు. ఇది చేతినిపట్టుకొను మంత్రమగుటచే వివాహ మంత్రమనుట స్పష్టము. పెండ్లియనగా చేతిని పట్టుకొనుటయేగదా! ఈమంత్రములలో గౌరీ రోహిణి - కన్యా శబ్దములుండుటచే 8, 9, 10 యేండ్లవయస్సుగల స్త్రీలకు పైనామములుండినటుల తెల్లమగు చున్నది.

స్త్రీని పెండ్లాడి స్వగృహమునకు గొంపోవుచు మార్గమధ్యమందెట్టి యిక్కట్టులు కలుగకుండుటకై పెండ్లికొడుకు భగవంతుని ప్రార్థించును. అందు పెండ్లికూతురునకు వయస్సెంత యుండవలెనో సూచింపబడెను.

"మాహింసిష్ఠం కుమార్యం స్థూణే దేవకృతేపథి".
(అథర్వవేదం 14 కాండ)

ఓదేవా! కుమార్యం=ఈచిన్నబిడ్డను, మాహింసిష్ఠం= కష్టముల పాలు చేయకుము. అని ప్రార్థించునపుడు పెండ్లి కుమార్తెను కుమారీశబ్దముచే వర్ణించెను. కుమారీ యనినను, కుమారుడననినను, యౌవనము రానివారని యెల్లరెరింగిన విషయమే. నాల్గువేదములలోని, పై మంత్రములు పెండ్లికుమార్తెను "కన్య" "కుమారి" "గౌరి" శబ్దములచే వర్ణించినటుల గ్రహించితిమి.

"త్వమర్యమాభవసి - యత్కనీనాం
సామస్వధా వత్స్వర్యంబిభర్షి"

(కృష్ణయజుర్వేదం, ఏకాగ్నికాండ)

ఇందును, కనీనాం, అనుశబ్దముకలదు. అనగాకన్యానాం యని యర్థమగుచున్నది. దీనివలన కన్యలకే పెండ్లికావలెననుట స్పష్టము.

"తదారోహతు సుప్రజా
యా కన్యా- విందతే పతిం"

(అథర్వవేదము, 14 కాండ)

"అర్యమణం నుదేవం కన్యాఅగ్నిమయక్షత"

(కృష్ణయజుర్వేదం)

ఈ రెండుమంత్రములలో పతిని పెండ్లాడనెంచు స్త్రీ కన్యావస్థ యందుండవలెనని విశదమయ్యెను.

"త్వంకుమారోపిచాహాం కుమారః కుమారిభిఃపంచ
షట్ సప్తమాష్ట నవ దిక్ సమాః కుమారీం
పతివేదనం" (యజుర్వేదం తైత్తిరీయశాఖా
బ్రాహ్మణం, 4 అధ్యాయం, 6 మంత్రం)

పంచ,షట్,సప్త,అష్ట,నవ,దిక్‌సమాః=అనగా 5, 6, 7, 8, 9, 10 సంవత్సరముల వయస్సుగల, కుమారీం=చిన్న బిడ్డను అని కలదు. వెంటనే 'పతివేదనం' అనుశబ్దము ప్రయోగింపబడెను. అనగా పతిని వరించుచున్నదని భావము. అందువలన నిది వివాహమంత్రమని తేలెను. పెండ్లి కావలసిన యీడు బాల్యమని పై యంకెలవలన గ్రహింపగల్గితిమి.

"యూయాహిరగ్నిర్వైమరుతో, అద్భిర్యాయాహి
సూర్యా ఇమాం, మ, కుమారీం, సమాష్ట నవ
భిర్గచ్ఛంతి తవపాణిముఖాః"
(సామవేదం, నృసింహకేశీయశాఖ,
ఉత్తరార్చిక, 2 అధ్యాయిం)

"ఇమాం, కుమారీం సమాష్టనవభిర్గచ్ఛంతి"

ఈ బిడ్డ కుమారీ యనబడుచున్నది. అయితే ఆమె యొక్కవయస్సన్ననో అష్ట, నవ, అనగా 8,9 యేండ్ల యీడు నందుండవలెను. అట్టి వయస్సుగల స్త్రీలు కుమారీశబ్దముచే పిలువబడుచున్నట్లు వేదమంత్రములు తెలుపుచున్నవి.

"బ్రహ్మచర్యేణ తపసాయత్పూర్వం
సంస్కారస్త్రీధా
కుమారీం మధుభిర్వివాహాత్ ప్రథమోజాతః
ఉత్తరే బ్రహ్మచర్యం యజేత్ బ్రహ్మచర్యోత్తరే
పందేతపతిం"

అధర్వవేదాగ్నిక పరిశిష్ట మధుపర్కప్రకరణం-
(7 కాండ- 2 అనువాకం 1 సూక్తం.)

దీనిలో 1 కుమారీ- 2 వివాహ. 3 పతి, అనుశబ్దములు కలవు. అందువలన భర్తను పెండ్లాడదలచిన స్త్రీ కుమారీదశలో నుండవలెనని బోధపడుచున్నది. ఇప్పటికి కన్యా- కుమారీ-గారీ శబ్దములచే స్త్రీయొక్క వయస్సు 8,9-10 వత్సరముల ప్రాంత మని వేద ప్రమాణములవలన తెలిసెను. ఇక నీశబ్దములకు సంస్కృత నిఘంటువునుండి యర్థము గ్రహింతము.

"శ్లో॥ కన్యా కుమారీ గౌరీ తు
నగ్నికా నాగతార్తవా॥ (అమరము)

కన్యా, కుమారీ, గౌరీ, నగ్నికా, ఈ నాలుగున్నూ, అనాగతార్తవా= సమర్తాడనిబిడ్డకు పేర్లు. ఆర్తవం అనగా ఋతువు. అనాగతం అనగా అట్టి ఋతువు, కాలేదని యర్థము.

ఇందువలన, కన్య యనగా వేద ప్రమాణములచేతను సంస్కృత నిఘంటువులచేతను సమర్తాడని స్త్రీయని స్థిరపడుచున్నది.

అనార్యుడు:—

మహాత్మా! వివాహసమయమున స్త్రీలు పసిబిడ్డలై యుండవలెనని తెలిపితిరి. అయితే ఇక పురుష వయస్సును నిర్ణయించుటకు ప్రమాణములు వేదములలో లేవా?

ఆర్యుడు:—

మిత్రమా! అవియును వేదమందేకలవు.

"బ్రహ్మచర్యేణ కన్యా యువానం విందతేపతిం"
(అదర్వవేదం॥ 11 కాండ 3 వ అనువాకం 9 వ సూక్తం.)

ఈమంత్రమున సర్వసందేహములు తీరును- వినుము పురుషుడు పసితనమున బాలుడనియు కుమారుడనియు యౌవనమున యువకుడనియు పిలువబడును. స్త్రీ- బాల్యమున కన్యయనియు లేక కుమారీయనియు యౌవనమున యువతీ యనినియు పేర్కొనబడును. యీవిషయమున సంశయించువారుండరు వివాహసమయమున స్త్రీలు బాల్యావస్థయందుండ వలెననియుపురుషులుయౌవనదశయందుండవలెనని పై మంత్రమెటుల తెలుపుచున్నదో చూడుము.

"కన్యా యువానం విందతే పతిం॥

అనువాక్యమున కన్యా= కన్యావస్థయందున్న స్త్రీ యువానం= యౌవనావస్థ యందుండు, పతిం = భర్తను, విందతే= పెండ్లాడుచున్నది, అనియుండుటచే స్త్రీల విషయ

మున, కన్యాశబ్దమును, పురుష విషయమున, యువకశబ్దమున్ను ప్రయోగింప బడెనని యెరుంగవలెను. స్త్రీపురుషు లిరువురు యౌవనానంతరము పెండ్లాడ వలెనని, వేదాభిప్రాయమగుచో—పై మంత్రము, వేరొకవిధముగ నుండెడిది. అది యెటులనో వినుము.

"బ్రహ్మచర్యేణ యువతి ర్యువానం విందతేపతిం"

యువతిః= యౌవనమువచ్చిన స్త్రీ, యువానం పతిం= యువకుడైన భర్తను, విందతే= పొందుచున్నది. అని యుండినయెడల యువతీ వివాహముల కెంతయో బలము చేకూరెడిది.

యువతియైన స్త్రీ యువకుడగు పురుషుని పెండ్లాడవలెనని తెలుపక, కన్యయగు స్త్రీ, యువకుడైన పురుషుని పెండ్లాడవలెనని యుండెను. అందుచే పురుషుడు యువకుడై యుండవలెననియు, స్త్రీ యువతియై యుండక, కన్యగా యుండవలెననియు, వేదభగవానుడు స్పష్టీకరించినటుల నిశ్చయింపనగును.

ఈ మంత్రము అథర్వవేదమున బ్రహ్మచారీ సూక్తములో నున్నది.

"బ్రహ్మచారిణం పితరో దేవజనాః"

అని యాసూక్తము ప్రారంభింపబడెను. అందు బ్రహ్మచారియొక్క ధర్మములు, విపులముగ వర్ణింపబడెను. మరియు ప్రసంగవశమున, స్త్రీయొక్క బ్రహ్మచర్యమును గురించి,

"బ్రహ్మచర్యేణ కన్యా యువానం, విందతేపతిం"
అను వాక్య ముచ్చరింపబడెను.

అనార్యుడు:—

అయ్యా! పై వాక్యమున స్త్రీలకు బ్రహ్మచర్యము బోధింపబడుటచే—వారు—ఉపనయన మొనర్చుకొని మెడలో జంధ్యములు ధరించి వేదాధ్యయనము గావింపవలెనని తోచుచున్నది ఆవిషయమున మీ భావమేమి?

ఆర్యుడు—

ఓయీ! పై వాక్యమందలి బ్రహ్మచర్య శబ్దము నిన్ను కలవర పెట్టినటులున్నది. బ్రహ్మచర్యమనగా వేదమును చదువుట యని తలంచుచున్నావు. ఆశబ్దమున కట్టి యర్థ ముండినను సర్వ కాల సర్వావస్థలయందు అదే అర్థమును వాడుకొనుమని వేద సాంప్రదాయమున లేదు. బ్రహ్మచర్యమనగా జితేంద్రియత్వమని సర్వు లెరింగియున్నారు. దీక్షాకాలములలో స్త్రీలు పురుషులు బ్రహ్మచర్యమును బూనెదరు. అనగా కామప్రవృత్తి లేనివారై యుందురు. ఇంతియే కాని వేదాధ్యయనము చేయుచుందురని యర్థము కాదు. బ్రహ్మచర్యమునకు వేదాధ్యయన మొనర్చుటయే యర్థమైనయెడల నెన్ని చిక్కులు కలుగునో చూడుము. పై సూక్తములో బ్రహ్మచర్యముచేత కన్య యువకుని పొందవలెనని యుండుటచే స్త్రీలు వేదములు చదివిన పిమ్మట పెండ్లాడవలెనని యర్థమగుచున్నటుల దెలుపుచు

న్నావు. అయితే యీవాక్యమునకు పిమ్మట దెలుపబడిన వాక్యము చూడుము.

"అనడ్వాన్ బ్రహ్మచర్యేణా శ్వోఘాసం జిగీర్షతి"

బ్రహ్మచర్యేణ=బ్రహ్మచర్యముతో, అనడ్వాన్ = ఎద్దు (పొలమును దున్నుచున్నది) మరియు బ్రహ్మచర్యేణ=బ్రహ్మచర్యముతో అశ్వః=గుఱ్ఱము, ఘాసం= గడ్డిని జిగీర్షతి = తినగోరుచున్నది.

మిత్రమా! చూచితివా! ఎటుల, బ్రహ్మచర్యముతో ఎద్దులు భూమిని దున్నుచూ, బండ్లు లాగుచున్నవో, గుఱ్ఱములున్నూ బ్రహ్మచర్యమును బూనుచున్నవో! అటులనే కన్యలు బ్రహ్మచర్యముతో యువకుని పెండ్లాడ వలెనని కలదు బ్రహ్మచర్యమనగా వేదాధ్యయన మొనర్చుటయని యర్థమగునేని పురుషులవలె స్త్రీలు, వడుగు చేసుకుని, వేదము చదువవలెననియు, ఎద్దులు, గుఱ్ఱములు, సయితము స్త్రీలవలె ఉపనయన మొనర్చుకొని, మంత్రములు వచించుచు, పొలమును దున్నుచుండ వలెననియు చెప్పవలసి వచ్చును. ఇంకను అదే సూక్తములో- ఇట్లు కలదు.

"బ్రహ్మచర్యేణతపసా, దేవామృత్యు మపాఘ్నత"

బ్రహ్మచర్యేణ= బ్రహ్మచర్యముతో, దేవాః=దేవతలు మృత్యుః=మృత్యువును, అపాఘ్నత= జయించిరి.

దీనింబట్టి దేవలోకమున సైతము దేవతలు వడుగు చేసుకుని వేదాధ్యయన మొనర్పవలసి యుందురు.

పరలోకములలో వేద సంబంధమైన కర్మ లుండవని శాస్త్రములు దెలుపుచున్నవి. అట్టి స్థితిలో నచట వేదములతో పనియేమి? వేదములు లేనపుడు వానిని చదువుటెట్లు! ఇక బ్రహ్మచర్యమునకు తావెక్కడ? అయితే, దేవతలు బ్రహ్మచర్య మొనర్చి రనుటలో నర్థ మేమి?

"నైషాంశిశ్నం నప్రిదహాతి జాతవేదాః
స్వర్గేలోకే బహుస్త్రైణమేషాః॥ (అధర్వవేదం)

దేవతలు స్త్రీలనడుమ వసించుచున్నను వారికి కామోద్రేకము కలుగనేరదని వేదమున కలదు. కావున వారు నిరంతరము జితేంద్రియులై యుందురు. ఇంతకంటె బ్రహ్మచర్యమునకు వేరొక యర్థము చెప్పగలమా!

"పార్థివాదివ్యాః పశవ ఆరణ్యా గ్రామ్యాశ్చయే।
అపక్షాః, పక్షిణశ్చయే, తేజాతాః బ్రహ్మచారిణః"

పార్థివాః= మానవులు, దివ్యాః= దేవతలు, ఆరణ్యాః= అడవి జంతువులు, గ్రామ్యాః= గ్రామసంబంధములైన పశువులు, అపక్షాః= రెక్కలులేనివి, పక్షిణః= రెక్కలుగలవి ఈ మొదలగు జీవరాసు లన్నియు, బ్రహ్మచారిణః= బ్రహ్మచారులనుండి, జాతాః=జన్మించెను. అనగా, బ్రహ్మచర్యప్రభావము

వలన కలిగెను. పై మంత్రములలో బ్రహ్మచర్యశబ్ద ముండుట వలన ఎద్దులు గుఱ్ఱములు, దేవతలు, పశువులు, పక్షులు, క్రిమి కీటకములు, మున్నగు ప్రాణి సమూహము లన్నియు బ్రహ్మ చర్యము ననుష్ఠించుచున్నటుల, దెలియుచున్నది.

బ్రహ్మచర్యమనగా వేదాధ్యయన మొనర్చుట, యని యంగీకరించుపక్షమున. పశుపక్ష్యాది సమస్త జంతువులు, వేదా ధ్యయన మొనర్పవలసియున్నవి. అటుల నెన్నటికిని జరుగదు. ఇక సత్యమెద్దియో తెలిసికొందము. కామవికారమును చెందక తదేకనిష్ఠతో వర్తించుటయే బ్రహ్మచర్య మనబడును. కావున స్త్రీల బ్రహ్మచర్యముకూడా, జితేంద్రియత్వాది సద్గుణసంప త్తియేయని యెరుంగుము.

అనార్యుడు:—

ఆర్యమహాశయా! మరియొక సంశయము కలదు. వివా హసమయమున

"దీర్ఘాయురస్తు మేపతిర్జీవాతు శరదశ్శతం"

(కృష్ణ యజుర్వేదం)

అను నీమంత్రమును పఠింపుచు తనభర్త నూరువత్సర ములు జీవింపవలెనని ప్రార్థించుచున్నది. మరియు పెండ్లిలో

"అపశ్యంత్వా- మనసా చేకితానం,తపసోజాతం
తపసా విభూతం। ఇహాప్రజా, మిహా, రయిగ్ం;
రరాణః; ప్రజాయస్వ, (ప్రజయా, పుత్రకామ"

(కృష్ణయజుర్వేదం)

పుత్రకామ= బిడ్డల నపేక్షించు వాడా! ఓనాధా! ఇహ= ఈగృహమందు ప్రజాం= సంతతిని, రయిం= ధనమును రరాణః= ఇచ్చుచు, ప్రజయా= సంతానరూపముతో, ప్రజా యస్వ= పుట్టుము, అనగా నీవే భార్యయగు నాయందు, పుత్రి రూపమున జన్మించుము. అని తనపతిని ప్రార్థించుచున్నది.

పెండ్లినాటికి స్త్రీలుయౌవనమును పొందనిచో భర్తలను తమయందు జనింపుడని యడుగగలరా! యింతియేకాదు పదేండ్ల బిడ్డకు వేదమంత్రములు వచ్చునెట్లు ఇందువలన వివాహమునకు పూర్వము స్త్రీలు వేదాధ్యయమొనర్చి యువతులై యుండవలెనని తోచుచున్నది. ఇందుకు ప్రత్యుత్తరమేమి!

ఆర్యుడు:—

ఓయీ! ఈప్రశ్న ఎక్కువ నేర్పరితనమును జూపుచున్నది. సమాధానమును వినుము. సూక్ష్మబుద్ధి యుండినగాని బోధపడదు. మొదట బాలుర, యుపనయన సమయమును గుర్తించుట ముఖ్యము 8 మొదలు 12 వత్సరముల లోపల వారికి వడుగు చేయబడును. నూటికి 90 మందికి ఇటులనే జరుగును. అప్పుడా బాలునకు బ్రహ్మోపదేశ మొనర్తురు. వెంటనే గురు శిష్యులకు జరిగిన సంభాషణమును గమనింపుము.

# గృహరాజ్యము

(11వ భాగము)

గురువు:— "కస్యబ్రహ్మచార్యసి."

ఓబాలకా! ఎవరి నిమిత్తము బ్రహ్మచర్యము బూనితివి.

బాలుడు:—

"ప్రాణస్య బ్రహ్మచార్యస్మి"

ప్రాణమును గురించి యీవ్రతము బూనితిని.

"యన్మఆత్మన ఆత్మని వ్రతం"

నాకు పరమాత్మయందొక వ్రతముకలదు, అనిప్రత్యుత్తరమిడెను. ఇటులజెప్పట సామాన్యులకుసాధ్యమా? వేదాంతపరిశ్రమ మొనర్చిన వారుగాని పై విధముగ నుడువజాలరు. అట్టికృషి సలుపుట కెన్నియో యేండ్లు పట్టును. ఆవిధముగ వయసు వచ్చినవారలకు వడుగుచేసినయెడల వేదాంత రహస్యములు ముచ్చటించగలరు. అయితే బాల్యముననే నుపనయనము చేయబడుచున్నది.

"మేధాంమహ్యా మంగిరసో
మేధాగ్ం సప్తర్షయోదధుః"

ఆంగిరసాది, మహర్షులు- సప్తర్షులు- తనకు జ్ఞాపకశక్తిని ప్రసాదించవలెనని యీబాలుడు కోరుచున్నాడు. మహర్షుల సంగతి యతనికెటుల తెలిసెనో యెవరు చెప్పగలరు.!

"సుశ్రవస్సు శ్రీవసంమా కురు +++
గోపోభూయాసం"

ఓమోదుగు వృక్షమా! నీవు వేదమును బాగుగా వినియుంటివి. అందువలన నీసాన్నిధ్యమున వేదమును చదివెదను. నీవలెనన్ను బాగుగా వినువానిగ నొనర్పుము, అనిప్రార్థించెను.

7--8 ఏండ్ల బాలుడు మోదుగచెట్టు యొక్క స్వభావ మును గుర్తించుటెట్లో తెలియకున్నది. అతడు నిత్యము రెండువేళల నగ్ని కార్యము చేయుచు నీక్రిందివిధముగ ధ్యా నించును.

"పరిత్వాగ్నే పరిమృజామ్యా యుషాచథనేనచ
సుప్రజాః ప్రజయా భూయసం సువీరోవీరై ++
సుగహోగృహైః"

ఓయగ్నిదేవా! నీయనుగ్రహమున, ఆయువు, ధనమును పొందగలను. మరియు, ప్రజయా= సంతానముచేత, వృద్ధిపొం దెదను. అని ప్రార్థించు చున్నాడు. ఈ సందర్భమున పసివానికి సంతానవిషయ మెట్లు తెలిసెనో యోచింపుము.

"శతమిన్నుశరదో ++ పుత్రాసోయత్ర పితరో
భవంతిమానో మధ్యారీరిషతాయుర్గంతోస్వాహా"

పుత్రాసః= బిడ్డలుగలవారమై, పితర.= ఆబిడ్డలకు తండ్రులమై (యుండుటకు) యత్రభవంతి= ఏవయస్సులో

నయ్యెదమో, ఆయుః= అట్టి ఆయుష్యమును, మధ్యా= మధ్య కాలమున, మారిషత= భంగము చేయకుడు! అని దేవతల ధ్యానించుచున్నాడు.

తనకు సంతతి కలిగి ఆబిడ్డలు తనను (తండ్రీ) యని పిలుచుచుండవలెనని ప్రార్థించుటకు బాల్యము తగియుండునా? ఉండదు. విధిగా యౌవనము వచ్చితీరవలెను. అయితే యిక నుపనయనము చేయవలసిన యీడు యౌవనమా? దీని కేమి చెప్పెదవు? కావున నెముక ముదిరినవారలకే వడుగు చేయవలె నని వాదించకుము.

బ్రిహ్మచర్యమునకు ముఖ్యాంగముగ బ్రహ్మోపదేశము చేయబడును. అందలి మంత్రరాజమును వింటివా?

"సుప్రజాః ప్రిజయా భూయా స్సువీరో
వీరైస్సువర్చా వర్చసా సుపోషః పోషైః"

ఈ మంత్రము ఏడేండ్ల బాలునకు, ఉపదేశింపబడుచు న్నది. దీని యర్థమేమి! ఓబిడ్డా! మంచిబిడ్డలను కనుము. వీర సంతతిని పొంది గొప్ప వీరపురుషుడవు కమ్ము. వర్చస్సుకలిగి వర్ధిల్లుము.

పదిమందిని పోషించువాడ వగుము. అని పై యుపదేశ మున కలదు. బిడ్డల గనుటకు తగినయీడు లేనిది సంతతిని కనుమని యుపదేశింపవచ్చునా! ఒకవేళ బోధించినను బాలురా

విషయమును, గ్రహింపగలరా! కావున నీవుముదిరిన పిమ్మట వడుగుచేయవలెనని వాదింతువు కాబోలు! ఎంతచిత్రము. అంతదూరము పోనేల! శిశువుజన్మించిన వెంటనేగాని, 11వ నాడుగాని, జాతకర్మము అనుదానిని జరుపుచుందుము. ఆసమయమున బాలుడు కన్నులు తెరువని దశలోనుండును. అతని చెవిలో నెటుల తండ్రి యొకమంత్రమును వినిపించు చున్నాడో చూడుము.

"అంగాదంగాత్సంభవసి, హృదయా
దధిజాయసే, ఆత్మావై పుత్రనా
మాసి, త్వంజీవ శరదశ్శతం"

ఓబిడ్డా! అంగాదంగాత్ = ప్రతి యవయవము నుండి సంభవసి=పుట్టుచున్నావు. హృదయాత్ అధిజాయసే=నాహృదయముమునుండి పుట్టుచున్నావు. త్వం=అట్టినీవు,పుత్రనామ=పుత్రుడను పేరుగలవాడవై, ఆత్మావై =నాస్వరూపముగానే,అసి=అగుచున్నావు. అనగా నేనే నీరూపముతో జన్మించితిని. కావున శరదశ్శతం=నూరు వత్సరములు, జీవ=జీవింపుము.

"అశ్మాభవ, పరశుర్భవ."

రాయివలె స్థిరముగానుండుము. గండ్రగొడ్డలివలె నుండుము, అని చెప్పుచున్నాడు. "నాహృదయమునుండి పుట్టితివి. నాకంటె నీవువేరుకాదు. "నేనే నీవైతివి" అనిచెప్పినపుడు పదిదినములుగల బాలుడర్థము చేసుకొనునా?

ఇంతటితో చాలక—

"త్వయిమేధాం త్వయిప్రజాం
త్వయ్యగ్నిస్తే జోదధాతు।

అగ్నిదేవుడు నీకు తెలివి నొసంగుగాక, త్వయి=నీ యందు, ప్రజాం = సంతతిని, దధాతు = కలుగజేయుగాక. అనితండ్రి తన బిడ్డతో జెప్పుచున్నాడు. అపసివానికి మాట లైనను రావు. అట్టివానితో మాట్లాడుట ఎటులనో తెలియ కున్నది. మరియు నాబాలునకు, సంతతి కలుగవలెనని యాశిం చుచున్నాడు. అప్పుడే పుట్టెనోలేదో అతనికి, పెండ్లియెప్పుడై నది? సంతతిని కనుటయెట్లు? ఈయసందర్భ ప్రసంగములకు తావెక్కడ? యిరువదేండ్లు మించిన పిమ్మట కుమారునితో మాట్లాడ దగినటులున్నదని నిశ్చయించి జాతకర్మము—నామక రణము అను యీ రెండుకర్మలు బాల్యమునచేయరాదని యు పన్యసింతువా యేమి? శాస్త్ర సాంప్రదాయ మెరుంగక కేవ లము బుద్ధి బలముచే, మంత్రములను శోధించిన యెడల కలు గబోవు వైపరీత్యము లిటులనే యుండును.

"సోమోదద ద్గంధర్వాయ గంధర్వో
దద దగ్నయే రయించపుత్రాగ్
శ్చాదాదగ్నిర్మహ్యా మధో ఇమాం"

మొదట చంద్రుడధిపతియై, కన్యను గంధర్వున కొసం గెను. ఆగంధర్వుడు కొంతకాలము కాపాడి పిమ్మట అగ్ని

కిచ్చెను, ఆయగ్ని పాల్గొంచి మనుజుండాబిడ్డను తన దగ్గరకు తెచ్చుకొనెను. అపుడా కన్య యొక్కస్థితి యెట్టిదో కను గొందము.

అగ్నిః= అగ్నిదేవుడు, మహ్యాం= నాకొరకు, ఇమాం= ఈ కన్యను, (ఇచ్చెను) (మరియు నీకన్యతోపాటు) రయిం= ధనమును, పుత్రాన్ = బిడ్డలను, అదాత్ = ఇచ్చెను. అని పెండ్లికొడుకు వచించెను. అనునది భూతకాలమైయున్నది. ఇక ముందెపుడో ఈ కన్యవలన బిడ్డలు కలిగెదరని యర్థములేదు. ఆమె కొంత ధనముతోడను ముగ్గురికి తక్కువకాకుండ నుండు బిడ్డలలోడను తనకు లభించెనని యర్థమగుచున్నది. దీనింబట్టి వేదసాంప్రదాయ మెరుంగని బుద్ధిమంతు లెట్టుల వాదింతురో వినుము. అదివరకే యొకరిని చేపట్టి యతనివలన ధనమార్జించు టయేగాక బిడ్డలను సయితము కనిన యువతులకు పెండ్లిచేయ వలెనని చెప్పుచుందురు. సమర్థాడిన యువతులకేకాదు. బిడ్డలను గనిన తల్లులకుకూడా, పెండ్లిచేయవచ్చునని వేరొక మంత్ర మును చూపుదురు.

"ద్యౌస్తే పృష్ఠగ్ం రక్షతు
వాయు, రూరూ, అశ్వినౌ, చ,
స్తనం, ధయంతగ్,
సవితాభి రక్షతు" (వివాహమంత్రము)

ఓ కన్యా! తేపృష్ఠం= నీయొక్క పృష్ఠభాగమును,

ద్యౌః= ఆకాశదేవత, రక్షతు= రక్షించుగాక, వాయుః= వాయుదేవుడు,ఊరూ= తొడలను, (కాపాడుగాక) స్తనం—స్తనమును, అశ్వినౌ= అశ్వినీదేవతలు (రక్షింతురుగాక) ధయంతం= నీవద్ద పాలుత్రాగుచున్న బిడ్డను, సవితా= సూర్య భగవానుడు కాపాడుగాక, అని కలదు. ఇందు గమనింపతగిన విషయమును వినుము. క్రొత్తగా నొకకన్యను పెండ్లాడుచుం డెనో లేదో— యింతలో పాలుత్రాగుచుండు బిడ్డను రక్షింపు మని కోరు టెట్లు!

ఇందుకు తగిన ప్రత్యుత్తర మీ క్రిందివిధముగ జెప్పుట కంటె గత్యంతరములేదు.

వేదకాలమున సమర్తాడినపిమ్మటనే స్త్రీలకు వివాహ ములు జరుగుచుండెడివి. ఆకాలపు స్త్రీలు స్వయముగ తమకు తగినవారిని, వరింపుచుండిరి. ఇష్టమైన భర్త లభించుటకు కొంత యాలశ్య మగుచుండెను. కొందరకు 4, 5 ఏండ్లు గడచినను భర్త లభింపకుండెను. ఆలోపల కామదేవతానుగ్రహమున నొక బిడ్డ జనించును. బిడ్డలను కనినమాత్రమున దోషమేమి?

స్త్రీరత్నము లెల్లవేళల, పరిశుద్ధలై యుందురు. కష్టప డకుండ ఫలము లభించుచున్నపుడు, విడుచువారుందురా! కావుననే చంటిబిడ్డలకు పాలిచ్చుచుండు స్త్రీలు పెండ్లాడునట్టి యాచారము పూర్వకాలముననుండెను, అని యీవిధముగా వెలడింతురు.

ఇకవాస్తవార్థమును వినుము. పెండ్లి అయినదో లేదో చంటిబిడ్డనెత్తుకొనిన భార్యలభించినటుల పెడ్లికొడుకు తలచుచు న్నాడు. ఇందలి భావమేమి! ఎపుడు భార్య లభించెనో అపుడః తప్పక బిడ్డలులభించగలరని నమ్ముచున్నాడు. రాబోవు కాలమున తనకు గలుగబోవు లాభమును ముందుగనే స్మరించి యువికలిగినట్లే భావించుటయు మానవ ధర్మమై యున్నది. ఇందుకొక దృష్టాంతమును చూడుము.

దరిదు్రినకు రాజు దర్శనమయ్యెనేని యతడారాజును చూచి, అయ్యా! తమదర్శనముచే దరిద్రి విచ్ఛేదమైనది. కష్టములనుండి గట్టెక్కితిని, అని తెలుపును. నిజముగ నా సమ యమున దారిద్ర్యము తొలగెనా! లేదు, ఇకముందెప్పుడో యాప్రిభువువలన ధనము లభించును. ఆనమ్మకముతో ద్రవ్య ప్రాప్తి కలిగినట్లె చెప్పుచున్నాడు. ఇట్లుచెప్పుట మనుజులకు అలవాటనుటలో సంశయము లేదు. యీాయభ్యాసములు క్రొత్తగా వచ్చినవికావు. వేదసాంప్రిదాయ మెరింగిన పెద్దలు ఆయనుభవముల వాడుకకు దెచ్చిరి. ప్రికృతము వివాహ సమ యమున పెండ్లికొడుకెటుల జెప్పుచున్నాడో చూడుము.

"అపశ్యంత్వామనసా- ధీధ్యానాగ్
స్వాయాంతనూగం ఋత్వియే
నాధమానాండుపమా
ముచ్చా యువతిర్బభూయాః
ప్రజాయ స్వప్రజయా పుత్రకామే"

పుత్రకామే= పుత్రులను కోరుదానా! ఓ పెండ్లికూతురా, త్వా= నిన్ను, మనసా= మనస్సుచేత, అపశ్యం= చూచుచున్నాను. దీధ్యానాం= కాంతిగల, స్వాయాంతనూం= స్వకీయమైన శరీరమందు; ఋత్వియే= ఋతుకాలమున కలుగు గర్భమును; నాధమానాం= యాచించుచు, ఉచ్చా (సంభోగ కాలమున) పై భాగమందుండు; మా= నన్ను; యువతిః= యౌవనముపొందిన నీవు; ఉపబభూయాః= అనుభవింపుము. మరియు, ప్రజయా=(నన్ననుభవించిన కారణమున) సంతానముతోడ; ప్రజాయస్వ= పుట్టుము. అనగా నీకు కలిగిన సంతానము, ప్రత్యేకమైనది కాదనియు, అది నీరూపమే యనియు, నెరుంగుము.

ఈమంత్రమున "యువతీ" శబ్దముకలదు. పెండ్లికూతురుతో మాట్లాడునపుడు "యువతివైన నీవు" అని ప్రయోగింపబడెను. అందువలన యౌవనముపొందిన స్త్రీలకే పెండ్లిండ్లు జరుగవలెనని కొందరందురు. అపుడు చేయదగిన పనియేమి? ఇంతకు పూర్వము చూపబడిన మంత్రములు జ్ఞప్తికిం దెచ్చుకొని వాని నీమంత్రముతో ముడిపెట్టి చూడవలెను.

యీమంత్రముగాక అంతకుపూర్వము చెప్పబడిన మంత్రములలోని యసందర్భముల యొకమారు చూడుము.

(1) శిశువు జనించిన పిమ్మట 11 వ నాడు జరిగిన జాతకర్మలో తండ్రి యాపసిబిడ్డతో మాట్లాడినటుల కలదు.

(2) 8 ఏండ్ల బాలునకు వడుగు చేయుచు నాచిన్నవానితో బిడ్డలను గనుమని తండ్రి బోధించినటులుండెను.

(3) వివాహసమయమున పెండ్లికూతురు కొంతధనముతోడను ముగ్గురు నలుగురు బిడ్డలతోడను తనకు లభించినటుల పెండ్లి కొడుకు తెలిపెను. ఆవిధముగజరుగుటకు యెన్నటికినివీలు లేదు. ఎందుకన రాబోవు కాలమున జరుగవలసిన విషయములు ముందుగ సంభవించుటెట్లు! యిందుకు సమాధానము తెలుపుట బహు దుర్లభము. అయితే వేదములలో అసందర్భ ప్రలాపము లుండునా! ఉండవు. ఇకసత్యమును గమనింతము. ఏమార్గమవలంబించిన మనశ్శాంతి కుదురునోఆపద్ధతిననుసరించి వేదార్థము చెప్పవలెను. అపుడు సంశయముతీరును. అదియెటులనో చూతము.

కొన్ని సందర్భములలో నెందుకోగాని జరుగబోవు విషయములు ముందుగనే జరిగినటుల వేదములలో చెప్పబడుచుండును. అటుల గానియెడల నుపనయనమున మరియొక మంత్రమీా క్రిందివిధముగ నుండదు.

"మయిమేధాం మయిప్రజాం"

అను మంత్రము ఉపనయనములో నున్నది. అందలి యర్థ మేమనగా ఎనిమిదేండ్ల బాలుడు తనకు సంతతి కలుగవలెనని కోరుచున్నాడు. ముందెపుడో యాబాలుడు పెద్దవాడై అపుడు తనకుకావలసిన విషయములెవ్వియో గ్రహించి వానిసన్నిటిని బాల్యముననే కోరుచున్నట్లు వేదమాత యతనిచే పలి

కించుచున్నది. ఈ యలవాటు, వేదమందుండుటచే, వేదమ తస్థులాసాంప్రదాయమును నిత్యజీవిత మందుంచుచున్నారు. సాధారణముగా తల్లులు తమ బిడ్డలతో నెటుల భాషింతురో చూడుము.

"7, 8 ఏండ్ల బిడ్డనుజూచి,
అబ్బాయీ! ఈ పిల్లను పెండ్లాడెదవా!
మంచి అందగత్తెగా నున్నది
తండ్రి గొప్ప ధనవంతుడు
కావున నత్తవారింట నీ కెంతయో
సౌఖ్యము కలుగును."

అని యడుగుచుందురు. కాని యామాటలలోని యర్థ మెంతమాత్రము గ్రహింపలేని స్థితిలో నా బాలుడుండెను.

అయితే త ల్లు ల కు, పిల్లల యందున్న ప్రేమ-పై విధముగ నుండునని గ్రహింప నగును. జరుగబోవు విషయములను ముందుగ హెచ్చరించి కోర్కెల దీర్చుకొనమరియుచుండుట తల్లుల లక్షణమని తెలిసినది. అటులనే వేద మాతయొక్క-ప్రేమయు పై విధముగ బహిర్గతమయ్యెను. లోక మందలి తల్లుల ప్రేమకును-వేదమాత ప్రేమకునుస్వభావమొక్కటి గనుండినను-ఫలమందెంతయో,వ్యత్యాసముకలదు. ఆరహస్యము నువినుము. బాలుర హృదయములు పవిత్రములై యుండును. అందు ధర్మబీజములు నాటుటకు, వేదమాత యత్నించుచున్నది. ఆబీజములు మంత్ర రూపముననుండును. మంత్రములు

మాటలుగ నున్నను అందలి యక్షరములు, నాదిసిద్ధాంతము ననుసరించి సత్వరజస్తమో గుణాత్మకములై పాప సంహార కములై- పరలోక సాధనములై యున్నవి- పలుసారు లుచ్చ రింపబడిన మంత్రి మొకవిధమగు శక్తి కలదై తత్కర్తకు మహత్తర ఫలమొసంగును. సాధారణముగ మాట్లాడు మాట లలోని యక్షరముల కట్టి శక్తి లేదు. మంత్రములలోని యక్షర మహిమ, బాలురహృదయ క్షేత్రములలో నాటుకొని మొలకలెత్తి క్రిమముగ నియమ రూపమగు నీటిచే వృద్ధిజెంది, ఫలమొసం గును. ఈహేతువు వలన ఉపనయనమున, బాలుడై యున్న పురుషుడు యౌవనము పొందినపుడు, వేదమందు చెప్పబ డిన ఫలముల విధిగా ననుభవించును. అటులనే వివాహ సమ యమున, బాలికయగు స్త్రీ- కొంత కాలమునకు యౌవనము పొంది భర్తను సుఖింపజేసి సత్సంతతిని బడసి పతితోడ స్వర్గ మునకేగి యచట బహుకాలము వసించి పునర్జన్మమున నతనినే మరల పెండ్లాడును. ఇదంతయు మంత్రి ప్రిభావమున జరుగును. ఉపనయనమున సయితము బాలుని గూర్చి-

"సుప్రజాః ప్రజయా భూయాః"

అను మంత్రముచే మంచి బిడ్డలను కనుమని వేదమాత యాశీర్వదించినటుల వివాహములో బాలిక యగు భార్యను గూర్చి

"ప్రజాయస్వ ప్రజయా పుత్రకామే"

పుత్రకామే= పుత్రులను కోరుదానా! ఓ పెండ్లికూ

తురా! ప్రజయా= సంతతిచే, ప్రజాయస్వ= పుట్టుము, అని భర్తచే పలికించెను. పెండ్లినాటికి స్త్రీలకు యౌవనము కలిగిన గాని పై ప్రసంగము జరుపుటకు వీలులేదని వాదించునెడల, నుపనయనమున సయితము పురుషులకు యౌవనము రావలెనని నుడువవలసి వచ్చును.

ఉపనయన మొనర్చుటకు పురుషుల కెటుల యౌవనము రాకూడదో యెల్లరెరింగి యుండిరి. అటులనే స్త్రీలకు సైతము ఉపనయన మనబడిన వివాహమున యౌవనావస్థ రాకూడదని బుద్ధిమంతులు గ్రహింపవలెను.

అనార్యుడు—

అయ్యా!

“ఆరోహతల్పం సుమనస్య మానేహ
ప్రజాంజనయ పత్యే అస్మై”

(అధర్వవేదం 14 కాండ)

ఓ భార్యా! మంచి మనస్సుగలదానవై, యీమంచము పై నెక్కుము. నానిమిత్తము సంతతిని గనుము.

“యోనాద్యోనే రధిబుధ్యమానౌ
హసాముదౌ మహసామోదమానౌ”(14 కాండ)

“ఆరోహోరు ముపధత్స్వహస్తం
పరిష్వజస్వజాయాం సుమనస్యమానః”

( 11 కాండ )

"యేనాపత్యా తన్వగ్ం సంస్పృశ
స్వాథ జిర్వి ర్విదథ మావదాసి" ( 14 కాండ )

ఈ పై మంత్రములలో స్త్రీపురుషులుకామవశులై సరస సల్లాపము లాడుచు తమ శరీరముల కలుపుటకు యత్నించిరని తెలుపబడెను. సమర్థమైన పిమ్మట పెండ్లి జరుగనియెడల, పై విధముగ భాషించుటకు తావులేదు. కావున పూర్వకాలమున, యువతీ వివాహము లుండెనని తోచుచున్నది. ఇందుకు సమాధాన మేమి?

ఆర్యుడు:—

ఓయీ! ఈ సంశయమిదివరకే తీర్చితిని. ప్రశ్నించువారలకు కొంత తెలివియుండవలెను. ఎంతచెప్పినను సూక్ష్మబుద్ధిచే గ్రహింపజాలక మరల ప్రశ్నించువారి సంశయము లెన్నడునుతీరవు. అక్షరములునేర్చుకొను బాలునకు భాగవతాది గ్రంథములు బోధపడునా! చెట్టెక్కువాని నెంతవరకు నెట్టగలము? మార్గమును చూపువారుందురు, కాని తమ పనుల మాని యొకరివెంట నడచువారుండరు. ఇంతకును మంత్రప్రభావమెరుంగని దోషము నిన్ను బాధించుచున్నది. మాటలకును మంత్రములకును భేదమెంతయో కలదని యింతకుముందే తెలిపితిని. ఆవిషయమర్థమైనటుల లేదు. కొన్నిప్రశ్నలకు ప్రత్యుత్తరమొసంగబడినను బుద్ధిబలములేని వారర్థము చేసికొనజాలరు. ఒకప్పుడు ప్రకృతిశాస్త్రజ్ఞాన మత్యవసరము. అందుకొక యుదాహరణము వినుము.

ఒక సూదికలదు. దానిని మనవద్దకు లాగవలెను.

(1) ఒక పుల్లచే మనవైపుకు నెట్టవలెను.

(2) లేదా సూదిలో దారమును దూర్చి లాగవలెను.

ఈ రెండు మార్గములచే సూది నొక ప్రదేశమునుండి వేరొక-చోటునకు పంపగలము. ఈపద్ధతి సామాన్యులెల్లరకు తెలియును. ఒకనాడు ప్రకృతిశాస్త్రమెరింగిన మహాత్ముడొక గ్రామమునకు విచ్చేసి నూర్లకొలది జనులుండు-చోటున కేగి వారి నడుమ గూర్చొని యినుపదబ్బన మొకదానిని దెప్పించి యచటనుంచి తాడుగాని పుల్లగాని లేకయే యీదబ్బనమును కదిలించగలరా? యని ప్రశ్నించెను. వారెల్లరు సాధ్యపడదనిరి. అంత నొకసూదంటురాయిని (మాగ్నెట్) చేతబట్టుకొని దబ్బనమునకు దూరముగా నుంచెను. వెంటనే దబ్బనము దానివైపునకు నడుచుచువచ్చెను. జనులాశ్చర్యమొందిరి. ఈశ్వరసృష్టి యందిట్టి చిత్రములెన్నియో కలవు. ఇతరవస్తువులవలె సూదంటురాయి యొకపదార్థమైనను తాను కదలకయే యినుపముక్కలను తన వైపునకెటుల లాగుచున్నదో తెలియుము. మనమెల్లరము మాట్లాడు మాటలకు మహిమలేదు; ఆమాటలన్నియుసామాన్య వస్తువులవంటివి. మంత్రములన్ననో సూదంటురాయివలె మహత్తరమహిమ కలవి. మంత్రములకు మహిమకలదాయని యవివేకు లనుచుందురు. వారికి విమర్శనాశక్తి లేదు. లోకానుభవ మంతకంటెను శూన్యము. బావిలోని కప్పలవలె

దముకు తెలిసినదానికంటె వేరొండులేదని భ్రమించుచుందురు.

మంత్ర ప్రభావమును గూర్చి సంశయించు వారికి ప్రత్యక్ష ప్రమాణ మొకటి చూపెదను. ఆంధ్రదేశమున నొక స్టేషనుమాష్టరు కలడు. వారిపేరు పాముల నరసయ్యగారని ప్రసిద్ధిచెందెను. నూర్లకొలది మైళ్ళయందైనను సరె, పాము కరచి యొకడు నురుగులు గ్రక్కుచున్నయెడల నరసయ్యగారికి తంత్రీవార్త (టెలిగ్రాం) పంపుచున్నామని యతని చెవిలో వేరొకడు చెప్పి తంతిని పంపవలెను. ఆమహాత్ముని నామో చ్చారణమువలన క్రమముగ విషమంతయు దిగి బాధనుండి విముక్తుడగును. ఇది పూర్వకాలపు ముచ్చటకాదు. అంధపరం పరా ప్రవాహమున నోలలాడు చరిత్రాంశము కాదు. ఇరువ దవ శతాబ్దమందు ఆంగ్లరాజ్య కాలమున నవనాగరికత వ్యాపిం చియుండుతరి జరుగుచున్న కథ సుమా! ఇదియొక కల్పితంబగు విషయమని త్రోసివేయకుము.

తుపాకిలోనిబొగ్గుపొడికిని పండ్లు తోముకొను బొగ్గు పొడికిని భేదములేదా? రకరకములైన పసరులుకలిసిన ఔషధ మెటులదివ్యమైవెలయునో, అటులనేశాస్త్రములననుసరించి పలు విధములగునక్షరము లొకచోటజేరి శబ్దములై మంత్రరూపమున బ్రకాశించును. కొన్నివస్తువులుకూడి మందుపొడియై తుపాకిలో జేరి యద్భుతముగ ప్రేలి మానవాతీత కార్యము లొనర్చు చందమున వివిధాక్షర సమ్మేళనముచే నేర్పడిన మంత్రరాజము లనేక రోగములు బోగొట్టుటయు దీర్ఘాయువును ప్రసాదిం

చుటయు, సంతానము, నోసంగుటయు శత్రువుల జయించుటయు, వివిధలోకముల జూపుటయు, దైవ దర్శనము లభింపజేయుటయు, మున్నగు పను లెన్నియో చేయగలవు. అంతియేకాదు. భవిష్యత్కాలమున జరుగవలసిన కార్యక్రమము ప్రస్తుత కాలమున సంస్కరించి ఫలింప జేయుటలో మంత్రముల కున్న శక్తి మరెందునులేదు. సంశయము తొలంగుటకింకొక కథను వినుపింతును, అర్జును డొకనాడు విరక్తి జెంది వేదాంత నీతుల దెలుపుచు యుద్ధము చేయననెను. కాని కృష్ణుడెన్నియో విధముల బోధించెను. ప్రయోజనము కలుగ దయ్యె. వాస్తవమున నిక ముందెప్పుడో కురు పాండవ యుద్ధము తటస్థించి కౌరవులు చావనుండిరి.

ఆవృత్తాంత మదివరకే జరిగినటుల నొకయెత్తుగడ వేసి శ్రీకృష్ణు డీక్రింది విధమున వచించెను.

"శ్లో॥ కాలోస్మిలోకక్షయ కృత్ప్రవృద్ధో
లోకాన్ సమాహర్తు మిహప్రవృత్తః"
(భగవద్గీత 11 వ అధ్యాయము)

ఓయర్జునా! నేను కాలస్వరూపుడను, సృష్టిస్థితి సంహార కర్తను. ప్రస్తుతము దుష్ట సంహారమునకై వర్తించుచున్నాను.

(1)" శ్లో॥ మయాహతాన్ త్వంజహిమావ్యధిష్ఠాః"

(2)" శ్లో॥ మయైవతేనిహతాః పూర్వమేవ."

లేదు. అంత నగ్ని దేవుడు, లోగడ మీరు చూపించిన వేద మంత్ర మనుసరించి, తన వశమందున్న కన్య నొక పురుషున కొసంగుచుండును. అపుడు స్త్రీలు యువతులై యున్నందున యువతీ వివాహములు శాస్త్ర సమ్మతము లనుట సత్యము. దీనిని కాదనుట యెట్లు?

3. వివాహము 5 దినములు జరుగును. అందు చివర నాడు గర్భాధాన మంత్రములు పఠింతురు. దీనింబట్టి పూర్వ కాలమున నైదవ దినమున తప్పక గర్భాధానము జరుపబడు చుండెనని తోచుచున్నది. అప్పటి కా కన్య రజస్వల యైనగాని గర్భాధానమునకు వీలులేదు. కావున వేదకాలమున యువతీ వివాహము లుండెనని స్పష్టపడుట లేదా?

4 దేవతల కథలు పురాణ సంబంధములా? వేదముల లోగూడా పురాణములలోని కథ లున్నవా? అగ్ని, నీరు, గాలి,. మొదలగు భూతములు దేవత లెట్లయినది— ఈమొ దిరి ప్రశ్నలకున్నూ, తదితర ప్రశ్నలకు,

పై ప్రశ్నలకు సమాధానములు, సరియైన మంచి ఉదాహరణములతో సహా రాబోవు గ్రంథములలో తెలుప బడును.

—♦ మ రి యు ♦—

దేవతలు— దేవతల దేహములు— ఆహారభేదములు ఉద్యోగ పదవులు — మున్నగు అనేక విషయములు "దేవరాజ్యము" అను రాబోవు గ్రంథములలో తెలుపబడును

# హిందూ మత గ్రంథమాల

## నియమావళి.

1. వ్యాపారముగ పనిచేయువారు ముందుగా రు 10 లు అడ్వాన్సు కట్టవలెను. లేదా, ఎన్నిపుస్తకములు కావలయునో వానికగు ధనమును ముందుగనే మని యార్డరు చేయవలయును. అదియు కానిచో నాగ్రామమందలి పెద్ద మనుష్యునివలన హామీ యిప్పించవలెను.

2. ఏబది(50) పుస్తకములకు పైబడ అమ్మించిన బుక్ సెల్లరుకు కమీషను పుస్తకము 1కి రు 0-0-3 (కాని) వంతున ఇవ్వబడును.

3. ఏజంట్లు, వ్యాపారస్థులు తమ సమీపముననున్న రైలుస్టేషనుయొక్క పేరుతోసహా పూర్తి చిరునామా వ్రాయవలెను.

4. ఈ గ్రంథమాలయొక్క ఏజంట్లు తప్ప ఇతరులు పోస్టుబిళ్ళలు పంపినగాని ప్రత్యుత్తరమును బడయుజాలరు.

5. ఆరుగురుగాని అంతకు మించినగాని చందాదారులు కలసి ఆర్డరిచ్చేయెడల వారి పుస్తకముల నొకటిగజేర్చి ఖర్చులు మేమే భరించి అన్ రిజిష్టర్డు పార్సిలు చేయగలము. అపుడు నమ్మకముగ చేరగలవు.

6. బుక్ పోస్టు ద్వారా పంపినచో నొకప్పుడు పుస్తకములు అందకపోవచ్చును. దానికి మేము బాధ్యులము కాము.

7. విడిపుస్తకమును శాంపిల్ గాకోరువారు 0-2-3 లను పోస్టు బిళ్ళలుగా పంపవలెను.

ఓం.

నమఋషిభ్యః

"యోగక్షేమం వహామ్యహం"

హిందూ మత {  } గ్రంథ మాల

# మతధ్వజము



హిందూ మతోద్ధారక

బ్ర॥ ప్రభాకర ఉమామహేశ్వరపండితులవారి యుపన్యాసము

అనంతపురం జిల్లా తాడిపత్రి పురవాసులు, దైవభక్తులు, దేశాభిమానులు,

దీనబంధువులు, దాన రతులునగు

వైశ్య శ్రీ రాజా వెంకట్రామయ్య శ్రేష్ఠిగారి

ధర్మము చే

తాడిపత్రి దేశబంధు ముద్రణాలయమున

ముద్రింపబడి

యుపన్యాసకులచే ప్రకటింపబడియె.

హిందూమత సం॥ 195,58,85030.

 [వెల. 0-2-0.

శ్రీరస్తు.

'యోగక్షేమం వహామ్యహం.'

# మతధ్వజము.



అనార్యుడు—ఆర్యమహాశయా హిందువుల తత్వశాస్త్రము సంపూర్ణ పరిభకలదైయుండెనని వినియుంటిని (తత్వ) సిద్ధాంతభాగము సాధకమైయుండినను, కథా (చరిత్ర) భాగము బాధకముగనుండుటకు కారణమేమి?

ఆర్యుడు—వినుము. ఈమతమందు సిద్ధాంతభాగము పురుషునివంటిది. కథాభాగము స్త్రీవంటిది. పురుషహృదయము సులభమైనది, సరళమైనది, విరళమైనది, అమాయకమైనది, నిశ్చలమైనది, వికారములేనది, చిక్కులులేనిది. స్త్రీహృదయమో గంభీరము, దుస్సాధ్యము, భావపూరితము, దుర్గమము, చంచలము, సవికారము. పురుషశరీరావయవ సముదాయము, మోహజనకముగానుండదు. మనశ్చంచలతకు కారణముకాదు. స్త్రీశరీరమో అందుకు భిన్నము. ఒక్కపురుషుడొక్కకాలమునగాని భిన్నకాలమందుగాని పెక్కుమందిని పెండ్లాడి వారినిగూడియున్నను, ఆస్త్రీలుకాని యాపురుషుడుగాని రోగములకాకరముకారు. ఒక్కస్త్రీ పెక్కుపురుషుల నొకేకాలమునగాని వి

డివిడిగగాని, వివాహమాడి వారలగూడనేని ఆపురుషులందరు ను, ఈ స్త్రీయు, జాడ్యగ్రస్తులై ఐహికసుఖానంద మొందజా లరు. ఒకపురుషు డనేకపవిత్రస్థలములందు మూత్రవిసర్జన మొనర్చినపు డతనిని జాడ్యములంటనేరవు. పవిత్రమైనదైనను ఒక్కస్థలమందే బహుపురుషులు మూత్రమును విసర్జించిరేని యాస్థలమువారినందరిని రోగులజేయునని వైద్యశాస్త్రముపదే శించుచున్నది. స్త్రీ-స్థలమువంటిదని భావించుటమంచిది. స్థల మును పవిత్రముగా నుంచుటకు కట్టుదిట్టములు చేయవలెను. అ నగా ఆవరణముచే స్థలమును బంధించవలెను. ఇటులనే స్త్రీలు హద్దులచే దిద్దబడవలెను. పవిత్రోద్దేశ్యముచే జూడబడినపుడు స్త్రీలు దేశమునకు మహోపకారముచేయగల్గుదురు. ఉదా రులు ధీరులు శూరులు వీరులు జన్మించుటకు స్త్రీజాతియేకారణ ము. ఆయుష్మంతులు, ఆరోగ్యవంతులు, ఆహ్లాదకరులు, ఆనం దయుతులు నావిర్భవించుటకు స్త్రీలె మార్గదర్శకులు. లోక మునకు చంచలభావమును బుట్టింప స్త్రీలు సాధనములుగనుం డినను సదుద్దేశముతో నడిపింపబడినపుడు పురుషులను తరింప జేయగలరని తెల్లమగుచున్నది. దీనినిమరువకుము.

దేవుడిటులేల స్త్రీలను స్వభావముచే జనులమోహింప జేయువారలనుగను మనశ్చాంచల్య ముదయింపజేయువారలను గను, సృజించెనని ప్రశ్నించుట యవివేకమగును. స్త్రీలజూచి నపుడు, పురుషులందు పవిత్రసంకల్పము లుదయించునటు లేల

దేవుడు సృజింపలేదని ప్రశ్నించుట మూఢ్యమగును. మోహ రూపిణియైనస్త్రీని చక్కగనడిపింపనెంచుము, ఆపెను మంచి యవకాశములందుంచుము. అంతఃపురమున నలంకరించి ఆంత రంగికముగవచించి యానందమనుభవింపుము. ఇంతయేకాని వే రువిధముననాపెను బహిఃప్రదేశమునసుంచి బాహ్యరూపమున చూచి బాహ్యార్థముగవచించి నిస్సంశయుడవై యానందమొం దజాలవు.

ఈశ్వరసృష్టిలోని స్త్రీపురుషులెటుల భిన్నరూపములతో భావములతో, మార్గములతో నడుచునట్లేర్పాటు సహజమై యుండెనో అటులనే సృష్టియందు సిద్ధాంతభాగము చరిత్రభాగ ము భిన్నలక్షణములై యుండుట సహజమేయగును. సద్భావము తో చూడబడినపుడు లేదానడిపింపబడినపుడు స్త్రీ-పురుషుని తరింపజేయుననియు, అంతఃపురమున నాంతరంగికముగ మాట్లా డినపుడు, స్త్రీ-పురుషులకు సర్వసంశయములబాపి, వారలనా నందాబ్ధిలో నోలలాడింపగలదనియు, పైనగ్రహించియుంటివి కదా. అటులనే నీవుచంచలుడవుగాక మోహింపబడక మనో బలసహితుడవై సదుద్దేశ్యముతో స్త్రీరూపమైన చరిత్రభాగ మును ఆంతరంగికముగననగా నంతరార్థముతో చూడుము. మరి యు, నంతఃపురమున నాంతరంగికముగ మాట్లాడినట్లెంచుము. అంతఃపురమనగా నీశరీరముయొక్క లోపలిభాగమని భావము. ఆంతరంగికముగ మాట్లాడుటయన అంతరార్థమువచ్చునట్లు చ-

రిత్రను అర్థము చేయుము.

స్త్రీలతో బాహ్యార్థముగ మాట్లాడుట భయంకరమని యనుభవముచే నెఱింగినటుల చరిత్రయొక్క బాహ్యార్థము భయావహమని భావించుము. సదుద్దేశమున నంతరార్థమున చరిత్రపవిత్రమైనదని సిద్ధాంతముచేయుము. అపుడునీవు సర్వసంశయరహితుడవగుదువు. బ్రహ్మానంద మొందుదువు. లేకున్న నీవు లోకజ్ఞానశూన్యుడవై వెఱ్రివానివలె గిర్రున తిరిగి గొర్రెదాటువలె నరకమున కరుగుదువు.

ఇట్టిపరస్పర విరుద్ధధర్మములుగల స్త్రీపురుషులకైక్యమెటులగలుగుచున్నదో గ్రహించినట్టి ప్రపంచవేత్త (గృహస్థుడు, గృహాధిపత్యములభించినవాడు) భిన్నములైన సిద్ధాంతభాగమునకు చరిత్రభాగమునకు ఐక్యసంధాన మొనర్చి సమన్వయస్వరూపుడు కాగలడేగాని, కేవలబ్రహ్మచారి—విద్యాపూర్ణుడుకానివాడు—విద్యాభ్యాసి—కడుపునింపుకొనలేక యొరులగడపల నడుగిడువాడు—బాలభిక్షుకుడు— బాల్యమునసన్యసించినవాడు- జగదనుభవమెఱుంగనివాడు- బైరాగి- రసవిహీనుడు- దేశాభిమాన రహితుడు-నిరుపయోగి-జోగి-యేమెఱుంగు. పై బాలురు (విద్యార్థులు, నిరక్షరకుక్షులు, భిక్షుకులు బైరాగులు, నిరుపయోగులు, జోగులు, ఈబుడకోళ్ళకు సద్వాక్యరత్నములుదొరికినను నవిరాళ్ళవలెనుండవచ్చు. తానుగృహస్థుడుకాజాలక ఆస్త్రీని స్వస్త్రీయని భావింపజాలక, ఆమెను

తన యావరణమందుంచక, విచ్చలవిడిగ బహిరంగముగ మా ట్లాడుట వినాశ హేతువని జగదనుభవ మెరింగినవానికి తోచ కమానదు.

స్త్రీహృదయము దుస్సాధ్యసంకుచిత కఠినచంచల మోహావేశజనక గుణంబులకాకరంబని యెఱింగినపురుషుడు ముందుగ నాయువతిని పెండ్లాడి యామెనుస్వ స్త్రీగాభావించును. అతడు గృహస్థుడై యామెను తనయావరణమునందుంచి ప్రసంగించి యానందించును.

ఆస్త్రీయందిప్పుడా దుస్సాధ్యసంకుచిత చంచలమోహజనక గుణంబులగాంచడు. అవి మాయమయ్యె. కారణమేమి? తనస్త్రీయనితలచి తనయావరణమునయుంచుటయే తగినకారణము. అనగా తనయావరణ మందొకస్త్రీకలదనియు నామెతనదేయనియు గ్రహించినపుడు సర్వదోషములు సంహరింపబడి శాంతముచేకూరుననిభావము. ఇక దీనివిమర్శింతము. తనయావరణమనగా తనయిల్లు. అని సామాన్యభావము. ఈసాదృశ్యముచేమనము గ్రహింపవలసినయర్థము వేరొకటికలదు. తనయావరణమనగా తనదేహమనియర్థము. ఆవరణమునకు గృహమనెడి సామాన్యార్థముజూచునపుడు అందొక మనుష్యశరీరధారిస్త్రీయుండెననుకొనుము. ఆవరణమునకు దేహమనెడి యర్థమునిచ్చినపుడు ఆనిజమైనగృహమందుండెడి స్త్రీ యిప్పుడీదేహమందు మాయయనెడిరూపముతోనుండెనని గ్రహింపు

ము. చరిత్రభాగము స్త్రీస్వరూపమగుటచే అందలి కథలన్ని యు మాయయొక్క చర్యలని స్పష్టమగుచున్నది.

ఆవరణమందుంచబడిన స్త్రీయొక్క చర్యలెట్లు హేయములుకాకుండునో అట్లనే తనదేహము నందుంచబడియున్న మాయయొక్క ధర్మములు (చరతా్రింశములు) సంశయాస్పదములై, అపవిత్రములయి వ్యభిచారబోధకములైయుండవు.

ఇది యెంతయోవింతయేయగును. స్త్రీమాత్రమొక్కటి యేకదా? ఆమె నొకపురుషుడు తనదిగాభావించి తాళిగట్టినేని యాతడామెను ముట్టవచ్చునట! వ్యభిచారముకాదట, అన్యుడామెనుముట్టిన వ్యభిచారమట! ఒకేపనియందొకనికి పవిత్రతయు, మఱియొకనికి దోషముకలుగుటయు చిత్రమగుచున్నది. ఆపురుషునివలె నితడు జన్మించలేదుకాబోలు? ఆస్త్రీసుఖమితనికి వికటించునాయేమి? దీనికి ప్రత్యుత్తర మద్భుతము. మొదటివాడాస్త్రీనిమిత్తమై జన్మించుటచే క్షేమముకల్గె. రెండవవాడామెకై జన్మింపనందున క్షీణముకలిగె. పుట్టుకప్రధానమని మెదడుకు తట్టుచున్నది. మొదటివాడాస్త్రీనిమిత్తము జన్మించెననుటకు ప్రమాణమేమన, ముందుగనామెను పెండ్లాడుటయే యగు. దీనికి మఱియొక యుదాహరణమిచ్చెదవినుము. ఒకడొక క్రొత్తభూమిని ముందుగ తానాక్రమించినప్పు డద్దానికధిపతి (భర్త) యగుచున్నాడు. అన్యుడాభూమి ననుభవించుట దోషమగుచున్నది. ప్రకృతమునకు బోవుదము.

పురాణముకొందరికి స్పృశింపనర్హమై, అందలిసుఖ మహానందదాయకమై, అందలిపదము లమృతపదవులయి, అందలిధర్మము క్షేమధామమై యొప్పుటయు మరికొందరికి తద్వ్యతిరేకముగ ప్రతిపద మాపత్ప్రదమైయుండుటయు స్వపరభేదంబుల స యెఱుంగుము. అనగా తనదియనితలచినపుడు పవిత్రతయు పరులదనిభావించినపు డపవిత్రతయు నేర్పడును. పురాణమన, సనాతనము ఆ సనాతనశక్తిస్వరూపిణియగు ముక్తికాంతకు కాంతుడగుటకై యాధ్యాత్మిక మార్గప్రవిష్టుడైయుండినగాని యతనికి పురాణము రాణించదు. ఐహికములం దూహాలుకలిగి విషయములకు బుట్టిండ్లై, విషస్వరూపులై యుండెడివారికి పురాణామృతము పుక్కిటబడదు. పురాణపురుషునకుబుట్టిన పుణ్యాత్ముడు † పురాణమతము ననుమతించి, పురాణకాంతను వరించి, పురాణపదమున వసింప దక్షుడగుగాని, మానవసృష్టికింబుట్టిన పట్టి యాపట్టును బట్టునెట్లు? ఎవనితల్లి రజస్వలాచతుర్థదినసస్నానానంతరము స్వభర్తను స్మరింపక నన్యుని తనమనమున నెలకొల్పుకొన నెవడు జనించెనో, అట్టివానికి పురాణమొక రణమునకు కారణమై మారణమున కిచ్చుచుండును.

పురాణములందలి చరిత్రలు శరీరమందిమిడియుండెడి

---

† పుణ్యాత్ముడు=ప్రణవముచే సృష్టింపబడినవి నాలుగుజాతులు. ఇవి స్వచ్ఛములగుట పుణ్యాములైనవి. వీటియొక్క సంకరముచే కలిగిన జాతులు మానవసృష్టి యనంబడు.

మాయాశక్తియొక్క యవస్థాభేదములనియు, అట్టిభిన్నావస్థల దెలుపుటకై ఆయాయంశములు నాటకరూపమున నేదజల్లెడి మార్గముగ నాయావేషములుగ డాల్పబడి ప్రపంచరంగమున నాట్యమాడెననియు, బుద్ధిమంతులగు గృహస్థులెరుంగుదురు. పురాణము * వేదాంతార్థ ప్రతిపాదకగ్రంధరాజమేయనుటకు వారు సందియ మొందరు. తెలియజెప్పినను లోకజ్ఞాన శూన్యులును బాలురునగు నిరక్షరకుక్షులకు కుక్షిపూరణమొనర్చి మోక్షము నొసంగజాలవు.

(1) సదన్వయము కలిగినగాని.........సమన్వయము కలుగదు. సత్ + అన్వయము=సదన్వయము=సం+ అన్వయము=మంచివంశమున జన్మించినగాని(గ్రంథార్థము తెలిసికొనెడి) సమన్వయశక్తికలుగదు,

(2) సంకరునకు..................శంకరశక్తి యుండదు శం=సుఖమును కరోతి=కలుగజేయువాడు=శంకరుడు పురాణమునకు సరియైన యర్థముగ్రహించి మనోల్లాస మొందువాడు.

(3) ఋతుస్నాతయొక్క మానసిక వ్యభిచారమున జనించిన వానికి......బుద్ధి వ్యభిచరించును=నిశ్చయాత్మకము గోచ

---

* పురాణము వేదాంతతత్త్వమందే సమన్వయించుననుట. శ్లో॥ ప్రాయేణపూర్వ (కర్మ) భాగోర్థో ధర్మశాస్త్రేణ కథ్యతే, ఇతిహాస పురాణాభ్యాం వేదాంతార్థః ప్రకాశతే॥ శ్రీనగరకృతరామాయణవ్యాఖ్యా.

రించదు.

(అనార్యుడు) అయిదవ వేదమైన భారతమున కొన్ని విషయములు పవిత్రములుగ దోచుచున్నవి కావు వాని సమన్వయమార్గములెవ్వి? అంతరార్థమెద్ది? భారతమున కుంతీదేవి శాపవశమున భర్తనుపొందుటకు వీలులేనందున యమ, వాయు, దేవేంద్రులబొంది సంతానవతియై యుండుట స్త్రీ ప్రపంచమునకొక కళంకము కాదా?

ఆ—ఆచరిత్రాంశమాద్యంత సహితమెఱుంగని బుద్ధి జాడ్యమునకీ క్రింది యాపథమొసంగుము. పెక్కుజనుల నీ పెనుభూతమావరించినచో నీక్రింది మంత్రముచే నభిమంత్రింపుము.

పాండురాజు తన భార్యనుగూడెనేని మృత్యువతని గూల్చునని యొక శాపముకలదు. కాన కుంతి సంతానహీనురాలయ్యె. "అపుత్రస్య గతిర్నాస్తి" యనెడు ధర్మశాస్త్రము ననుసరించి యామెపుత్రాపేక్షచే తనకేమిగతియని భర్తను ప్రశ్నించెను. మఱియునొకపూర్వచరిత్ర వినిపించెను. ఏమన "ఓనాథా! తొల్లిఋషితాస్యుడు తనభార్యయందు ఋతుని యమముల బాటింపక ననవరతము కామాసక్తుడై సంచరించుటచే నాయువుక్షీణించి త్వరలో మృతిజెందెను. అతనిభార్య సుభద్ర- పతియొక్క శవముపైబడియేడ్చుచు సంతానములేనిలోపమునకు దుఃఖించుచు వంధ్యురాల నైతికదాయని

తనపాపకర్మను స్మరించుచు నెట్టులైన సంతతినొసంగుమని శవ రూపమునుండి లేచిపోయిన సూక్ష్మశరీరయగు తనభర్తను ప్రార్థింపమొదలిడెను. ఆమెయొక్క పాతివ్రత్యమహిమచే నాశవము నుండి యొక్క దివ్యవాక్యము "ఓసతీ! చింతింపకుము ఈప్రజలకందఱకు నమ్మకము కలుగు విధమున చెప్పుచున్నాను. నిన్నెవరును దోషురాలని యనవీలులేదు. ఋతువైనపిమ్మటస్నానమొనర్చి ఆనెలలో నెనిమిదవనాడో పదునాల్గవదివసమందో రాత్రిశయనించినపుడు నన్నుస్మరింపుము నీకుగర్భముకాగలదు." అనివినిపించెను. ఆమెయాటులజేయ మువ్వురుసాల్వను నల్వురుమాద్రులుజన్మించిరి. కాన నీవుదయయుంచి దైవానుగ్రహమున నాకుసంతతికలుగునటులజేయవేడుచున్నానని విధేయురాలై విన్నవించెను పాండురాజావాక్యములువిని ఓసతీ నీవువచించినది విధిగజేయదగినపని. నేనుస్వయముగ నీయందు సంతానము గనవీలులేకపోయె. సృష్టిప్రారంభమున 1728000 వత్సరములవఱకు స్త్రీపురుషులు పరస్పరశరీరసంబంధ కర్మమార్గములేకయే

"ధ్యానేన మనసా తాసాం ప్రజానాంజాయతేసకృత్"

(మార్కండేయ పురాణం)

మనోబలముచేతనేఅనగా సంకల్పించినమాత్రమున పరిశుద్ధాత్ములైనవారు స్త్రీలయందు సంతానోత్పత్తిచేయుచుండిరి. త్రేతాయుగము ప్రారంభించినపిమ్మట ఆశక్తిచాలావఱకు తగ్గిపో

యెను. ఇప్పటికిని మహనీయులు కొందఱట్టివారు కలరు. ఆయో గమహిమచే పరస్త్రీలయందున ఖుతము సంతానము కనినదో షములేదు. ఆపద్ధతియందు అంగాంగసంబంధముండదు. ఇటుల పూర్వకాలమున నడుచుచుండెడిది. ఉద్దాలకుడను మహర్షికల డు. అతడుకృతయుగ పురుషుడు. అతనికాలములోనే త్రేతా యుగము ప్రారంభమయ్యె. ఆఋషియు నతనిసతియు నంగాంగ సంబంధములేని మనోబలముచే సంతతిగనిరి. వారిపుత్రుడు శ్వే తకేతువు. ఇతడు త్రేతాయుగములోనివాడగుటచే నంగాంగ సంబంధముగ తనభార్యతో సంసారము చేయుచుండెడివాడు. పూర్వయుగముమారుటయు నూతనయుగమువచ్చుటయు నీ సంధికాలమున ధర్మములు తారుమారగుచుండెను. పూర్వధ ర్మములు నవీనులకు కంటకముగనుండెను. ఇట్టిస్థితిలో పూర్వధ ర్మముననుసరించి యొకఋషి సంతతిలేనివాడై ఈశ్వేతకేతువు యొక్క తల్లియందు తనయోగమహిమచే పుత్రుని కలిగించి యతనిని తనవంశస్థుడుగా చేసుకొనుటకు నిశ్చయించి వారింటికి వచ్చి తనకోర్కె విన్నవించెను. ఆసతీపతులు పూర్వసాంప్రదా యములోనివారగుటచే వల్లెయనిరి. ఈసంభాషణమువినిన శ్వే తకేతువు ఆనూతనమైన త్రేతాయుగమున స్త్రీపురుషులాచరిం చెడి మిధునకర్మమందు పరపురుషుడు పరస్త్రీని వినియోగించు నట్టిస్థితి క్రమముగ రాగలదని నిశ్చయించి అసమర్థులునయిత ము పూర్వయుగధర్మప్రకారము యోగశక్తిచేతనే పరస్త్రీ

యందు సంతతికలుగజేసెదమని పలుకుచు సామాన్యమిథునక ర్మములోనికి దిగుచుండురనియు గ్రహించి సర్వులనునమ్మట కువీలుండదని యధిమొదలు పరస్త్రీలను సంతతికై వినియోగిం చరాదని శాసించెను. సనాతనధర్మరహస్యమిపుడు వినియుం టివికదా? వాస్తవమువిచారించినపుడు సంతానమునిమిత్తము సంకల్పశక్తిప్రభావముచే పుత్రోత్పత్తిచేయగల మహాత్ములనా శ్రయించుటదోషముకాదు. కాన నీవిపుడు దేవతలనాశ్రయిం చి సంతతిబడయుము.

శ్లో॥ మన్నియోగాత్ సుకేశాంతే ద్విజాతేస్త
పసాధికాత్॥ 30
పుత్రాన్ గుణ సమాయుక్తాన్ ఉత్పా
దయితుమర్హసి॥ 31. (సంభవపర్వం. 122 అ.)

నాయాజ్ఞచేతపోబలముగలనీవు తపోధనులగు దేవతలవల్ల బిడ్డలగనుటకు సందేహించకుమని తెలిపినపిమ్మట బాల్యమున పితృగృహమున నుండుకాలమున తండ్రితనను అతిథియైన దు ర్వాసమహర్షియొక్క పూజార్థము నియమించెననియు ఉప చారవిశేషమున ఋషిసంతుష్టుడై యొకమంత్రమునుప్రసాదించి దీనినిపఠించి నీయిష్టమైనదేవుని ప్రార్థించిన నతడుప్రత్యక్షమై నీ కుపుత్రులనీయగలడని వచించెననియు మీయాజ్ఞచే నామంత్ర మునకుతగిన కాలమాసన్నమైనదనియు, కుంతీదేవినిశ్చయించి

"ఆవాహయామికందేవం బ్రూహిసత్యవతాంవర"

(సంభపర్వము 39 శ్లో॥)

ఏ దేవుని ధ్యానించవలెనో యానతిండని పాండురాజునడిగెను.

"తస్మాద్ధర్మం పురస్కృత్య నియతాత్వంశుచిస్మితే॥ ౪౩
ఉపచారాభిచారాభ్యాం ధర్మమావాహయస్వవై॥౪౪

నియమముకలదానివై ఉపచారము చేతను (దేవతాకర్షణశక్తి చేతను, యమధర్మరాజును ఆవాహనముచేయుమని పతి తనపత్నిని హెచ్చరించెను)

"జజాపవిధివజ్జాప్యం దత్తందుర్వాససాపురా॥ ౨ శ్లో.
ఆజగామతతో దేవో ధర్మోమంత్రబలాత్తతః।
విమానేసూర్యసంకాశే కుంతీయత్రజపస్థితా॥
(123 అధ్యాయం)

ఆమెదుర్వాసదత్తమంత్రమును విధియుతముగ జపించెను. యముడు మంత్రబలముచే నాకర్షింపబడి సూర్యప్రకాశయుతమైన విమానమునెక్కి జపము చేయుస్థలమునకు చేరెను. యముడు నీకోరికయెట్టిదని ప్రశ్నింప, కుంతి పుత్రదానము సేయుమని ప్రార్థించెను.

౫శ్లో॥ సంయుక్తాసాహిధర్మేణ యోగమూర్తిధరేణహ"
లేభేపుత్రం వరారోహా సర్వప్రాణభృతాంహితం॥
(123 అధ్యాయం)

అంతట యముడు తనపరిశుద్ధాత్మను కుంతియందు ప్రవేశపెట్టదలచి యోగస్వరూపముదాల్చెను. కనుక నే శ్లోకమందు యో

గమూర్తిధరేణ అని చెప్పబడినది. అట్టి యోగశక్తిచేగూడిన దై కుంతిధర్మరాజునుకనెను. * ఏసుక్రీస్తుజననము జ్ఞాపకమునకు వచ్చుచున్నట్లు నీహృదయమునిన్ను మేల్కొలుపుచున్నదికదా. ఇట్టి ప్రబలప్రమాణముజూచియు పెంకెతనమువహించి కుంతికి రంకుతనమే పొంకమని చంకలెగరవేయుచో మరియు మ్మవిషయములో సంశయముపుట్టుటయు న్యాయముకావచ్చు.

123 అధ్యాయము 3వ శ్లోకములో..............

శ్లో॥ ఆజగామతతోదేవో * * * కుంతీయత్రజపస్థితా॥

ఇక్కడచూచితివా! కుంతియెచట జపముచేయుచుండెనో ఆస్థలమునకు యముడువచ్చెనట. వ్యభిచారమునకు జపస్థలములు వినియోగపడవుకదా? జపకాలము పగటివేళయగుకాని అర్ధరాత్రికాదుకదా? ఆ దివాసమయము స్త్రీపురుషుల కలయికకువీలగునా? మఱియు ప్రత్యక్షమైనదైవము మనుజశరీరికాడు. గనుక వ్యభిచారము పొసగుటయు నసంభవమేయగు. ఆయన నరశరీరము ధరించినను కుంతి వ్యభిచారోద్దేశమునలేదుకదా?

రాత్రింబవళ్ళనెడి భేదములేక హెచ్చుమీరిమచ్చికపడి

* క్రీస్తువుతనతల్లియందు తనతండ్రిసంబంధములేకయే జనించెను. పరిశుద్ధాత్మయొక్క శక్తిప్రభావమున "మరియమ్మ" క్రీస్తువునుకనెను. వేములవాడభీమకవి తండ్రిచనిపిమ్మట తల్లియందు వరప్రసాదమున పుట్టెను. వ్యాసుడు అంబా అంబాలికలయందు సంతతిగనుటయు యోగశక్తిచేతనే.

వెచ్చవెచ్చగనుండునని వృక్షచ్ఛాయలండిఛ్ఛావృత్తిచే విహరిం చెడివారికది విహితమనితోచునేమోకాని నీతివంతులకది సమ్మతముకాదు. యమధర్మరాజు దేవలోకనివాసియగుటచే కుంతి యతనివరప్రసాదమున ధర్మరాజును కనుటదోషముకాజాలదు. ఇక్కాలమున పలువురీభావముగ్రహింపలేక పరపురుషసంపర్కముచేస్త్రీలు బిడ్డలగనుట పూర్వాచారమునకలదని తలచుచుందురు. పరపురుషులవల్ల సంతతిగనుటనిజమేని ఆయముడు భూలోకమున కుంతియింట్లోకొన్ని దినములునిలిచి యాగృహమున భుజించుచు కుంతితోకాపురముచేయుచు నామెగర్భవతియైనపిదప నీలోకమువిడిచి దేవలోకమువెళ్లవలసియుండును. అటుల జరుగలేదు. యముడువరమొసంగి వెంటనే అంతర్ధానుడయ్యెననికలదు కథాసందర్భమిటులుండ సంగమాపేక్షచే సంగముప్పొంగినటుల ప్రసంగించుట సత్సంగమెఱుంగని లక్షణమని విచక్షణులూహించుచుందురు. కొంతకాలము గడచినపిమ్మట కుంతీదేవి పతితోమఱల నేదేవునిభజింతునని విన్నవించెను. వాయుదేవుని జపించుమని పతితెలుప పూర్వోక్తరీతి మంత్రబలముచే జపించి వాయుదేవుని వరప్రసాదమున భీమునికనెను. తిరిగి పత్యాజ్ఞానుసారముగనింద్రునిభజించి యర్జునునిబడసె. ఆ మంత్రమును తనసవతికుపదేశించె. ఆమెయుపతియొక్కయభీష్టముపై అశ్వనీదేవులనుపాసించి వారియాశీర్వచనము బడసి నకులసహదేవులగనెను.

అ—కుంతీవృత్తాంత మింతవిపులముగ వినియుండనైతి. ఇక ద్రౌపదిసిగూర్చి యొకసందియముకలదు. ఒకపురుషున కనేకస్త్రీలుండుట ప్రపంచమున జూచుచున్నాము. లోకమందెక్కడను ఒక్కస్త్రీ పెక్కు మందిని వివాహమాడుట వినికనియెరుగము. అట్లుండినను కొలదికాలమున పురుషులకు పరస్పరప్రేమనశించి రోషోపహతులై పరలోకవేషములదాల్తురు. లోకమిటులుండ ద్రౌపతియేకకాలమున నైదుగురుపురుషుల నేల భరించెను?

ఆ—మార్కండేయపురాణమందీకథ బాగుగావివరింపబడెను. వినుము.

> బ్రహ్మహత్యాభిభూతస్య పరాహానిరజాయత
> తదాధర్మంవివేశాథ శాక్రంతేజోపచారతః॥

ఇంద్రుడుపురోహితుడగు విశ్వరూపునిజంపగా బ్రహ్మహత్యాపాతక మంటుకొనెను. అతనియందున్న ధర్మశక్తి ఆ పాపివద్దనిలుచుట తగదనియెంచి (శాక్రంతేజః) ఇంద్రతేజము ధర్మంవివేశ) యమధర్మరాజునుచేరెను.

> బ్రహ్మహత్యాభిభూతస్య తదాబలమశీర్యత
> తచ్ఛక్రదేహావిభ్రష్టం బలంవాయుమథావిశత్॥

మరియొకమారు ఇంద్రుడు వృత్రాసునిజంప రెండవపాతకమంటుకొనెను. అతనిబలశక్తి ఆపాపివద్దనిలుపజాలక (తచ్ఛక్రదేహావిభ్రష్టం) ఆశక్రుని ఇంద్రునిదేహమునుండిజారిన

డై (వాయుం అథావిశత్)=వాయుదేవుని చేరెను.

గౌతమస్యాశ్రితోరూపం అహల్యాంచయదావృషా
ధర్షయామాస దేవేంద్ర స్తదారూపమహీయత
అంగప్రత్యంగలావణ్యం తదతీవమనోరమం
విహాయదుష్టం దేవేంద్రం నాసత్యావగమత్తుతత్॥

ఆఅహల్యనుపొందినదోషముచే నతనిరూపలావణ్యశక్తులు, అశ్వినీదేవతలందుజేరెను. గౌతమశాప మనుభవించుటకు మాత్ర మతనియందొక్క శక్తినిలిచెను.

ధర్మేణ తేజసాత్యక్తం బలహీనమరూపిణం
జ్ఞాత్వాసురేశం దైతేయాః తజ్జయేచక్రురుద్యమం
రాజ్ఞాంసుదృప్తవీర్యాణాం దేవేంద్రంవిజిగీషవః
కులేష్వతిబలాదైత్యాస్స్వజాయంతమహామునే॥

ధర్మ, బల, రూప, శక్తులగోల్పోయి బలహీనుడై చరించు దేవేంద్రుని జయింప సమయమే తెంచెనని యతనిశత్రువులైన రాక్షసు లవలోకించి భూలోకమున రాజవంశములలో బుట్టిరి.

తెనుగుమార్కండేయపురాణము.

1. ఆశ్వాసం. వృత్రవధవృత్తాంతము.

వ॥ అంత.

క॥ ఆహల్య జేసియింద్రుని।
దేహబలమువోయి వాయుదేవునిగూడెఁ।

మాహాత్మ్యమజ్గవిప్ర|
ద్రోహంబున నెట్టిదైన దురితముబొందుర్॥ 106

క॥ ఆసమయంబునను నహా|
ల్యాసక్తుండగుట నిందుృడగ్గౌతముచే|
గాసిపడి నైజ తేజము|
బాసి వికృతి నొంది నష్టబలుడై యుండెన్॥

చ॥ తదవసరంబునన్ సకలదైత్యులు దానవులున్ఃపదంబునన్
దిృదశవిభున్ జయింపగ మదిందలపోసి మఘాధిధర్మసం
పదలణగింపబూని బహుపార్థివవంశములందుబుట్టి రు
ర్విదలరిభూరిభారవహ విహ్వలమై చనియెన్సురాదిృకిన్

మ॥ చనియింద్రాదిసుపర్వులంగని మనస్తాపంబుదీపింప ని
ట్లనెనద్దేవి మనుష్యలోకమున నత్యంతోగ్ర తేజోఘనుల్
దనుజుల్ పుట్టినవారనేక నృపులై తత్సేనలక్షోహిణుల్
వినుడేనోర్వగజాల మీకతగునా వేృగంతయున్ బాపగాన్

భారతం. ఆదిపర్వం 3 అశ్వాసము.

క॥ అమరాసుర ముఖ్యులయం|
శములను మహిబుట్టిసకల జనపాలక సం
ఘములకు భారతరణ రం
గమునను లయమొందనేమి కారణమనినన్॥

ఇట్లడిగిన జనమేజయునకు వైశంపాయనుడు.

క॥ దితిసుతదానవయుత|

పౌత్రతులయంశముల బుట్టిప్రజలకువిహితా
హితులగుచుండిరనేకులు|
జితకాశులుధరణిపతులు శిశుపాలాదుల్||
అతులబలాఢ్యులైన యమరాంశసముద్భవులెల్ల బాండు భూ
పతిసుతపక్షమై సురవిపక్షగణాంశజులెల్లదుర్మదో
ద్ధత;కురురాజపక్షముయి ధారుణిభారమువాయఘోర భా
రతరణభూమినీల్గిరి పరస్పరయుద్ధముసేసివీరులై||

ఇటులరాక్షసులు దుర్యోధనాదులయి బుట్టినసంగతి గ్రహించి దేవతలందఱు సభచేసిరి. అందుప్రభువగు దేవేంద్రుడుయారాక్షసులజంపుటకు తగినదేవతలందఱిని భూలోకమున రాజులైపుట్టునటులగోరెను. తానుకూడాజన్మింపదలచెను. అయితే తనకు కలిగినచిక్కు అనగా—

తనయందుండు ధర్మశక్తి ధర్మరాజునందును.

తనయందుండు బలశక్తి వాయుదేవునందును,

తనయందుండు రూపలావణ్య శక్తులు అశ్వనీదేవతలందును, చేరుటనుగ్రహించినదేవేంద్రుడు, ఆయమునిని,-వాయుదేవుని,-అశ్వనీదేవులను,-పిలిచి "మనరాజ్యము మనకుండినపుడు మనలోనెన్ని భేధములు-విరోధములు-అసూయాలు-ఉండినదోషముండదు. శత్రువులు ప్రబలి మనలవిధ్వంసముచేయసమకట్టినపుడు మనలో మనకైకమత్యముకలుగదేని యాశత్రువులు నన్నొక్కనినే హింసించి రాజ్యభ్రష్టునిచేయుటతోడనే తృ

ప్తి జెందరు. నాతోబాటు మీరందఱును హింసింపబడుదురు. నా ప్రాణరక్షణార్థము నేనెట్టుల తపించుచు నుపాయమఱియు చుంటినో మీ ప్రాణరక్షణ మొనర్చుకొనుటయు మీకుపరమధర్మమగును. మనలోనియంతఃకలహముల నీసమయమున కెలుకుకొనుట దేవలక్షణము-సాత్త్వికధర్మము-బుద్ధిచాతుర్యముకానేరదు. అదిరాక్షసకృత్యము. మనముశత్రుసంహార మొనర్చి మనరాజ్యమును స్థిరపఱచుకొనినపిమ్మట నాయందున్ననేరములకు మీరుశిక్ష యొనర్పవచ్చును. నాధర్మశక్తిని, బలశక్తిని, రూపలావణ్యశక్తిని మీరుకొల్లకొట్టవచ్చును. ఎట్లైనను మనయాస్తి మనలోనున్నయెడల నొకరు హెచ్చైనను మఱియొకరు హీనులైనను, వారిని భిక్షమెత్తుకొని వీరుజీవింపవచ్చును. ఒక జాతియందుపుట్టి యనేకకోట్లవత్సరములనుండి మీరును నేనును, సోదరులవలెసంచరించుచు నేదోయొక కర్మవిశేషమున దౌర్భాగ్యదశకువచ్చిన నన్నన్యునివలెజూచుట ధర్మస్వరూపులగు మీబోంట్లకుతగదు. న్యాయవాదులని పన్నెకెక్కిన మీరీసమయమున నన్యాయము సేయరాదు. మీకుసంఘబలముకలదు. నాసంఘమంతయు ననగా నాశక్తులన్నియు మీయందుచేరెను. బలహీనుడనైన నన్ను 'నాశత్రువులొకవంక తరుముచుండ, నాదేవజాతియగుమీరు మఱియొకప్రక్క నన్నణగద్రొక్కుటతగునా. నూరుమేళ్ళుచూచినగాని మనకొక్కమేలు దక్కదనుసామెతవ్యర్థమగునా? లోకముననేనొకడనే త

ష్టుచేయువాడనా. సర్వులకుప్రభువునై యందఱకుబుద్ధిచెప్పు చుండెడినేనే కాలవశమున నధర్మమొనర్చి యేకాంగినై దిక్కు లేని పక్షినైయుండ ప్రతిజీవునకు నేదోయొక కాలమున దుర్బు ద్ధులుదయించి నావలె భ్రష్టులై యుండకుందురను టస్వభావ మా! సింహమునకు చిట్టెలుకతో పనిలేకుండునా. ఇక ప్రత్యు త్తరము చెప్పక సహాయ మొనర్పుడు.

"నేనుభూలోకమున కుంతియందు జన్మింపనెంచుచున్నా ను. మీవద్ద చేరియుండిన నాశక్తులను ఆమెయందుంచితి రేని త చ్ఛక్తులద్వారా నేనాయారూపములధరించి పుట్టెదను. ఈసం దిగ్ధసమయమున నిటులపరస్పరసహాయము పొందెడిస్థితిలభించి నయెడల దేవరాజ్యముస్థాపితమగును. త్రిలోకములకు శాంతి చేకూరును."

అనియిటుల దేవేంద్రుడు సర్వులను ప్రోత్సహించెను. దే వతులందఱు సత్యముగ్రహించి యటుల జేయుటకంగీకరించిరి.

మార్కండేయపురాణం.

శ్లో॥ కస్యచిత్వ్యధకాలస్య ధరణీభారపీడితా
ప్రజానాముపకారార్థం భూభారహరణాయచ
యదింద్రదేహజం తేజస్తం ముమోచస్వయంవృషా
కుంత్యాంజాతో మహాతేజాః॥

భూభారహరణార్థము దేవేంద్రుడు కుంతియందుదయిం పనెంచెను. పైకథవలన నింద్రుడు ధర్మ, బల, రూప, శక్తుల

గోలోప్యమనని వినియుంటిమికదా! ఆయమధర్మరాజును చేరిన (ఇంద్రునియొక్క) ధర్మశక్తి * * * *

(తతో రాజాయుధిష్ఠిరః॥) కుంతియందుధర్మరాజై పుట్టెను.

బలంము మోచపవనస్త్రత భీమోవ్యజాయత।

వాయుదేవుని చేరిన దేవేంద్రునియొక్క బలశక్తి కుంతియందు భీముడై జన్మించె.

ఉత్పన్నౌయమళౌమాద్ర్యాం శక్రరూపౌమహాద్యుతి।

అశ్వినీదేవతలయందు చేరిన (ఇంద్రునియొక్క) రూపశక్తి మాద్రి (పాండురాజు రెండవభార్య) యందు నకులసహదేవులుగాబుట్టిరి.

శక్రస్యవీర్యతశ్చైవజజ్ఞే పార్థోధనంజయః।

ఇంద్రునియందు నిల్చియున్నవీర్యశక్తి కుంతియందు అర్జునుడైపుట్టె. కుంతియు మాద్రియు యమవాయ్వశ్వినిదేవతలను ప్రార్థించినట్లగపడుచున్నను ఆధ్యానము ఇంద్రునిగూర్చియేయనియు యమవాయుఇంద్రి అశ్వనులు ప్రత్యక్షమైనట్లు తెలియుచున్నను, ఆయాదేవతారూపములతో ఇంద్రశక్తియే ప్రత్యక్షమయ్యెననియు యమవాయ్వశ్వినీదేవతలు కుంతీమాద్రిలకు వరములిచ్చినను ఆవరశక్తి ఇంద్రునిదేయనియు కుంతీమాద్రిలందు యమవాయువులు పుట్టిరని చెప్పినపుడు ఇంద్రునియొక్క ధర్మబలశక్తులే జన్మించెననియు ఈ పంచపాండవరూపములు వేరుగా నగపడుచున్నను ఒక్క ఇంద్రస్వరూపమే

కాని ప్రత్యేకపురుషులయిదుగురు లేరనియు స్పష్టపడుచుండె
ను. ఈరహస్యముగ్రహించిన బుద్ధిమంతులీయైదుగురి నొకరిని
గాభావించుచుందురు.

పంచధాభగవాన్నిత్య మవతీర్ణశ్శతక్రతుః।

భగవంతుడైన శతక్రతువు (ఇంద్రుడు) అయిదువిధ
ములుగా నవతరించెనని దీనియర్థము.

తెలుగుమార్కండేయపురాణం.

మాలిని॥ అసురదమన లీలాయత్తకౌతూహలుండై మసలక భు
విగుంతీమాద్రులందు ద్భవించెన్। వసుధభరము మా
న్పన్ వాసవుం (ఇంద్రుడు) డిట్లు తేజో। విసరపిహిత
మూర్తుల్ విస్ఫురింపన్ మునీంద్రా॥

క॥ పెక్కండ్రగుఁడుపేరులు। ని
ట్లొక్కజముగదాల్చిపుట్టెనట్టిమహేంద్రుం
డొక్కండకాక ద్రౌపతి
కెక్కడివా రఱయుభర్త లేవురు చెపుమా॥

వ॥ అనివిహంగవల్లభులు ద్రౌపదియేవురకు నేకవల్లభయైన తె
రంగెరింగించి—

పంచానాంమహిషీ చైషాభూదింద్రాంశావతారిణాం॥

ఇంద్రునిభార్యయగు శచిదేవి ఇంద్రాంశసంభూతుల
గుపంచపాండవులకు భార్యయైపుట్టెను.

తస్యోత్పన్నామహాభాగాపత్నీ కృష్ణాహుతాశనాత్

శక్రస్యైకస్య సాపత్నీకృష్ణానాన్యస్యకస్యచిత్

ఈశ్లోకములన్నియు మార్కండేయ పురాణములోనివి.

ఆశచీదేవి అగ్నిగుండమునుండి ద్రౌపదియనెడి నామాంతరమున నావిర్భవించెను. శ్రీమహావిష్ణువు, లక్ష్మియు నెట్లు వసుధాభూలోకమున కృష్ణుడై, రుక్మిణియై, రాముడై, సీతయై జన్మించిరో అటులనే ఇంద్రుడును శచియు పంచపాండవరూపమున ద్రౌపదిరూపమున నవతరించిరి.

అ—శచీదేవి ద్రౌపదిగాజన్మించెననియు ఇంద్రుడు పంచపాండవరూపమును ధరించెననియు భారతమున చెప్పబడక సంబంధములేని మార్కండేయపురాణమున నుండుటెట్లు?

అ—భారతమునకూడ కలదు. విమర్శనముచే జదివిన గదా తెలియుట.

శ్లో॥ ద్రౌపదీత్వథసంజజ్ఞే శచీభాగాదనిందితా।

భారతము ఆదిపర్వాంతర్గత సంభవపర్వము ౬౭ అధ్యాయం ౧౫౭ శ్లో. ద్రౌపదిశచీదేవియొక్క అంశమువలన జన్మించెను.

శ్లో॥ ద్రుపదస్యకులే కన్యా వేదిమధ్యాదనిందితా
పంచానాంపురుషేంద్రాణాం చిత్తప్రమథనీరహః

ఇది పిమ్మటిశ్లోకము.

ద్రుపదకులమున వేదిమధ్యము (అగ్నిగుండము) నుండి పుట్టి పంచేంద్రులగు (అయిదు ఇంద్రభాగములైన) పంచ

పాండవులకు భార్యగా నేర్పడెను.

ఇటులనే భారతమున ఇంద్రుని చరిత్రియు పూర్ణముగ విస్తరింపబడెను. ఈ యైదుగురు భిన్నపురుషులైనచో ఒక్కస్త్రీ నియాశించి జీవితాంతమునవరకు నిలిచియుండుట యసంభవమని లోకానుభవము చే నెరుగుదుము.

భారతం. ఆదిపర్వం. వ్యాసుడు.

శ్లో॥ ఏ తేపూర్వం శక్రరూపానిబద్ధాః తస్యాం దర్యాం పర్వత స్సదరస్య। ఇహైవ తే పాండవావీర్యవంతః శక్రిస్యాంశః పాండవస్సవ్యసాచీ। ఏవ మే తే పాండవాస్సంబభూ వుర్యే తే రాజన్ పూర్వమింద్రాబభూవుః॥
(ఏ తే=ఈ పాండవులు రాజన్=ఓద్రుపదరాజా! పూర్వం= పూర్వము ఇంద్రాః=ఇంద్రులుగా బభూవుః=అయియు న్నారు.)

శ్లో॥ లక్ష్మీశ్చైషాం పూర్వమేవోప దిష్టాభార్యాయైషా ద్రౌపదీ దివ్యరూపా॥
(ఏషాం=ఈ పాండవులకు ఏషాద్రౌపదీ=ఈద్రౌపది, లక్ష్మీః= స్వర్గలక్ష్మి అనగా శచీదేవియైన భార్యా=భార్యారూప మునుమా)

వ్యాసమహర్షి ద్రుపదునితో నీద్రౌపదిపూర్వము దేవేం ద్రునిభార్యయైన శచీదేవియనియు నాయింద్రుడే యిప్పుడు పం చరూపములుధరించి పాండవులుగా నుండెననియుబోధించినను

దుౄపదుసకు సందియముతీరదాయె. ఈసంగతిగ్రహించినఋషి

శ్లో॥ ఇదంచాన్యత్ ప్రీతిపూర్వంనరేంద్ర।
దదానితేదివ్య మత్యద్భుతంచ।
దివ్యంచక్షుః పశ్యకుంతీసుతాంస్త్వం।
పుణ్యైర్దివ్యైఃపూర్వదేహైరుపేతాన్॥

దుౄపదునకు దివ్యచక్షువు ప్రసాదించదలచి ఓరాజా నాచేనొసంగబడు నీజ్ఞాననేత్రముచే వీరలనుచూడుము. వీరల పూర్వజన్మములు గోచరించునని

శ్లో॥ తతోవ్యాసః పరమోదారకర్మా
శుచిర్విప్రస్త పసాతస్యరాజ్ఞః
చక్షుర్దివ్యం ప్రదదౌతాంశ్చ
సర్వాన్రాజా పశ్యత్పూర్వదేహైర్యథావత్॥

జ్ఞానచక్షువునొసంగెను. ఆదివ్యనేత్రముచే దుౄపదుడు పాండవులదేహములందు తేజోరూపములైన నైజదేహముల ను=ఒకేరూపముగల ఇంద్రరూపములను దర్శించి సంశయనివృత్తిజెందె.

శ్లో॥ ప్రీతోరాజా దుౄపదోవిస్మితశ్చ।
దివ్యాంమాయాం తామవేక్ష్య ప్రమేయాం।
తాంచైవాగ్ర్యాం స్త్రియమతిరూపయుక్తాం।
దివ్యాం సాక్షాత్సోమవహ్ని ప్రకాశాం।
యోగ్యాంతేషాం రూపతేజోయశోభిః

పత్నీం మత్వాద్రుష్టవాన్ పార్థివేంద్రః॥

పిమ్మట ద్రౌపదిని నిరీక్షించెను. ఆమెయందు జగజ్జనకశక్తి
యై దివ్యమైయుండు మాయాస్వరూపము సోమవహ్నిప్రకాశ
ముకలదియై ప్రత్యక్షమయ్యెను. ఆ పాండవులకు తనపుత్రి సతి
యగుటకు తగియుండెనని విశ్వసించి సంతసించెను.

సోదరా! మత్స్యయంత్రి మర్జునుడు ఛేదించినపుడు దుర్ప
పదుడు ధర్మజునిబిలిచి నీతమ్మునకు నాకూతురునిచ్చెదను. వి
వాహప్రయత్నముచేయుమనెను. ధర్మరాజు "అతనికొక్కనికి
కాదు. మా యైదుగురికిచ్చి పెండ్లిచేయవలసినదిగా దెల్పెను.

అప్పుడుద్రుపదుడు

ఆదిపర్వం వైవాహికపర్వము.

శ్లో॥ ఏకస్యబహ్వోవిహితా................

నైకస్యాః బహవః పుంసః శ్రూయంతే పతయః
క్వచిత్॥ లోకవేద విరుద్ధం త్వం .........

ఒకపురుషునకు బహుసతులు విహితమైయుందురు. ఒక
స్త్రీకి బహుపురుషులుండరాదని వేదమున వినబడుచున్నది. అ
యిదుగురొకతెను పెండ్లాడుట లోకవిరుద్ధము. వేదదూషితము
న్ను. ధర్మస్వరూపుడవైన ధర్మరాజా! నీకీయధర్మబుద్ధి యెటు
లకలిగెనని ప్రశ్నించెను.

శ్లో॥ సూక్ష్మో ధర్మోమహారాజన్

ఆస్యవిద్మోవయంగతిం| పూర్వేషామాను

పూర్వేణయాతం వర్త్మానుయామహే॥

ఓరాజా! నీవు చెప్పినది ధర్మము. ధర్మసూక్ష్మములు కొన్నికలవు. ఆధర్మసూక్ష్మములననుసరించి మనపూర్వులు నడిచినమార్గమున మనమునడుచుటయు న్యాయమేయగు. నేనిపుడు ధర్మసూక్ష్మమార్గమును బ్రశంసించుచున్నాను. వేదధర్మమునకు లోకధర్మమునకు విరోధముకానట్టివి పైకిజూడ లోకవేద విరుద్ధములుగ గోచరించునవి కొన్ని ధర్మసూక్ష్మములుకలవు. అధర్మముగదోచెడి యాధర్మములు, బుద్ధిసూక్ష్మతచే విచారించినంగాని ధర్మములుగ గోచరించవు. మూలసూత్రమునకు భంగములేని మార్గములన్నియు వైదికములే. భంగమూ కాదా-యనివిమర్శించునట్టి తెలివి వేదసాంప్రదాయములెఱింగిన, వైదికకర్మానుష్ఠాన పరులగు సనాతనధర్మ పరాయణులకే యుండును. ఇపుడుమన దేశాచారమున స్త్రీకి బహుపతులుండ రాదని నేనెఱుంగనివాడకాను. * కావుననే యిట్టివివాహము దేశాచారమని తెల్పుటకు సాహసించుటలేదు. ధర్మమని చెప్పక ధర్మసూక్ష్మమని వచించుటకు కారణమదియె. దేశాచారమున స్త్రీలు బహుపతులవివాహమాడుట నిజమేని నీకాసంగతి తెలిసియుండెడిదె. నీకుసంశయమేలేకపోయెడిది. మాదేశాచారమ

* టిబెట్టుదేశమునస్త్రీలు బహుపతులను వివాహమాడెడి యాచారముండినను, ధర్మజుడా దేశస్థుడైనచో మాదేశాచారమనియె తెల్పియుండును.

నిచెప్పుటకున్ను నాకు బహుప్రమాణములు లభించుటలేదు. అయితే యిదిధర్మసూక్ష్మమని తెలుపుచు, నిట్టియాచారము నొకానొకచోటున కలదనిమాత్రము తెలుపగలను. మనకను లారగాని మన తాతముత్తాతల కాలమునగాని స్త్రీలకు బహుప తులను పెండ్లాడునట్టియాచారములేదని దృఢముగజెప్పగలను. పూర్వకాలమున నొకటిరెండు వివాహములు సూక్ష్మధర్మము ననుసరించి జరిగెనని పురాణవచనము మాత్రముకలదు. మా విషయముకూడ నట్టిధర్మసూక్ష్మములలో చేరియున్నదివినుము.

శ్లో॥ శ్రూయతే హిపురాణేపి జటిలానామగౌతమీ।
ఋషీనధ్యాసితసతీ సప్తధర్మవతాంవరా।
తథైవమునిజావార్క్షీ తపోభిర్భావితాత్మనః।
సంగతాభూద్దశభ్రాతౄనేకనామ్నః ప్రచేతసః

గౌతమసగోత్రోద్భవుడైన జటిలుడను ఋషియొక్క కూతురు ఏడుగురిని పెండ్లాడెను. దాక్షాయణియను ఋషిబిడ్డ ఒకేపేరుగల అన్నదమ్ములను పదిమందిని వివాహమాడెను. కావున నోద్రుపదా! మారహస్యముం దెలియక యేలచింతించె దవు. పురుషునకు భార్యయొక్కతియే. స్త్రీకిపురుషుడునుఒక్క డే. ఈజన్మమునందుండుభార్య గాబోవుజన్మమున రెండుమూడు భాగములై పుట్టియతనినే పెండ్లాడును. ఆభావములో పురుషున కు బహుభార్యలని వేదాభిప్రాయము. ఈజన్మమందలిపతి రా బోవుజన్మమున రెండుమూడుభాగములైజన్మించి స్త్రీనివివా

హామాడుటకు ప్రకృతియిష్టపడదు * అందుచే స్త్రీకి ప్రతిజన్మమందును పురుషుడొక్కడే పూర్వజన్మమందలిస్త్రీయొక్క భర్తయే, రాబోవుజన్మములో రెండు మూడు నాలుగైదు భాగములైవచ్చి ఆస్త్రీని వరించుటకు కలిసి ఒకేకాలమున పెండ్లాడునట్టిచోటులు పురాణములందు రెండుమాత్రము చూపగల్గితిని. మాచర్యమూడవది యనుభావముగోచరించునట్టి వాక్యములు ధర్మజుడు ద్రుపదునకు వివరించెను. అయినను ద్రుపదునకు సందియము పోయినదికాదు. ఆసమయమున ధర్మమునుస్థాపింపదలచి వ్యాసమహర్షి యచట కరుదెంచెను. ద్రుపదుడాఋషిని తనధర్మసందేహము తీర్చుటకుకోరెను. ఋషి-రాజును ఏకాంతస్థలమునకు దీసికొనిపోయి విషయమంతయు చెప్పెను. కాని రాజునమ్మకుండెను. అపుడుదివ్యచక్షువు ప్రసాదించెను. ప్రత్యక్షముగ సత్యముచూచి విస్మయమొంది సంతసించి పాండవులకు ద్రౌపదిని పాణిగ్రహణముచేసెను.

భారతము. ఆదిపర్వము.

ఒకనాడింద్రుడొక కన్యాసహితుడైయుండు శివునిజూచి "ఎవడీతడు. స్త్రీతోనాటలాడుచున్నాడు." అనిపరిహసించెను. శివుడదివిని, అతనిస్థితియే, యతనికితెలియనపుడు నాస్థితి యతడెఱుంగుట దుర్లభమేయని నిశ్చయించి యింద్రునియొ

* ఈ సిద్ధాంతము బాగుగ దెలియదలచినవారు ఈగ్రంథమాలలోనుండిన "గృహారాజ్యము" అనుగ్రంథమును పఠించుటుచితము.

క్క- దురవస్థను తెలుపదలచి "ఓయిందాద్రి నాయవస్థతో నీకే మిపని. నీస్వరూపము-నీప్రారబ్ధము-నీభవిష్యత్తు- తెలిసికొను ము. పూర్వమునీవొనర్చిన పాపకర్మములచే నీరూపమెటుల విచ్ఛిన్నమై నానాత్వముజెంది పడియున్నదో యెఱుంగవైతివి. ఈపర్వతము శిఖరమునెత్తి అందుండుగుహలో చూడుము. నీ దశ వెల్లడియగు"ననిపల్కెను.

భారతం. ఆదిపర్వం.

తతోదేవోగిరిశో వజ్రపాణిం వివృత్యనేత్రే కుపితోభ్యువాచ| దరీమేతాం ప్రవిశత్వం శతక్రతో యన్మాంబాల్యాదవమంస్థాః పురస్తాత్| ఉక్తస్త్వేనం విభునా దేవరాజః ప్రవేపతాఙ్గో భృశమేవాభిషంగాత్| సప్రాంజలిర్భూత్వా వృషవాహనేన ప్రవేపమానస్సహసైవముక్తః| తమబ్రవీదుగ్రవర్చాః ప్రహస్యనైవంశీలాః శేషమిహాప్నువంతి| ఏతేప్యేవంభవితారః పురస్తాత్ తస్మాదేతాం దరీమావిశాస్త్రైవ శేష్వ| తత్రహ్యేవంభవితారోనసంశయో యోనింపర్వే మానుషీమావిశధ్వం॥7అధ్యా

తెలుగుభారతం. ఆదిపర్వం.

సీ॥ హరువచనమున నాగిరిరాజ వివ
రంబు గరములిబట్టి చెచ్చెరదినేశ|
చండమయూఖముల్ రెండువిధంబులై
యుండంగదెర్చి యాఖండలుండు|
తనయట్టివారల ఘనశరీరులనందు

నలువురనన్యుల వెలయఁజూచి।
యేనిట్టులేలకో యేను (అయిదు) ప్రకారంబు
లయితి నిందనుచు విస్మయముఁబొంది।
యున్నఁజూచిహరుడు గ్రన్ననయ్యింద్రుల
నేవురను మహానుభావ మెసగ।
మనుజయోని బుట్టుడనివంచెఁగీర్వాణ
హితముసేయుఁపొంటె మతిదలంచి॥

ఇంద్రుడు పర్వతశిఖరము నెత్తిజూడ నందు నాలుగు ఇంద్రరూపములుగోచరించెను. సోదరా! దీని భావమేమో తెల్సెనా? ఇంద్రుడుపూర్వమొనర్చిన విశ్వరూపవధ-వృత్రాసురవధ అహల్యాజారత్వము-మొదలగు పాపములవలన నతనిధర్మ-బల-రూపలావణ్యాశక్తులు, నాలుగుస్థలములందు దాగియుండెకదా. "ఇటులనాలుగుశక్తులను కోల్పోయిన దేవేంద్రా! నీశక్తులిటుల విభజింపబడి ఆఖండలుడవైన నీవిపుడు ఖండములుగనుండుట గ్రహించలేకుంటివి" అనియతని నాల్గుశక్తులయొక్కరూపములను శివుడతనికిగోచరంపజేసెను. కావుననేయింద్రుడా నాలుగైన తనరూపములజూచి తనతోగూడ నైదురూపములైతినని దుఃఖించినటుల తెలుగుభారతమందలి పైసీసపద్యములో తెలుపబడెను. కాబోవుదుర్యోధనాది రాక్షససంహారమెటులుంగుటంజేసి శివుడు దేవేంద్రుని కురుపక్షవిధ్వంసనార్థము మనుజయోనియందు పుట్టుమని శపించె.

మనుజయోనిబుట్టుడనివంచె
గీర్వాణ (దేవ) హితముసేయ
పొంతు మతిదలంచి.

యనుపైసీసపద్యాభిప్రాయ మిపుడర్థమైనదికదా? శాపములయొక్క యభిప్రాయములన్నియు నిటులేయుండును. కాగలకార్యమెటులైనగాకపోదు. శాపమావిషయమును వెల్లడించును. ఆకాశవాణిపలుకులిటులే యుండును.

ఎటులైనను దేవేంద్రుని సంహరించుటకు రాక్షసులు దుర్యోధనులై పుట్టెదరు. స్వరాజ్యరక్షణార్థ మింద్రుడు మనుజుడైపుట్టుట విధిగనున్నది. ఇంద్రశక్తి ఖండములై యిదివరకే విడిపడి యుండినందున నతడాశక్తుల బ్రత్యేకముగస్వీకరించి భిన్నరూపములజెంది పుట్టుటయు సహజమే. అటులజరుగబోవు దానిని సూచించుచు శివుడుశపించెను. కంససంహారణార్థము శ్రీకృష్ణుడవతరించునట్టి స్థితిపూర్వమేకలదు. కంసుడు తన చెల్లెలిని రథముపైనిడుకొని పోవునపుడాకాశవాణి జరుగబోవు కథను వెల్లడించలేదా. అటులనేశివునిపలుకులు నని బుద్ధిమంతులు గ్రహించెదరు.

ఈగాథకు పూర్వమేజరిగిన తత్సంబంధమైన తత్వము మరియొకటికలదు. ఆతత్వము క్రమముగ నీపంచేంద్ర తత్వమునుగా పరిణమించినది. బాగుగవినుము. ఇంద్రాంశమున పూర్ణల్యుండను మహర్షిజనించెను. ఇంద్రభార్యయైన శచీదేవి

యొక్కయంశము ఇంద్రసేన, లేక నాలాయని, యనుపేర మౌద్గల్యఋషికి భార్యగాపుట్టెను. ఈదంపదుల చరిత్రను గురించి వ్యాసమహర్షి భారతమున నిట్లువివరించెను.

ఆదిపర్వం. 7 అ.

వ్యాసుడు;—ఇది (ద్రౌపది) తొల్లినాలాయనియైన యింద్రసేన యనంబరగిన పరమపతివ్రత. మౌద్గల్యుండను మహా మునికి భార్యయయి కర్మవశంబున నమ్మునింగుష్ఠవ్యాధి బాధి త త్వగస్థిభూత కష్టశరీరు వయోవృద్ధు వలీపలితధరు...... పరమభక్తి నారాధించి తదుచ్ఛిష్టంబు కుడుచుచున్న నొక్కనాడు.

లే॥ కుడుచు నెడవాని పెనుఁ వ్రేలు కూటిలోన
దునిసిపడియున్న వ్రేల్ వుచ్చితొలఁ యజాక్షి
యేవగింపక యుచ్ఛిష్ట మిష్టలీల
దగిలి కుడుచుచున్నంత నత్తరుణిజూచి॥

వ॥ దానిదైన పతిభక్తిగుణంబునకు మెచ్చి మౌద్గ ల్యుండు ప్రసన్నుండై నీకెద్దియిష్టంబు వేడు మిచ్చెదననిన నది యిట్లనియె.

వ॥ మునీంద్రా నాకుంగామోప భోగేచ్ఛ పెద్దగలదు. తపశ్శక్తి కామరూపధరుండవై యీభీభత్సంబగు రూపంబుడిగి మనోహరంబైన యాకారంబునం బంచధా విభక్తుండవై నన్ను రమియించి కామభోగము లందనుపుమనిన నమ్ముని దానికిష్టం బైనవిధంబున నేను (అయిదు) దేహంబులందాల్చి.........

యింద్రసేన నుపభోగించి తృప్తుండై మౌద్గల్యుండామెను విడి ఘోరతపంబు సేసి బ్రహ్మమయుండై బ్రహ్మలోకంబునకుంజ నిన నది (ఇంద్రసేన) కామభోగంబుల దనియక కాలవశంబున శరీరంబువిడిచి కాశీరాజను రాజర్షికింబుట్టి పెరుగుచుగన్యాత్వంబున పెద్దకాలంబుండి తనదౌర్భాగ్యంబునకు నిర్వేదించి పతింగోరిపశుపతినుద్దేశించి యుగ్రతపంబు చేయుచున్నంత

సోదరా! శచీదేవి-ఇంద్రాంశమున జనించిన మౌద్గల్యునికి భార్యగాపుట్టి పతివ్రతయై కుష్ఠరోగియైన పతికిసేవచేయుచుండ అతడు వరముకోరుమనిన నయిదురూపములు ధరించి తనను సంతృప్తిచేయుమని యడిగెకదా ఆఋషి యపుడే, యోగశక్తిచే నైదువేషముల ధరించి యామెతో సంచరించెనని తెలిసికొనుము అతనికిజ్ఞానముకలిగి బ్రహ్మలోకమునకు బోయె. ఇకనింద్రసేనయొక్క స్థితివినుము.

ఆయింద్రసేనయు కొంతకాలమునకు మరణించి కాశీరాజుకు కుమార్తెయైపుట్టి తనపతియగు నింద్రుని పెండ్లాడనెంచి శివునిగూర్చి తపమొనర్చె. ఈమెపూర్వజన్మమున నైదురూపములుధరించిన పతితో సంసారమొనర్చినకథ మఱవకుము. ఆమెయందా పూర్వజన్మవాసనకలదు సుమా. ఆమెయొక్క పతియైన దేవేంద్రుడాతపోభావ మెరింగి యీమెకైదింటితోగాని తృప్తికానేరదని గ్రహించి యైదురూపములచే తానామెకు పతియైయుండదలచి దేవసభలో యమవాయ్వశ్వినుల నంగీక

రింపజేసి యీయైదుగురు కలిసి తపమొనర్చు నాకన్యయెదుట ప్రత్యక్షమై

"ఓవనితా! నీకీజన్మమున పతిలభించుటకు వీలులేదు. ఈదేహమువిడిచి మఱియొకజన్మంబున నీవుపుట్టినపుడు మా యంశములనుండి పుట్టిన మాయైదురూపములచే నిన్నువివాహమాడి సౌఖ్యపెట్టదలచితిమని" చెప్పి యంతర్ధానమైరి.

తే॥ దానికడకు బ్రత్యేకంబు ధర్మవాయు|
వాసవాశ్వినుల్ ప్రీతులైవచ్చి దాని|
నాత్మ దేహాంశజులకు దేహాంతరమున|
బత్నిగానోరి రధిక సౌభాగ్యయుక్త॥ భారతం.

ఆమె యేదేవుని జపించుచున్నదో యాశివుడు ప్రత్యక్షముకానందున తపము నిలుపలేదు.

భారతం.

వ॥ అదియునుం గొండొకకాలంబు జలానిలాహారి యై......... అత్యుగ్రతపంబుసేసిన యీశ్వరుండు ప్రసన్నుండై వరంబువేడుమనిన నక్కన్యక నాకుం బతిదానంబు ప్రసాదింపుమని యర్థిత్వంబున నేనుమారులు (అయిదుమారులు) వేడినం గరుణించి యీశ్వరుండు నీకు దేహాంతరంబున నేవురు (అయిదుగురు) పతులగుదు రనిన నదియిట్లనియె.

ఆ॥ సతికి నొక్కరుండ పతిగాక యెందును
బతులు పలువురగుట కతలగలదె|
లోకనాథ యిట్టి లోకవిరుద్ధంపు|

వరముపడయు నమరవర్ధ యొల్ల॥

వ॥ అనిన దానికిగు రుద్రుండిట్లనియె॥

క॥ నావచనంబున నీక

య్యేవురు పతులందు ధర్మ వైకల్యంబు

గావున నిట్టివరం బిం

దీవర దళ నేత్రియిచ్చితిని దయతోడన్॥

(ద్రౌపదియైదుగురిని బెండ్లాడుట వేదవిహితములో నిహితముకాదని విన్నవింప రుద్రుండిది దైవవిధియనియు ధర్మ సూక్ష్మమనియు తెలిపి ఈవివాహముమాత్రము ధర్మహాని చేయకుండునని వరమిచ్చెను.) సోదరా ఆకాలమున నొకస్త్రీ బహుపతుల జేసికొనుచుండు నాచార మేయున్నయెడల ద్రౌపది శివునితో బహుపతుల బెండ్లాడుట దోషమని చెప్పియుండదుసుమా దీనిచే పూర్వాచారమున స్త్రీకిబహుపతులు లేరని తెల్లమగుచున్నది.

ఆదిపర్వం 7 అ. 265

వ॥ అనినం నది, యట్లేని నయ్యేవురు పతులయందును ప్రత్యేకసంగమంబునను నాకు కౌమారంబును బతిశుశ్రూషాసిద్ధియు గామభోగేచ్ఛయు సౌభాగ్యంబునుం బ్రసాదింపవలయు ననిన, రుద్రుండు దానికోరినవరంబులెల్లనిచ్చి గంగాతీరంబున నన్ను యుండుయినాయొద్దకుందోడ్కొని రమ్మని పంచినవల్లెయని పంచపతులవివాహమాడినను దోషమురాదని యాభయ మొసంగినను ఆమెకు భయముతీరినదికాదు. "ఓరుద్రా! ఆయుదుదు

గురిలో నొకనివద్ద కాపురముచేయునపుడు మిగిలిననలుగురి యందు కామేచ్ఛజనించకుండునట్లును, ఆ మొదటివానినివిడిచి రెండవవానితోను, రెండవవానినివిడిచి మూడవవానితోను కాపురముచేయదలచి వెళ్లినపుడు నాకుకౌమారసిద్ధియుననగా, నొకపురుషునితో సంచరించిన పిమ్మట రెండవవానితో సంసారముచేయనెంచినపుడు మొదటివానివద్ద యేరూపముతోనుంటి నో ఆరూపముపోయి నూతనదేహముకలిగి శుద్ధమైన కన్యనైయుండునట్లును, అందువలన రెండవవానికి మొదటివానితో కాపురముచేసినట్టిస్త్రీకాక, మఱియొకస్త్రీ కాపురముచేసినవిధమున నుండునట్లును, కోరియిటుల "తథాస్తు" అనుపించుకొనెను.

సంస్కృతభారతం. ఆదిపర్వం. పంచేంద్రోపాఖ్యానం.

వ్యాసః॥ ఆసీత్తపోవనేకాచిదృషేః కన్యామహాత్మనః। నాధ్యగచ్ఛత్పతింసాతు కన్యారూపవతీసతీ। తోషయామాస తపసాకిలోగ్రేణశంకరం। తాముమాచేశ్వరః ప్రీతోవృణుకామ మితిస్వయం। సైవముక్తాబ్రవీత్కన్యా దేవం వరదమీశ్వరం। పతింసర్వగుణోపేతం ఇచ్ఛామీతిపునఃపునః। దదౌతస్యైసదే వేశస్తంవరం ప్రీతమానసః। పంచతేపత యోభద్రే భవిష్యంతీ తి శంకరః।.............ఏకంపతింగుణోపేతం త్వత్తోర్హామీ తి శంకర।.............పంచకత్వ స్త్వయోక్తోహం పతిందే హీతివైపునః।............దేహమన్యంగ తాయాస్తే సర్వ మేతద్భవిష్యతి। ద్రుపదస్యగాహిసాజజ్ఞే సుతావైదేవరూపిణీ।

పంచానాం విహితాపత్నీ కృష్ణాపార్షత్యనిందితా। స్వర్గశ్రీః (శచీదేవి) పాండవార్థంతు సముత్పన్నా మహామఖే।

సప్తనవత్యధిక శతతమోధ్యాయః॥

అని ద్రుపదమహారాజుకు వ్యాసుడు తెలిపెను.

సంస్కృతభారతం. ఆదిపర్వం.

ఈ ద్రౌపది పూర్వజన్మమున తపమొనర్చి శివుడుప్రత్యక్షముకాగా నతడయిదుగురు పతులను వివాహము చేసికొనుమనెను. ద్రౌపది.

శ్లో॥ ఏవంగతే ధర్మపథే నవృణేబహుపుంస్కతాం।

అలోకాచరితాదస్మా త్కథం ముచ్యేహసంకరాత్॥

"స్త్రీకిబహుపతులుండుట యధర్మముకదా. మఱియు నది సంకరకార్యము. లోకాచారవిరుద్ధము" అనియెంత చెప్పినను ధర్మసూక్ష్మమెఱింగినవాడగుటచే, తానుపూర్వమిందుౖనకు మనుజయోనిబుట్టుమని శపించియుండుటచేతను, ఆయింద్రుడే యిపుడుపంచపాండవరూపమును ధరించుగావున, తప్పనికార్యమనియెంచి ద్రౌపదినియొప్పించెను. ఆమె దైవవిధియని యెఱింగి

శ్లో॥ యదిమేపతయః పంచవరమిచ్ఛామి త్వైర్మిథః।

కౌమారంచ భవేత్సర్వైః సంగమేసంగమేచమే॥

రుద్రా! నీయాజ్ఞనుల్లంఘింపజాల. ఒక్కొక్కసంవత్సరమొక్కొక్కభర్తవద్దనుండెద. ఏశరీరమొకపతివద్ద నొకవత్సరముండెనో ఆశరీరము రెండవపతినిస్పృశించకుండునటుల వరమిమ్ము. అనగా ప్రథమపురుష సంపర్కము చెందిన శరీరముమారి

ద్వితీయపురుష సమావేశకాలమున నూతనముగ స్వచ్ఛముగ నుండులాగున నాకుకౌమారత్వసిద్ధిని కలుగ జేయుమనెను. శివుడటుల

శ్లో॥ పంచభిః పాణిగ్రహణపరిభ్రష్టం కౌమారం మహాభాగాభవిష్యతి॥ నామెకు కౌమారత్వఅనగా కన్యాత్వసిద్ధినొసంగె.

శ్లో॥ ఇదంచతత్రాద్భుతరూపముత్తమం।
జగాధదేవర్షి రతీతమానుషం। మహా
నుభావాకిల సాసుమధ్యమా।
బభూవకన్యైవగతే గతే హని॥

శ్లో॥ క్రమేణచానేన నరాధిపాత్మజా వర
స్త్రియస్తే జగృహుస్తదాకరం।
అహన్యహన్యుత్తమరూపధారిణో।
మహారథాః కౌరవవంశవర్ధనాః॥

ఆదిపర్వం. ద్రౌపదీవివాహం.

ఆద్రౌపదిధర్మజుని వివాహమాడునపుడు ఏశరీరమున్నదించెనో, ఆశరీరములోకరీతిగ మఱియొకనిఅనగా భీమునిపెండ్లాడుటకు వీలులేనందున, శివవరప్రసాదముచే నామెకన్యారూపముధరించి భీముని పెండ్లాడెను. మూడవసారియు రెండవరూపమువిడిచి కన్యయై యర్జుని బెండ్లాడెను. ఇటులపాతివ్రత్యమును కాపాడుకొనిన ద్రౌపదీవృత్తాంతము సాధారణజనులు గ్రహించుటదుర్లభమేయగును.